# తాళ్ళపాకవారి గేయరచనములు

## ౧౨-వ సంపుటము

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయ గ్రంథమాల : సంఖ్య 56

సంపాదకులు :— శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డి, ఎం. ఏ.



## తాళ్ళపాకవారి గేయరచనములు

౧౨-వ సంపుటము

# శృంగార సంకీర్తనలు

అన్నమాచార్యరచితములు

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయములో సంగీతవాఙ్మయపరిశోధకుఁడగు

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మచే

పరిశోధింపఁబడినవి.



తిరుమల తిరుపతి దేవస్థానం బోర్డు ఆఫ్ ట్రస్టీస్‌వారి తరపున

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారగు

శ్రీ చెలికాని అన్నారావు బి. ఏ. గారి అనుమతిని

ప్రకటింపఁబడినది.

శ్రీ

# పీఠిక

శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల శృంగారసంకీర్తనల సముద్రమును ఈ ౧౨-వ సంపుటముతో ఈఁదుటకు ప్రారంభించినట్లైనది. మొత్తము ౨౦౦౨ గల ఆ సంకీర్తనల రేకులలో మొదటి నూఱు రేకులందలి సంకీర్తనలిందు పరిశోధితములై ప్రకటింపఁబడినవి. రేకులలో ౧౯, ౯౬, ౯౭, ౯౮, ౯౯, ౧౦౦ సంఖ్యల రేకులు మాకు లభింపలేదు. మఱి నాల్గవ సంపుటమున, ౩౧-వ రేకులోని మూఁడవసంకీర్తన మొదలు ౭౦ వఱకుఁగల రేకులలోని సంకీర్తనలన్నియు కీ॥ శే॥ శ్రీ ప్రభాకరశాస్త్రిగారి చేతి మీఁదుగా పరిశోధితములై ప్రచురింపఁబడినవి. తక్కిన సంకీర్తన లన్నియు ఈ సంపుటమున క్రమముగా చేర్పఁబడినవి. ౧౧-వ సంపుట మందువలె ఇందును సాధారణపురేకులు (సా-రే.), నిడురేకులు (ని-రే.), పెద్దరేకులు (పె-రే.), తంజావూరి సరస్వతీభండారపు వ్రాఁతప్రతి (తం-ప్ర.), శ్రీ తాళ్ళపాక వేంకటశేషాచార్యులవారింటి వ్రాఁతప్రతి (తా-వెం.) - అను నైదు మూలములను పోల్చి సరిచూచి పాఠములను నిర్ణయించితిని. పాఠ భేదములు క్రింద సూచింపఁబడినవి.

అధ్యాత్మసంకీర్తనలు ఏఁబదేఁబది రేకులలోనివి ఒక్కొక్క సంపుటముగా ఇంతకు ముందు ప్రచురణకెక్కినవి. ఇఁకముందు శృంగారసంకీర్తనలు నూరునూరు రేకులవి ఒక్కొక్క సంపుటముగా చేర్చి ముద్రించు సంకల్పమున్నది. ఈ మహాకార్యము త్వరగా సాఁగుటకిది కొంత యుపకరించునని, సంపుటములుగూడ చేతికందముగా అందుపాటుగా నుండఁగలవని, నానమ్మిక.

1937-వ సంవత్సరమున శ్రీ తిరుమల - తిరుపతి దేవస్థానముల వారు ప్రచురించిన 'The works of Thallapaka poets, Vol. III' అను సంపుటములో అపక్రమముగా ప్రకటితములైన అన్నమాచార్యుల

శృంగారసంకీర్తనలు ఈ సంపుటమునుండి యథాక్రమముగా పరిశోధిత పాఠములతో వెలువడుచున్నవి.

శృంగారరసవీథులు వివిధజాతీయ దేశీయభాషావిశేషములకాకరములు. కనుక "విదితార్థ గ్రామ్యోక్తులు - పదిలముగాఁ బొంకమెఱిఁగి పలుకఁగఁ జెల్లుఁ" అనుటయు, "ఉచితభాష పదములఁ జెల్లుఁ" అనుటయు అన్నమాచార్యుల యభిప్రాయమని చినతిరుమలాచార్యుఁడు 'సంకీర్తన లక్షణము'న తెలిపినాఁడు. (ప్ర. ౨౫, ౨౬.) మరి వ్యాకృతము అవ్యాకృతమునైన భాషను 'ఇదం బ్రాహ్మమిదం క్షాత్రం' అన్నట్లు నిర్లక్ష్యముగా లొంగఁదీసికొని ప్రయోగించు సిద్ధహస్తుఁడు అన్నమాచార్యులు. ఆయన రసావేశముతో పాడిన పాటలు విని వ్రాఁతకెక్కించినవారు, రేకులపై చెక్కునప్పుడు చెప్పినవారు, చెక్కినవారును శబ్దస్వరూపములు సంధులు మొదలగు విషయములందు వారివారి వ్యుత్పత్తికిని అభ్యాసమునకును తగినట్లు ఎన్నోమార్పులు చేసియుండక తప్పదు. అరసున్నల, బండిఱాల ప్రయోగవిషయమున పద్ధతియు పట్టుదలయు రేకులు గీసినవారికున్నను వ్యుత్పన్నమైన నియమమున్నట్లు గానరాదు. రేఫఱకార నిర్ణయమును ఎంతో శ్రద్ధతోచేసి విధించిన పెద్దతిరుమలాచార్యుల అధ్యక్షత క్రిందనే జరిగిన యీరేకుల లేఖనములో ఆ రెంటి విషయమునఁ గానవచ్చు అవ్యవస్థ వింతగా తోఁపక పోదు. ని-రే.ల లోని పాఠములు సా-రే.ల లోను, వానిలోనివి పె-రే.ల లోను కొంతకొంత సవరించినట్లున్నవి. ఇట్టి స్థితిలో అన్నమాచార్యులనుగ్రహించిన శబ్దరూపముల యాథాతథ్యము నిర్ణయించుట అసాధ్యము. ఆ కాలపు శబ్దముల వ్యవహారస్వరూపము తెలియుటకై ప్రాయశః ఆయా రూపములట్లట్లే ఇందు నిలువరింపఁబడినవి. నేఁటి పఠనరీతికనువుగా కొన్ని చిఱుమార్పులు మాత్రము చేయక తప్పినది గాదు.

అన్నమాచార్యుల శృంగారభావనలు ఆధ్యాత్మికముగా అసాధారణములైనవి. ఆధిభౌతికముగా అతని యనుభవములును అట్టివేయని యూహింపవచ్చును. కనుక ఈ శృంగారసంకీర్తనలలో ప్రతిఫలించిన

పురుషోత్తముఁడగు శ్రీ వేంకటేశ్వరుని విశ్వశృంగారలీలలు, ఆ నిరంకుశ ప్రవాహములో ఈఁదులాడుచు తలమునకలై తనుకులాడు విశ్వజీవనాయి కల వింతవింతలైన అనుభవాలు, వానిని వెలుపఱుచు వివిధములగు సందర్భములు, వాక్యములు, పదములు, - అన్నియు అసాధారణములుగానే యుండుటయందాశ్చర్యమేమియు లేదు. యథాశక్తిగా వానిని తెలిసికొని సంతరించు ప్రయత్నమిందు చేసితిని. కాని ఎన్నో సందేహములు నిరుత్తర ముగా నిలిచినవి. పరిశోధనరసికులకు ఇఁకముందు ఎంతోపని యిందు గలదు. భావుకులైన పండితులును గాయకులును ఈ రచనల రసాను భవమును ప్రజలకందఱికిని పంచిపెట్టవలసిన పూఁటకాపులు.

ఈ కార్యము నాచే ఇంతవఱకు చేయించినది శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల నిర్వాహకులగు శ్రీ చెలికాని అన్నారావుగారి నిర్హేతుక దయ యని, ఈ శ్రీనివాసకైంకర్యమును ఫలమును వారివే యని, చెప్పుట పున రుక్తి, దీనిని తుదిదాఁకించు నవకాశము గల్పించి శ్రీ వేంకటేశ్వరుఁడు వారి ననుగ్రహించుఁగాక !

శ్రీ తిరుమల తిరుపతి దేవాలయ ముద్రాశాలవారు దీనినింత యంద ముగా ముద్రించి నా ధన్యవాదములకు పాత్రులైరి.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యా<br>పరిశోధనాలయము, తిరుపతి.<br>4—10—1956.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ,<br>సంగీతవాఙ్మయ పరిశోధకుఁడు.

శ్రీ

శుభమస్తు

శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీ తాళ్లపాక

# అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౩౪౬ అగు నేఁటి క్రోధి సంవత్సరమందు తాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన పదారుయేండ్లకు తిరువేంగళనాథుఁడు ప్రత్యక్షమైతేను అదిమొదలుగాను శాలివాహనశకవరుషంబులు ౧౪౨౪ అగు నేటి దుందుభిసంవత్సర ఫాల్గుణ బహుళ ౧౨ నిరుధానకు [1] తిరువేంగళనాథునిమీఁదను అంకితముగాను తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగారసంకీర్తనలు.

1-వ రేకు. శ్రీరాగం

ఏ వూరికేవూరు యెక్కడికి నెక్కడ
నీవు మాకు నిఁకనేల నిజమైనాఁ జెప్పరా ॥పల్లవి॥

అద్దమరాతిరిదాఁకా సందునిందు నుండివచ్చి
వద్దువోరా నీకునింత వలసినొల్లములు
నిద్దుర గంటికి లేక నీకునుండ వారమా [2]
వొద్దిక చాలని వారముండినా నుండితిమి ॥ఏవూ॥

వేఁకమైన పరితాప వేదనఁ బొరలలేక
కాఁక పుట్టి తిరిగేవు కన్నుగానలేక [3]
యేఁకట దీర నీకు నెందరు గలరని [4]
వోఁకల పులుసు కలువులఁ బుచ్చవలెనా [5] ॥ఏవూ॥

---

1. ఈశబ్దము అపరిచితము. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 'నిరోధానకు ? తిరోధానానకు ?' అని సందేహముతో పాఠము సూచించిరి. 'సరిగా' అను నర్థమున ప్రయోగించినట్లున్నది. ఇది యింకను అన్వేషణీయము. 2. ని. రే. ౪౩. నీకు నుండనేలనీ. 3. గాననేరక. 4. గలరు ఈ. 5. బుచ్చనేలరా.

అందఁగాఁడ తిరువేంకటాద్రీశ పెక్కెండ్ల
విందవై [1] నీవా (కొ?) కతైపై వెచ్చఁదన మున్నదా
మందెమేళమున నీతో మాటలాడితిమి గాక [2]
కందువ మన్నన చాలు కలకాల మెల్లను. ॥ఏపూ॥ 1

భైరవి

గందము పూసేవేలే కమ్మని మేన యీ
గందము నీమేనితావికంటె నెక్కుడా ॥పల్లవి॥

అద్దము చూచేవేలే అప్పటప్పటికిని
అద్దము నీమోముకంటె నపురూపమా
ఒద్దిక తామరవిరినొత్తేవు కన్నులు నీ
గద్దరికన్నులకంటె కమలము ఘనమా ॥గంద॥

బంగారు వెట్టెవేలే పడఁతి నీ మెయినిండా
బంగారు నీతనుకాంతి ప్రతివచ్చీనా
ఉంగరాలేఁటికినే వాడికపువేళ్ళ [3]
వెంగలిమణులు నీ వేలిగోరఁ [4] బోలునా ॥గంద॥

సవర మేఁటికినే జడియు నీ నెరులకు
సవరము నీకొప్పునరి వచ్చీనా
యివలఁ జవులు నీకునేలే వెంకటపతి
సవరని కెమ్మోవిచవికంటేనా. ॥గంద॥ 2

ఆహిరి

దంటమాటలనె నన్నుఁ దాఁకనాడేవు వోరి
జుంటితేనె తీపులెల్లఁ జూరలాడేవా ॥పల్లవి॥

అత్తయింటికోడల నన్నమ్మమీఁద నేరా నీ
తొత్తుఁ దిట్టినట్టె తిట్ట దొరకొంటివి

---

1 ని. రే. ౪౩. విందవు నీ. 2. తిమి నీ. 3. తా. వెం. రేఁటికే యువిద నీవేళ్ళకు.
4. ని - రే - ౧౦౭. గోరిఁ బోలునా.

మెత్తనైతే దిగఁబడి మేరమీరి యింతలోనే
ఒత్తుక వచ్చేవు చక్కనుండ నేరవా ॥దంట॥

పంతపుమగఁడు గల పడఁతి నన్ను నేరా నీవు
కొంతైనా వెఱపులేక గోరనంటేవు
ఇంతలోనే వేలువెట్టి యిమ్ము గైకొని వలపు
దొంతులు వేరిచేవు బదుకనియ్యవా ॥దంట॥

ఊరివారి యింతి నన్ను వుద్దండపుఁదుటారాలఁ
బేరుకుచ్చి సొలయుచుఁ బిసాళించేవు
గారవించి తిరువేంకటరాయ నీవు నన్ను
యేరా నాగుట్టింతయు బాయిట[1] వేసేవా. ॥దంట॥ 3

ఆహిరి

సంగతెఱగవు చీ జాణనందువు
మంగలాన జాజులు వేమారు వేఁచేవు ॥పల్లవి॥

అంగన వొకతె నీకు ఆకు మడచియ్యఁగా
బంగారుతూఁగు మంచముపై నీవుండి
వుంగరాల వేళ్ళతో నువిదమొలనూళ్ళ
చెంగటఁ జాచిన ఆచేత నన్నంటేవు ॥సంగ॥

పడఁతి వొక్కతె నీకు పాదములొత్తఁగను
బడలి కప్పురశయ్యపై నీవుండి
కడుఁ దమకమున నెక్కడో మోవఁ జాఁచిన
పడిగపుఁ బాదాలు నాపైఁ బారఁజాఁచేవు ॥సంగ॥

ఇచ్చల నొక్కతె గుబ్బలెదురు చూపఁగను[2]
పచ్చలు దాచిన మేడపై నీవుండి

1. ని. రే. ३॰. గుట్టింతయు బయలు సేసేవా. 2. ని. రే. ౬౫. చూడఁగను.

వెచ్చని మేనితోఁ గూడి వేంకటేశుఁడ నీ
వెచ్చపుఁ గౌఁగిట నన్ను వేసాలఁ బెట్టేవు. ॥సంగ॥ 4

కాంబోధి

రాంటే మానుఁగాక [1] రంతులేఁటికే
వేఁకపు గుబ్బలాండ్ల విటుఁడాఁతఁడు ॥పల్లవి॥

అంపిన కప్పురమొల్లనంటేఁ దాసనుఁ గాక
పంపుమోముతోడ నీకు వాడనేఁటికే
చెంపల లప్పలు నిండఁ జెరిగిన కప్పురపు
గంపకొప్పుల సతుల ఘనుఁడాతడు ॥రాకుం॥

ఒద్దికగాకక్కడనే వుంటేఁ దానుండుఁ గాక
ముద్దుమోము వంచి నీకు మొక్కనేఁటికే
చద్దికి వేఁడికి మంచిచక్కనిసతుల మోవి
పొద్దువొద్దుకారగించే భోగి [2] యాతఁడు ॥రాకుం॥

అబ్బురపు వేంకటేశుఁడైతేఁ దానవుఁ గాక
గబ్బి చూపులెల్లా నీకైఁ గప్పనేఁటికే
జొబ్బిలేటి జవ్వాదిసోనల పన్నీట నన్ను
గుబ్బలంటి సరసానఁ గూడెనాతఁడు. [3] ॥రాకుం॥ 5

2-వ రేకు. శ్రీరాగం

తగిలిన మునులే యాతనిఁ గందురంటా [4]
మగువ యెవ్వరితోడ మాటాడదిపుడు ॥పల్లవి॥

అతులనిరాహారులతనికిఁ బ్రియులంటా
అతివ నిన్నటినుండి యారగించదు
తతి నడవులనుండే తపసులే యతనికి
హితులంటా వనములో నెడయదీ తరుణి ॥తగిలి॥

---

1. ని.రే. ౫. మానుఁగాని. 2. ని.రే. ౯౦. భోగాతఁడు. 3. ని.రే.౫. గూడి నాఁడతడు. 4. ని. రే. ౧౧౩. 'అంట' అని హ్రస్వముగానే పదమంతటను గలదు.

తలకొన్న యతనిపై తలఁపే పరమంటా
చెలియ చెక్కిటనున్న చెయి దియ్యదు
వలనైన యతఁడు దేవతలకొడయఁడంటా
కలికి రేయిఁబగలు కనుముయ్యదిపుడు ॥తగిలి॥

అడరి జలములోన నతఁడుండునంటా
వడియుఁజెమట దుడువదు మేనను
కడు మంచియతఁడు వేంకటగిరివిభుఁడంటా
పఁడతి యాతనిసె గుబ్బలనొత్తీనిపుడు. ॥తగిలి॥ 6

## ముఖారి

ఏఁటికి విచ్చేసితివో యెట్టుదెలుసు మాతో.
మాటలాడఁగా నీకు[1] మాటవచ్చీఁ జుమ్మీ ॥పల్లవి॥

అప్పన[2] గొంటివో లేదో ఆకెచేత నేడైనా
ఇప్పుడే మాయింటిదాఁకా నేఁగేనంటా
యిప్పటి యీతమకాన యింతలోని పనికిఁగా
చెప్పక వచ్చిసనాకె చేరనీదు సుమ్మీ ॥ఏఁటి॥

అనుచరించితో లేదో ఆకెనే ముందరనైనా
వెనక నాతోడ నవ్వేవు గాని
ఘనుఁడవూరకే నన్నుఁ గదిసేవు కడుఁబై
కొనఁగ నాకె విన్న కోపగించుఁ[3] జుమ్మీ ॥ఏఁటి॥

ఆరగించితో లేదో ఆకెపొత్తుననే యింత
గారవము లేక మోము కళదేరదు
చేరి కూడితివి నన్ను శ్రీ వేంకటేశుఁడ యింత
యీరసాన నాకె విన్న యేమనునో సుమ్మీ. ॥ఏఁటి॥ 7

1. పె. రే. ౧. మాఁట. 2. అప్పణ. 3. ని. రే. ౭౧. కోపగించీఁ.

ఆహిరి[1]

కోపములిద్దరిలో గోరగించీఁ జూడరే
పైపైనె జవరాలు పంపెడి నింతులను ॥పల్లవి॥

అమ్మ విలువగఁనంపె నాతని రమ్మనరే
దిమ్మరై వీదులవెంటఁ దిరిగీనని
కమ్మరఁ గమ్మరనేల కలహామిద్దరిలో
దుమ్ములుగాఁ గస్తూరి ధూళి లేచె మేనులు (ల?) ॥కోప॥

దేవులమ్మ విలిచీని దేవుని రమ్మనరే
ఆవలనెవ్వతెకు లోనాయెనో యని
తావుల బుగులడిచి త (చీఁద ?) నువెల్లానిదివో
లావాయ జగడాలు లలనకుఁ దనకు ॥కోప॥

లకిమమ్మకేమైనా లంచములిమ్మనరో
శుకవాణి తలుపు మూసుక తియ్యాడు
వెకలియై సతిఁగూడె వేంకటేశ్వరుఁడు
ఒకరొకరికి లోలో నొద్దికలు ఘనము. ॥కోప॥ 8

ముఖారి

అతఁడే యెఱఁగఁడా ఆకెలాగు
రాతి గుండెతోడఁ దా[2] రాకుంటే మానసీ ॥పల్లవి॥

అద్దో నేమెందాఁకానైనాఁ గాచుకుండలేము
వొద్దనే యెంతవడైనా నోసి రావే
అద్దికపువారము నేమమ్మ గడుఁ గోపగించి
వొద్దువోయ రాకుంటేఁ బోనీవే తాను ॥అత॥

అంతేవో మదిరాక్షి యీడ మాకెదురు చూచీ
ఎంతైనాఁ గద్దుపని యీడనేలోసి

1. వి. రే. ౩౩. ముఖారి. 2. పె.రే. ౧. గుండెవాఁడై యుండి.

పొంత నూడిగము సేసే పొద్దాయ దేవులకు
కాంతుఁడు మీఁదటియెత్తు గననీవే తాను ॥ఆత॥

మేలే వేంకటపతి మెల్లనె విచ్చేసినాఁడు
వేళమె అక్కకు విన్నవింతమోసి
ఆలకించి వుండుదము అందరము వాకిటను
లోలోఁ దానాకెఁ గూడి లోలుఁడాయఁ దాను. ॥ఆత॥ 9

ఆహిరి

ఇంత పమ్మిట్లా నెలయుంచకురా నీ
పంతములన్నియుఁ బారఁ బట్టింతునోరి ॥పల్లవి॥

అతిరాజసపు మాటలాడకురా యే
కతమైన నాచేతఁ గడు నొత్తువోరి [1]
ఇతరులవలె నన్ను నెంచకురా నీ [2]
మతి చొచ్చి నీమేను మఱపింతునోరి ॥ఇంత॥

[3] చెలఁగుచు గుంపెనలు సేయకురా నీ
సిలుగు మాటల నిన్నుఁ జిక్కించుతునోరి
చలివలపులు మాపైఁ జల్లకురా యీ
కులుకు గోళ్ళ నిన్ను గుంపింతు నోరి ॥ఇంత॥

జంకెనచూపులఁ బగ చాటకురా నే
నింక నిన్నుఁ బోనియ్య నెంతైన నోరి
లంకెల నీ పొందులు దలఁచకురా తిరు
వెంకటేశ నానేరుపు [4] వెచ్చింతునోరి. ॥ఇంత॥ 10

---

1. ని. రే. ౩౦ - నొంతురోరి. 2. యీమతి. 3. దీనిలో నీచరణమిట్లున్నది : 'చెలరేగి నీ చేఁతలెల్ల జెప్పకురా యీ, పొలయలుకల నిన్నుఁ బొక్కించుతునోరి। చలివలపులు మాపైఁ జల్లకురా. చిలుకు మాటల నిన్నుఁ జిక్కించుతునోరి'. 4. నా వేర్పు వెంచింతు.

సామంతం

ఇచ్చకాలు నాకు నీకు నిఁక నేలరా నీ
యచ్చపుఁ గోరిక [1] నాతో నానతీరా వోరి ||పల్లవి||

అమ్మితి నామేను నీకు నప్పుడె వోరి చూపుఁ
జిమ్ముల నేఁచకేమైనాఁ జిత్తగించరా
అమ్మకచెల్ల నే నీకు నడ్డమా వోరి యింపు
సొమ్మరింపుచు నాగుట్టు కొల్లగొంటివోరి. ||ఇచ్చ||

జట్టి గొంటివిదె నన్నుఁ జాలదా వోరి యీ
చిట్టంట్ల నీవేఁచక [2] చిత్తగించరా
ఎట్టైనా నే నీకింత యెదురా వోరి నీ
పట్టిన చలమే చెల్లె బాపురా వోరి ||ఇచ్చ||

వేసాల వేంకటగిరివిభుఁడా నేఁడోరి నీ
సేసిన మన్ననలిట్టె చిత్తగించరా
వాసన కస్తూరిమేని వన్నెకాఁడ నీ
యాసల మేకులే దక్కెనద్దిరా వోరి. ||ఇచ్చ|| 11

3-వ రేకు. శ్రీరాగం

మగువ వూర్పులనైన మనుఁగా చలిగాలి
నిగుడుఁగా జగమెల్ల నిండఁ దనరూపు ||పల్లవి||

అతివవదనము వాడ నలరి చందురుఁడైన
బ్రతుకుఁగా వొకకొంత బయలుమెరసి
సతి యెలుఁగు రాయి విరసపుఁ బికావళియైన
తతిఁ జెలఁగుఁగా నేఁడు తమకెదురు లేక ||మగు||

తెలివ వేనలి చెదర తేఁటి మొత్తములైన
మెఱయుఁగా వొకకొంత మేలుగలిగి

1. ని. రే. ౪౪. గోపము. 2. నే వేఁచక.

ఒఱిగి యలసతతోడ నువిద కనుమోడ్పుగా[1]
నెఱిఁ గలువలలరుఁగా నేఁటిమాపైన ॥మగు॥

తరుణి దేహము నాఁటి దర్పకుని శరమైన
పరిమళము నిండుగా బహువిధమున
[2]కరిగమననిపుడు వేంకటవిభుఁడు కౌఁగిటను
కరుణించ లతలైనఁ గాంచుఁగా తెలివి. ॥మగు॥ 12

సామంతం

ఎట్టు వోరిచెనో కాని యింత దడవు - అప్పు
డట్టు నిట్టుఁ దల్లడించె నతఁడంతలోననే. ॥పల్లవి॥

అంటఁగాక వున్నదానవని యెఱుఁగక యాతఁ
డింటికిట్టె రాఁగా నీవు నెదురువోయి
వొంటకున్నరీతి దవ్వులనున్న నిన్నుఁ జూచి
అంటఁజేరి చిన్నఁబోయె నతఁడంతలోననే ॥ఎట్టు॥

వేడుక నాతఁడు రాఁగా వెనకవెనకకుఁ[3] బోయి
తోడనే సిగ్గును నవ్వుఁ దొలఁకఁగాను
వీడివీడని కొప్పు విసరుచుఁ దలయూఁచ
నాడనె మూర్ఛవోయె[4] నతఁడంతలోననే ॥ఎట్టు॥

చయ్యనఁ బన్నీటి మజ్జనమాడి నీవు నేఁడు
ఉయ్యాలమంచముమీఁద నుండఁగాను
నెయ్యవు వేంకటపతి నిన్నుఁగూడి పరవశ
మయ్యానబ్బురముగ నతఁడంతలోననే. ॥ఎట్టు॥ 13

---

1. పె. రే. ౧. మోడ్పుఁగా. 2. ఇది ని. రే. ౧౦౧ లోని పాఠము, అన్వితము. స్టా.రే.లోని పాఠము 'గరిమ నన్నిపుడు' అనన్వితము. 3. పె. రే. ౧. వెనవెనకను. 4. ని. రే. ౬౬. నాడఁ జెలిపైనొరగె నాత.

రామక్రియ [1]

రాగదే చూతఁడిదె రసికుఁడగు కెలవాడి
కౌఁగిటి రమణితోడి కనకగిరి వాని ॥పల్లవి॥

అదిగదె వసంతంబులాడీఁ గూడి
కదలుఁగనుఁగవల చక్కనిసతులతో
వెదకి పైకుంకుమలు వేసీ రాసి
వుదుటుచనుదోయిపై నొదిగి వొదిగి ॥ రాఁగ ॥

కడుఁ బేర్చి నేతికడవల గుబ్బెతలఁ జేరి
అడుగడుగునకు నాటలాడి
నడిమి సన్నపుసిరుల వగవు రెప్పల గరుల
తొడికి చెనకీనదివో దొరదైవము ॥రాఁగ॥

దప్పి దేరంగ సైఁదపుఁగుడుములును వడలుఁ
బప్పులునుఁ బన్నీటి పానకములు
అప్పఁడగు కెలవాడి అదె కనకరాయఁడై
కప్పురము చల్లి చక్కనిసతులపైని. ॥రాఁగ॥ [2] 14

భైరవి

సిన్న వాఁడవని నమ్మ నెల్లదు నిన్ను
సిన్నెనైన యాటదెల్ల సిక్కుసీరై పోయను ॥పల్లవి॥

---

1. ని. రే. ౯౭. మేసబౌళి. 2. ఈ రేకులో ఈ సంకీర్తన పాఠమున కొన్ని ముఖ్య భేదములున్నవి ;

'రాఁగదవె సూతమ్మ రసికుఁడతఁడు. ఆ కౌఁగిటి....వేసీ లాని....వుదుటఁ గుచములతోడ నొదిగీ నొదిగి....వడినార్చి నేతికడువల గుబ్బెతలు వేరి....నాటలాడి యాడి....నడుము సన్న....నడుపు రెప్పల....తొడికి చెనకేరది వొదొర....కుడుములును వడపప్పులు....అప్ప (రెండక్షరములు చెక్కక చోటు వదలినారు) కెలవాడి వదెకనక....కప్పురము గురిసె వేంకటరాయఁడు.' వేంకటేశ్వరముద్ర అంటలి కడపటిచరణమున లేమి, ఇందుండుట, విశేషము.

అవుర బాలకిసునరాయఁడ నీవు సంటిపాలు
సవులంటా నెత్తురెల్ల సప్పరించఁగా
కవకవ నవ్వి నవ్వి కన్నులు దేలగిలఁగ
సవరన్ని యాటదెల్ల సప్పుసారై పోయను ॥సిన్న॥

రారా గోపాలకిసునరాయ నీవదె[1] గొల్ల
వారి మగువల సూవువల్లె వేయఁగా
సూరఁబోయె రేపల్లె సొక్కని యాగుబ్బెతల
సేరలంతల కన్నుల[2] సిన్ని సిన్ని సిగ్గులు ॥సిన్న॥

కిన్నెర వెంకటగిరి కిసునరాయఁడ నీవు
వన్నెలుగ వీది వీది వాయించఁగా
మిన్నుదాఁకి లోకానకు మేఁటియైన లకిమమ్మ[3]
నిన్ను సేరి సరుగన నిలుసుండే సొక్కను. ॥సిన్న॥ 15

కాంబోధి[4]

పొద్దు వొద్దుకును వలపుల నేఁచేవు వద్దు[5]
బుద్ధిగాదు నీకు నేఁప[6] భువన మోహినిని ॥పల్లవి॥

అప్పుడు మావిన్నపము లాలకించఁ బొద్దులేక
యిప్పుడు విచ్చేసినాఁడవిఁక[7] నైనాను
చెప్పరానివిన్నియును చిత్తగించి చూతు గాని[8]
చప్పర మంచములోని చక్కని కోమలిని ॥పొద్దు॥

అలసి మాతోడ[9] మాటలాసతియ్యవేళగాక
యెలయించ[10] వచ్చినాఁడ వింతలోనసే

1. సా. రే. నీవాడె. 2. ని. రే. ౯౨. లంతలు కన్నులు. 3. ని. రే. ౯౨. లగిమమ్మ. (సా. రే; ని. రే. లలో అవ్యవస్థితముగానున్న రూపములను కలిపి సంప్రతించి వ్యావహారికభాషకు సమీపముగా ఈ పదము తీర్పఁబడినది.) 4. ని. రే. ౧౨. సామంతం 5. ని. రే. వేఁచేవు యింత. 6. ని. రే. యేఁచ నీకు. 7. ని. రే. విచ్చేసితి నీ విఁక. 8. ని. రే. చెప్పనేల యింతి నీవె చిత్తగింతుగాన. 9. ని. రే. వుత్తరము మాకాన. 10. పె. రే. యెలయించి; ని. రే. యెలమి విచ్చేసితి నీ విపుడైన.

సొలపు మాటలు గావు చూడు నీవె మేడమీఁద
చెలులపైనొరగిన[1] జిగి గుబ్బలాఁడిని ॥పొద్దు॥

వేఁగెడి రమణిఁ జూచి వేఁగినంతకు రావైతి
మాఁగెఁగా యింతట నీ మనసైనాను[2]
వేఁగు వచ్చెనా నీకు వేంకటేశ కృపఁజూడు[3]
కౌఁగిట నవధరించు కన్నుల కలికిని. ॥పొద్దు॥ 16

ముఖారి

ఇదిగాక సౌభాగ్య మిదిగాక తపము మఱి
యిదిగాక వైభవంబిఁక నొకటి కలదా ॥పల్లవి॥

అతివ జన్మము సఫలమై పరమయోగివలె
నితర మోహాపేక్షలిన్నియును విడిచె
సతికోరికలు మహాశాంతమై యిదె చూడ
సతత విజ్ఞాన వాసనవోలె నుండె ॥ఇది॥

తరుణి హృదయము కృతార్థతఁ బొంది విభుమీఁది
పరవశానంద సంపదకు నిరవాయ
సరసిజానన మనోజయమంది యింతలో
సరిలేక మనసు నిశ్చల భావమాయ ॥ఇది॥

శ్రీ వేంకటేశ్వరునిఁ జింతించి పరతత్త్వ
భావంబు నిజముగాఁ బట్టెఁ జెలియాత్మ
దేవోత్తముని కృపాధీనురాలై యిపుడు
లావణ్యవతికి నుల్లంబు దిరమాయ. ॥ఇది॥ 17

4-వ రేకు. వసంతం[4]

[5] శోభనమే శోభనమే
వైభవముల పావనమూర్తికి ॥పల్లవి॥

1. ని. రే. నొరగుండే జిగి. 2. ని. రే. యింతటను నీ మనసు. 3. ని. రే. శయిఁక నేల. 4. తా. వెం. సౌరాష్ట్రిం. 5. శోభానే.

అరుదుగ మును నరకాసురుఁడు
సిరులతోఁ జెరలుదెచ్చిన సతుల
పరువపు వయసులఁ [1] (ల ప ?) బదారువేలను
సొరిదిఁ బెండ్లాడిన సుముఖునికి ॥శోభ॥

చెందిన వేడుక శిశుపాలుఁడు
అంది పెండ్లాడఁగ నవగ [2] శించి
విందువలెనె తా విచ్చేసి రుకుమిణి
సంధడిఁ బెండ్లాడిన సరసునికి ॥శోభ॥

దేవదానవులు ధీరతను
దావతిపడి వార్థి దరువఁగను
శ్రీ వనితామణిఁ జెలఁగి పెండ్లాడిన
శ్రీ వేంకటగిరి [3] శ్రీ నిధికి. ॥శోభ॥ 18

పాడి.

దేవరచిత్తం దివ్యనిధి
దేవనిర్మిత విధీ యవధానం ॥పల్లవి॥

అతివలు నాట్యంబాడెదమవ్వి వు
న్నతి మెఱయుచు నున్నారిదివో
ప్రతినలతో రంభయు మేనకయును
ధృతి కరుణాంబుధి ధీయవధానం ॥దేవర॥

గానవిద్య తమ్ముక్కంబున విసుమని
కానుకలివె సురకాంతలవి
కానుపించుకో గంధర్వసతులను
ధీనుత పంపు సుధీ యవధానం ॥దేవర॥

పరియంకంబునఁ బవళించెదవో
సిరుల విభవములఁ జెలఁగెదవో

1. తా. వెం. వయసున. 2. నవఘశించి. 3. వెంకటపతికి శ్రీ.

తిరువేంకటగిరి దేవ యన్నిటా
తిరమందితి విటు ధీయవధానం. ॥దేవర॥ 19

శంకరాభరణం[1]

ఇంతే విన్నపమింతేలా నీ
పంతము చేకొంటి పాలించు ॥పల్లవి॥

అలయు సొలయునతివ లోలోనే
చెలిపైనొరగు చెక్కు (గుఁజెక్కు?) నొక్కు
పులకించు నించు వొ (చుఁబొ?) లఁతి చెమట
చిలికించు గోరఁజిత్తగించు ॥ఇంతే॥

చెలుల మొరఁగు చిం (గుఁజిం?) తచేఁ గరఁగు
పలుకఁ దలఁచు బడలును
పిలుచు నిన్ను నీపేరుకొనుచును[2]
తొలఁకు కన్నీరు దుడుచును ॥ఇంతే॥

చనుఁగవ చూచు సారె నీనేఁతలు
తనలోనే మెచ్చి[3] తనరును
అనయము వేంకటాధీశ యీయింతిఁ[4]
జెనకి కౌఁగిటఁ జేకొంటివి. ॥ఇంతే॥ 20

ముఖారి

కలలోనె యిరువురము నలిగి వేగ
కలయనుచుఁ దెలిసి నినుఁ గౌఁగిలించితిరా ॥పల్లవి॥

అలుగుదురె సతులుఁ బతులనఁగా వినఁగ
నలవాటు లేక నే నలుగుచుండుదురా
అలిగితట వురక నీవంత నాతోను మరి
నలుగులౌనట పూవులంతలోపలనే ॥కల॥

---

1. వి. రే. కా. కన్నడగౌళ. 2. నిన్ననే పేరుకొనుచు. 3. మెచ్చుఁదన.
4. అనయమ్ము వేంకటాధీశ యింతి.

చందురుఁడె సూర్యుఁడై జరగ మిగుల
కెందమ్ములవుర నా కెంగేలుదోయి
గందమే తోఁచెనట కస్తూరియనఁగ నా
చందమపుడొకలాగు చందమవునటరా ॥కల॥

విటవరుఁడ కోనేటివిభుఁడ నీ
వెటు దొలంగిన దేహమెట్టు నిలుపుదురా
యిటువలెనె మనలోన నెలమి మరచి
తటుకననుఁ గలయనుచు తలఁకి తెలిసితిరా. ॥కల॥ 21

నాదరామక్రియ

సకలం హేసఖి జానామి తత్
ప్రకటవిలాసం పరమం ధధసే [1] ॥పల్లవి॥

అలికమృగమదమయ మషీకలనో
జ్జ్వలతాం హేసఖి జానామి
లలితం తవ పల్లవితమనసి వి
శ్చలతర [2] మేఘశ్యామం ధధసే ॥సకలం॥

చారుకపోల స్థల కరాంచిత వి
చారం హేసఖి జానామి
నారాయణమహినాయకశయనం
శ్రీ రమణం తవ చిత్తే ధధసే ॥సకలం॥

ఘనకుచశైలాగ్రస్థిత విధుమణి
జననం హేసఖి జానామి
కనదురసా [3] వేంకటగిరి పతే
ర్వినుత భోగసుఖ విభవం ధధసే. ॥సకలం॥ 22

1. 'ధత్సే' యనియుండఁబోలును. ని. రే. ౧౦౬. వదసి, దధంసి, దదంసి, వాసి, అని క్రమముగా ఈ పదరూపములున్నవి. దధాసి అను సాధురూపమును ఇట్లు అవ్యుత్పత్తిచే చెక్కినారు కాఁబోలు. 2. నిశ్చలం మేఘ. 3. ఘనతయా వేంకట.

భైరవి

వనితభాగ్యంబు దేవరచిత్తము - మాకుఁ
బనిగాదు యింక నీ పాదంబులాన ॥పల్లవి॥

అడబాలసతి బోనమారగించు మటంచు
బడి బడిని కడు విన్నపము సేయఁగా
ఉడుగని పరాకుతో నుండి[1] నెచ్చెలి మీఁద
బడలి వ్రాలగినది నీ పాదంబులాన ॥వనిత॥

అడపంబుసతి వీడెమవధరింపుమటంచు
అడరి కప్పురపుఁ బలుకందీయఁగా
కడకంటఁ జూడదిదె కాఁతాళమో మరపో
పడఁతి యిప్పుడు నీ పాదంబులాన ॥వనిత॥

ఆలపట్టము విసరు అతివలను వలదనదు
పాలిండ్లపై కొంగు పచరించదు
యేలాగవునో[2] వేంకటేశ నీవిపుడిట్టె
పాలించకున్న నీ పాదంబులాన. ॥వనిత॥ 23

శంకరాభరణం

అలరులు గురియఁగ నాడెనదే
అలకలఁ గులుకుల నలమేల్ మంగ ॥పల్లవి॥

అరవిరి సొబగుల నతివలు మెచ్చఁగ
అరతెర మరఁగున నాడెనదే
వరుస పూర్వదువాళపు తిరుపుల
హరిఁగరఁగింపుచు నలమేల్ మంగ ॥అలరు॥

1. ఇది పె. రే. లోని పాఠము. సా. రే. లో 'పరాకునవుండి' అని కలదు. అది ఛందస్సునకు సరిపోదు. 2. 'లాగనో' అనియే రేకుల పాఠము. ఇందలి ఖండగతికి అది అడ్డువచ్చును.

పట్టపు మలపుల మట్టెల కెలపుల
తట్టెడి నడపుల ధాఁటైనదే
పెట్టిన వజ్రపు పెండెపు తళుకులు
అట్టిట్టు చిమ్ముచు నలమేల్ మంగ ॥అలరు॥

చిందుల పాటల శిరి పొలయాటల
అందెల మోఁతల నాదైనదే
కందువ తిరువేంకటపతి మెచ్చఁగ
అందపు తిరుపుల నలమేల్ మంగ. ॥అలరు॥ 24

దేశి

వలపారగించవమ్మ వనిత నీ
యలుక చిత్తమునకాఁకలి సేసినది ॥పల్లవి॥

అడియాసలనె పక్వమైన సోయగపు
వెడయలుకల మంచి వేఁడి వేఁడి రుచులు
ఎడసేసి తాలిమి సెడయించి పైపైనె
పొడమిన తమకంపు బోనము వెట్టినది ॥వల॥

ఆమంచి మధురంపు అధరామృతముల
వేమారుఁ దావులు చల్లు వెన్నెలబయటను
కోమలపుఁ దరితీపు కోరికఁ సమ్మరించి
ఘామకు పూఁబానుపు పళ్ళెము వెట్టినది ॥వల॥

కన్నుల కాంక్షలనెడి కళవళములు దీరె
సన్నపు నవ్వులనెడి చనవగ్గలించెను
అన్నువపు మరపు నీకంతసంతఁ గలిగె నేఁ
డిన్నియును దిరువేంకటేశుని మన్ననలు. ॥వల॥ 25

5-వ రేకు. శ్రీరాగం

అప్పటి య్యెండ చెమటలట్టే వుండీనా
నెప్పు దప్పు బొంకేవు నే నెఱుంగనా ॥పల్లవి॥

ఆవులఁ గాచిననాటి యడవికంపల జీర
లావల నేఁడు[1] మాయక అట్టే వుండీనా
యేవంక నెవ్వతో నిన్ను నెనసి చేసిన చేఁత
నీ వెంత మొఱఁగిన నే నెఱఁగనా ॥అప్పటి॥

వెన్నలు ముచ్చిలునాఁడు వేఁడి పాలారగించిన
అన్నువ నీమోవిపొక్కులట్టే వుండీనా
పన్నె కాఁడ యెవ్వతెకో వలలఁ జిక్కిన నీ
నిన్న మొన్నటి[2] సుద్దులు నే నెఱంగనా ॥అప్పటి॥

రంగుగ మధురలోని రమణి మెత్తిన నాటి
అంగడి గందపుఁ బూఁతలట్టే వుండీనా
చెంగట మొఱఁగి కలసితివి వేంకటరాయ[3]
సంగి మోచిన చేఁతలు నే నెఱంగనా. ॥అప్పటి॥ 26

శంకరాభరణం

పోనీ పోనీలే నీ పొందులేఁటికి నీ
యాననము చెమరించె నయ్యో నీ యలుకా ॥పల్లవి॥

ఆన వెట్టఁగా విచ్చేసేవమ్మపాదాల మీఁదనే
కానీ కానీలే యెక్కడికో నీవు
మానవతితో బింకాలు మానవా యింకాను నీ
మేనెల్లా బడలెను యేమిటికి నీ యలుక ॥పోనీ॥

బంగారు దుప్పటికొంగు పట్టఁగానే పెనఁగేవు
అంగడి వీధిలో నవులే నీవు
రంగైన సతికోపమెరఁగవా యింకాను నీ
తొంగలి రెప్పల నీటఁ దోఁచీలే నీ యలుక ॥పోనీ॥

1. ని. రే. ॥. నవుడె మాయక. 2. నిన్నటి మొన్నటి. 3. వేంకటేశ నీ; ని.రే. రా॥. వేంకటేశుఁడ నీ.

తెరవ నిన్నరగంటఁ దిట్టఁగానే బిగిసేవు
మఱవుఁ దెలివితో మఱియు నీవు
కరఁగి కూడితివి వేంకటగిరి మీఁద నున్న
నెరజాణ విట్ఠలుఁడ నేఁడుగా నీ యుఱక. ॥పో॥ 27

ముఖారి

ఎక్కడ నున్నదో చిత్తమేమి దలఁచెనో యింతి
చెక్కులెల్లాఁ జెమరించీఁ జెప్పరమ్మా చెలులు ॥పల్లవి॥

ఆతని సుద్దులు చెప్పే అతివలే చుట్టాలు
ఆతనిని వద్దనిన వారందరుఁ బగ
రాతిరెల్లా నిద్దురెరఁగదు పాదములొత్తి
చేతులెల్లఁ బొక్కేనేమి సేతమమ్మా చెలులు ॥ఎక్కడ॥

నవ్వులు చెక్కులకుఁ గన్నుపుగండిదొంగలాయ
నొవ్వులాయఁ జూపులు కన్నుల మీదికి
దవ్వులాయఁ బయ్యద గందపు గుబ్బల మీఁదికి
యెవ్వరి నొల్లదు యిఁకనేఁటికమ్మా చెలులు ॥ఎక్కడ॥

చిత్తమెల్లా దక్కఁగొనె సిగ్గులు ముంగిట వేసె
వత్తివలె దేహమెల్లా వాడఁబారెను
కత్తిఁ గోసినట్లు వేంకటపతి ఘాతలకు
జొత్తుపాపవలె నాయఁ జూడరమ్మా చెలులు. ॥ఎక్కడ॥ 28

శ్రీరాగం

చెల్లునంటా వచ్చి వచ్చి చెట్టవట్టేవు
తొల్లియు నెందరినిట్టే దొమ్ములఁ బెట్టితివో. ॥పల్లవి॥

ఆఁపరాని తమకాన నాసచేసేఁ గాక యింత
మోఁపు దాఁకా నీ తోడి మాటలేలరా

దాఁపరాని మదనముద్రలు మేనవవె నీకు
నేఁపుచు భ్రమలఁ బెట్టి యెవ్వతె నేసినవో ॥చెల్లు॥

ఉండలేక నీ వద్దనే వుసురంటేఁ గాక యింత
బండు బండు నేసిన యీప్రాణమేలరా
పుండుగాఁగఁ జిత్తమెల్లాఁ బొక్కఁజేసితివి నా
యండనుండే యెవ్వతెకు నమ్మడు వోయితివో ॥చెల్లు॥

తనివోక నేనింత [1] దగ్గర నిచ్చితిఁ గాక
చనవున నిన్నుఁ జేయి చాఁచనిత్తునా
ఘనుఁడ వేంకటరాయ కమ్మని యీ విరుల
మునుపనెవ్వతో (తె?) నీపై ముడిచి వేసినవో. ॥చెల్లు॥ 29

రామక్రియ

మెలో మీలో మేలే పెంచిన
తాలిమి కూటమి దలఁచినను [2] ॥పల్లవి॥

ఆరడిఁ బెట్టిన అలుకలు పుట్టిన
కూరిమి మచ్చికఁ గూరిచిన
బీరాన మీలో ప్రేమమే పెంచిన
నేరుపు మీలో నించినను ॥మెలో॥

చనవులిచ్చినఁ జదురులెచ్చిన
కొనచూపులు [3] లోఁగొచ్చినను
అనుగు మోహములచ్చినఁ దెచ్చిన
ఏనికి మనికి వెచ్చినను ॥మెలో॥

ప్రియములింపులు బిరుదు కెక్కిన
నయము మీలో నాఁటినను

1. ప.రే. ౪౦. నిన్నింత. 2. వి.రే. ౨౩. దంచినను. 3. చూపులలో.

జయమై వేంకటాచల రమణుఁడ
ప్రియురాలు మీలో బెరసెను. ॥మీలో॥ 30

సామంతం[1]

పొదలిన వీడెపుఁ బుక్కిటికో, తమ
చొదుకుల చెమటల చొక్కిటికో ॥పల్లవి॥

ఆముకొనిన యధరామృతవేళల
మోముల మోముల మొక్కిటికో
కామినుల[2] మకరికా పత్రమ్ముల
చీమక(మల?)దొంతర చెక్కిటికో ॥పొదలి॥

డయ్యపుఁ గౌఁగిటఁ గలికి రచనలను
నెయ్యపుఁ బులకల నిక్కిటికో
ముయ్యని మోహపు ముచ్చట మురిపెపు
తొయ్యలిపాదపుఁ దొక్కిటికో ॥పొదలి॥

మొలకలేనగవు మోముల గోళ్ళ
సులిమేటి వదనపు నుక్కిటికో[3]
అలమేల్ మంగకు నా వేంకటపతి
తలఁపులొసంగిన ధక్కిటికో. ॥పొదలి॥ 31

6-వ రేకు. ఆహిరి

ఆఁపరాని వలపాయ నమ్మలాలా - యింతి
యేఁపులకు లోనైతిమిఁక నేమిసేతమే[4] ॥పల్లవి॥

ఆరగించుమనఁ గదరమ్మలాలా - అయ్యో
నీరు పుక్కిలించదిదె విన్నటనుండి

---

1. ని.రే. ౨౩. దేసాళం. 2. కామినులు. 3. నీ.రే. ౨౩. నొక్కిటికో. 4. ని.రే.౩౨ నైతినిఁక నేమి చేతునే. (తరువాత నన్ని చోట్లను 'చేతునే' అనియే.) ౘం. ప్ర. ౨౬౦-వ పు. యేఁపులకు లోనాయ.

ఆరినది బోనమెల్లా నమ్మలాలా - అయ్యో
శ్రీరమణుఁడింతట విచ్చేయఁడేమిసేతమే ॥ఆఁప॥

అద్దమరాతిరి వోయ నమ్మలాలా - అయ్యో
నిద్దుర గంటఁబెట్టదు నిన్నటనుండి
అద్దపుఁ జెక్కులు వాడె నమ్మలాలా - అయ్యో[1]
యిద్దరికోపము దీరదిఁక నేమిసేతమే ॥ఆఁప॥

అలయికే ఘనమాయనమ్మలాలా - దీని
నిలుప వశముగాదు నిన్నటనుండి
అలమి వేంకటవిభుఁ[2]డమ్మలాలా - దీని
నెలయించి కూడకున్న[3] నిఁకనేమి సేతమే. ॥ఆఁప॥ 32

సామంతం

ఎక్కడికినెక్కడ యేడకునేడ నే
నొక్కతెనాతనికటరో సతులు ॥పల్లవి॥

ఆయఁబోయ నాఁడె నాకు నాతనికి నేమివోదు
రాయిడి యీచేఁతలకు రాయఁడితఁడు[4]
పాయమెల్లా జట్టిగొనె[5] పచ్చిగా నన్నింత సేసె
నోయమ్మ తడవకురో యీరోఁతలు ॥ఎక్కడి॥

చెప్పకు చెప్పకు నాకు సిగ్గయ్యీనిఁకనేల
నొప్పిసేసె నాతఁడింత[6] నొచ్చితి నేను
కప్పినఁ బోవు నేఁతలు కాలినపుండ్లలోన
నుప్పులు చల్లక తలరో సతులు. ॥ఎక్కడి॥

చాలుఁ జాలు నేల నాఁడే చవిగొన్న కూరలకు
మేలుఁ గిడుఁ గొనియాడ మీఁద మీఁదను

1. తం. ప్ర. లాలా - నేఁడు. 2. తం. ప్ర. వేంకటపతి. 3. తం. ప్ర. కూడకున్నాఁడిఁ. 4. ఏ. రే. ౨౬. రాయఁడాతఁడు. 5. గొని. 6. డింతె.

జాలిఁబెట్టి వేంకటేశ్వరుఁడు నన్నిదె రతి
నోలలాడించెను చూడరో పొందులు. ॥ఎక్కడి॥ 33

వరాళి

తలఁచి వేరొకటాడఁ దడఁబడీని
మలసిన నీకేల నోర మాట వెళ్ళీనే. ॥పల్లవి॥

ఇంచుకంత నెరసున్నానేఁచిన రెప్పలవెంట
నించి నించి కన్నులలో నీళ్ళుగారీని
యెంచరాని నీకన్నులెదుట నాతఁడుండఁగాను
యెంచిన నిదుర నీకు నేల వచ్చీనే. ॥తలఁచి॥

ఎక్కువభారము మేననించుకంత దోఁచినాను
తక్కరి యీదేహమెల్లాఁ దల్లడించీనే
మక్కువ నీవిభుఁడు నీమతినిండి వుండఁగాను
వెక్కసాన నేరీతి వేగించేవే ॥తలఁచి॥

వెలయఁగఁ గోపమొకవీసమంత దోఁచినాను
కలిగిన ముదమెల్లా గాలిఁబోయీని
కలసితివిదె వేంకటపతి నాతని
నెలయింత తమకాన నేడ దాఁగేవే. ॥తలఁచి॥ 34

దేశి [1]

నేఁతచిగురిదె పవ్వళించవయ్యా కానికె [2]
దాఁతిగాఁ గమ్మనితావిఁ బాయక [3] మీఁదైనది ॥పల్లవి॥

ఇంపుల వెలఁగపండ్లిందవయ్యా కానికె
సొంపుఁదేకుటాకు మరఁగున నున్నవి
కెంపుమోవిపండు చిత్తగించవయ్యా కానికె
దింపని తేనెలపెరతీపులు సోఁకినది ॥నేఁత॥

1. ని. తే. ౪౧. ఆద్యదేశ ? ౬౭. ఆద్యులదేశి. 2. తా. వెం. ౨౫౨. 'కానుక' అనియే యిదివఱకు. 3. కొమ్మతావులు పాయ మీఁదై.

పంచల వాఁడమ్ములివె పట్టవయ్యా కానికె
పొంచి తొంగలిగరుల పొది [1]సున్నవి
కొంచెపు వెన్నెలలివె కోవయ్యా కానికె
మంచిమొల్ల [2]మొగుడల మాఁటునాఁ బాయనివి [3] ॥చేఁత॥

[4]ఇప్పుడె వేంకటేశ నీకెక్కెఁగా నాకానికె
చిప్పిలుఁబన్నీటినిండుఁజెలమైనది
దప్పిదేరేమాటలతో దక్కెఁగా నాకానికె
కొప్పునెరుల విరులకుమ్మరింతలైనది. ॥చేఁత॥ 35

హిజ్జిజి

కటకటా యిట్లాయఁగా పనులు చెలిపలుకు
కిటుకుఁగీరములు మును కిందుపడి గెలిచె ॥పల్లవి॥

ఇంతిముఖచందురుఁడు నీకుముదబాంధవుఁడు
నింతచలమునఁ బోరిరిన్నాళ్ళను
కాంతుఁడవు నీవలుగఁగాఁ జెలికి [5]నీ విరహ
సంతాపములు రేఁచి జలజారి [6]గెలిచె ॥కట॥

వనజాక్షిచూపులును వలరాజుతూపులును
యెనయకే జగడించె నిన్నాళ్ళను
కినిసి నీవీయతివకెలనఁ దిరుఁగఁగ విరుల
ననలె కడువాండ్లై నలుగడల గెలిచె ॥కట॥

లతలు పూవులతావిలంచములు చెలిమేన
యితవుగా వడినొసఁగె నిన్నాళ్ళను
సతిగెలిచె వేంకటేశ్వర నీ కరుణనిపుడు [7]
ధృతిఁబూని జవరాలు తిరుఁగఁదా గెలిచె. ॥కట॥ 36

---

1. తొంగలి రెప్పల పోది. 2. మల్లెమొగడల. 3. మాటున మీఁదైనది. 4. దప్పిదేరె మోవివెదకెగా కానుక, జిప్పిలుపన్నీట నిచ్చలమైనది. ఇప్పుడె శ్రీవేంకటేశ నీకెక్కెఁగా కానుక, కొప్పునెరిగురులిగురించి వింతలైనది. 5. సా.రే. జెరిగి నీ విరహా. 6. చలపోరి గెలిచె. 7. సా. రే. శ్వరుకరుణ నీవిపుడు.

సామంతం [1]

చెదరి తట్టుపుణుఁగు చెక్కులఁ గరఁగి జార
సుదతి నెచ్చెలి మీఁద సోలగిలినది వో ॥పల్లవి॥

ఇంతివీఁపు నిమ్మపంట నేమరించి తాఁకవేసి
మంతన మెవ్వరితోనో మాటలాడేవు [2]
అంతలోనే కళదాఁకి ఆకె మేను జల్లనఁగ
చింతతోనే మోమువంచి సిగ్గువడినదివో ॥చెదరి॥

పొలఁతిగుబ్బలు నొవ్వఁ బూవులచెండున వేసి
కలికితనమున మరలి చూచేవు [3]
కలకంటి యింతలోనే కంతునిబాణమునవి
పలుకనేరక మానుపడి వున్నదదివో ॥చెదరి॥

పొక్కిడిచెలిఁ బన్నీటి [4] పొట్లానఁ దాఁకవేసి
తక్కరి నవ్వులతోడఁ [5] దలవంచేవు
గక్కన నేఁడతివ వేంకటరాయ నినుఁగూడి
వెక్కసపు మఱపుతో వెరగందినదివో. ॥చెదరి॥ 37

7-వ రేకు. మంగళకౌశిక [6]

తన్నుఁ బాసి నేనింత దంటనట యీ
వెన్నెలబాయిట రేయి వేఁగుటింత చాలదా ॥పల్లవి॥

ఇంటికి రాకుమని నేనంటినట చూడవే
అంటఁగాక వున్నదాన నంటినో యేమో
కంటికి నిద్దురరాక కాఁకలనే పొద్దుపోక
వొంటి నేఁబానుపున రేయుంటి నింత [7] చాలదా ॥తన్ను॥

1. ని. రే. ౧౦౪. శ్రీరాగం. 2. మాటలాడీని. 3. చూచీని. (ఈపాదములో యతి కానరాదు. పదలోపమున్నట్లున్నది.) 4. సా. రే. చెలి పన్నీటి. 5. ని. రే. నవ్వులతోఁ దలవంచీని. 6. ని. రే. ౩౩. దేసాళం. 7. నదె చాలదా.

అప్పటి దగ్గరి నే రానైతినట చూడవే
కొప్పు జారి సిగ్గుతోడఁ గొంకితి నేమో
చిప్పల రెప్పల జంకించితినట చూడవే
చెప్పరాని మాట నీతోఁ జెప్పుటింత [1] చాలదా ॥తప్పు॥

ఊరకే మాటాడక నే నుంటినట చూడవే
ఆరడి పరవశాన నైతినో యేమో
గోరికొనఁ దనుఁ దక్కఁ గొంటినట చూడవే
యేర వేంకటేశ నాతోనింత నీకుఁ జాలదా. ॥తప్పు॥ 38

శుద్ధవసంతం - రచ్చెతాళం

ప్రలపనవచనైః ఫలమ్మిహకిం
చల చల కుడ్యాశిళనయా కిం ॥పల్లవి॥

ఇతర వధూమోహితం త్వాం ప్రతి
హితవచనై రీహితు మిహ కిం
సతతం తవానుసరణమిదం మమ
గతజల సేతూకరణ మిదానీం ॥ప్రలప॥

వికలవినయ దుర్విటం త్వాం ప్రతి
సుకుమారార్ద్రిస్తుత్యా కిం [2]
ప్రకటబహల [3] కోపనం మమ తే
సకలం చర్విత చర్వణమేవ ॥ప్రలప॥

శిరసా నతసుస్థిరం త్వాం ప్రతి
విరసాలాపన విధినా కిం
తిరువేంకటగిరి దేవ త్వదీయ
విరహవిలపనం వృథాచరణం ॥ప్రలప॥. 39

1. జెప్పనైతిఁ జాలదా. 2. స్తురితిహ (స్తుతిరిహ) కిం. 3 బహుల.

## వరాళి

ఆఁగఁ జేసు [1] నాచూపులటు వోవయ్యా
మూఁగిన నావలపుల మూలకు రానేలా ॥పల్లవి॥

ఇమ్ముల నొల్లని వారమేల నీకు నామేని [2]
అమ్ముల పులకలొత్తీ నటు వోవయ్యా
కమ్మవిలుతునిచేతఁ గాఁగెడి నన్నొరసేవు
నెమ్మది నుండి యుండి నీకు నొవ్వనేలా ॥ఆఁగ॥

ఇతవు గాని వారమేల నీకు నామేని
అతితాపమంటుఁ జేసు నటు వోవయ్యా
రతిరాజుచేత నారడిఁబడ్డ నసుఁ జేరి
జతనాన వుండివుండి జాలిఁబొంద నేల ॥ఆఁగ॥

ఇంతటి నీ కౌఁగిటికి నేల నేము [3] మాకోప
మంతరమెఱఁగనేరదటు వోవయ్యా
పంతగాఁడ వెంకటపతి నీవు నసుఁ గూడి
చింతతోడఁ బొరలుచు [4] సిలుగంద నేలా. ॥ఆఁగ॥ 40

## శ్రీరాగం

ఎన్నఁడునుఁ గోపగించవిందుముఖి నీవిట్లా [5]
విన్నని వదనమెల్లా వింతలాయ నిపుడు ॥పల్లవి॥

ఇంతలోని పనికిఁగా నెంత చేసినాఁడవు
కాంత నిన్నటినుండి కసుమూయదాయను
బంతికూటి సతులెల్లాఁ బలుమారు నేఁపగా
చింతతోఁ బళ్ళెముమీఁద జెయి చాఁచదాయెను ॥ఎన్న॥

---

1. సా. రే. ఆఁగుఁజేసు. 2. ని. రే. ౧౭. మదనుని, అమ్ముగోల దాఁకుఁ జేసు 3. మేము. 4. బొందుచు. 5. ముఖినిట్ల.

ఏమిసేయఁబోయి [1] నీవు యేమి సేసినాఁడవు
సాముకు విచ్చేయదు జవరాలు [2] నేఁడు
దోమతెర మంచముపై తురుము వీడఁగను
తామసించి లేవదిదె తల నొచ్చీననుచు ॥ఎన్న॥

ఎవ్వరిని దూరవచ్చు నెవ్వరున్నారిఁకను
పువ్వు సజ్జమీఁదఁ గాఁగె పొలఁతికి [3] దేహము
రవ్వగ వేంకటగిరి రమణ నీ కౌఁగిటఁ
బవ్వళించి యింతలోనె పరవశమందెను. ॥ఎన్న॥ 41

ముఖారి

పతికంటె వెలిసున్న మంట (మాట ?) మేలు
చతురలాటకంటె జడులాట మేలు ॥పల్లవి॥

ఇంటిలోననె వుండి హితవరులై యుండు
కంటెఁ బగయై యుండు కసరు మేలు
అంటుకొని మరుఁడొంటి అతివసేఁపుటకంటె
పుంటినొవ్వుల విరుల పోట్లె మేలు ॥పతి॥

తల్లివలెఁ దాసుండి తాపమవుటకంటె
అల్లంతనుండి కీడౌట మేలు
వెల్లిగొని నిట్టూర్పు వేఁడి చల్లెడికంటె
పల్లదపు చలిగాలి బాదలే మేలు ॥పతి॥

అలయించి దొరకెడి అమృత పానముకంటె
అలమి పైకొనెడి చేఁదైన మేలు
కలయక కలయు వేంకటశైలపతికంటె
తలపోఁత వేదనల తమకమే మేలు. ॥పతి॥ 42

1. కాఁబోయి. 2. జవ్వరాలు. 3. పొలితికి.

సామంతం

అప్పుడే నే నీకు మోహపుటాలనైతినా [1]
కప్పకు నీ చేఁత లంతకంటెఁబో నేను [2] ॥పల్లవి॥

ఇంచుకంత పనికైన [3] నిల్లుచొరనీక నిన్ను
లంచములడుగను [4] నే లకిమమ్మనా
వంచనల నీకు నిట్టె వలలఁ జిక్కితిఁ గాక
కంచుఁ బదనునకంత [5] కంటెఁబో నేను ॥అప్పుడే॥

సొలపు మాటల నిట్టె చూపులనె జంకించి
చలము సాదించ నీ [6] సత్యభామనా
వలచి నేనిదె నీకు వసమై చిక్కితిఁగాక [7]
కలికి చేఁతలనంత [8] కంటెఁబో నేను ॥అప్పుడే॥

రేపు మాపు గోరఁ దమ్మిరేకులనే లేఖవ్రాసి
రూపు నీకుఁ జెప్పిపంప రుకిమిణినా
తీపుల నిన్నుఁగూడి తిరువేంకటేశ విరిఁ
గైపు సేయఁగాని (?) అంతకంటెఁబో నేను. ॥అప్పుడే॥ 43

8-వ రేకు. భైరవి

కోవిల పలుకదు కొమ్మావిలతల
దైవిక మిదివో తలకిందాయ ॥పల్లవి॥

ఇటునటు యినుఁడిదె యెండలు గాసీ
పటుగతి గిరుల నభములందు
అటువలెఁ గప్పిన యంధకారమిదె
నిటలపుటలుకల నిక్కములాయ ॥కోవి॥

1. సా. రే. మోహపాలనైతి - కప్పకు. 2. లంతాఁగంటిఁబో. 3. పనికిఁగానిల్లు. 4. లడుగ నీ లకి. 5. వి. రే. ౧౩. బదనున నంత. 6. సాదించఁగనే. 7. సా. రే. వశమయ్యితిఁ గాక. 8. తలకంత.

వెగటునఁ దోఁటల వెన్నెల గాసీ
ఒగిఁ గలువకొఁలకులుబ్బఁగను
అగపడి అటువలెనైనాఁ జెలి నీ
మొగమునఁ గోపము ముచ్చటలాయ ॥కోపి॥

సొరిది నలుగడలఁ జుక్కలు గాసీ
నరుదుగ నే నిట్లయినాను
తిరువేంకటగిరి దేవుని కౌఁగిట
కరుణ మన్మథ గ్రహణంబాయ. ॥కోపి॥ 44

సాళంగనాట

చాలుఁజాలును భోగసమయమ్మున మైమఱపు
పాలుపడునట యేఁటి బ్రదుకురా వోరి ॥పల్లవి॥

ఇందుముఖి నినుఁ గౌఁగిలించి లోపలి జగము
కందునని నీ బిగువుఁ గౌఁగిలే వదలె
పొందైన వారితోఁ బొసఁగఁ గౌఁగిటఁ జేర్పఁ
బొందుగాదట యేఁటి పొందురా వోరి ॥చాలు॥

నెలఁత నీ వాలుఁగన్నులు మూసి జగమెల్లఁ
గలయఁ జీఁకట్లైన గక్కనను వదలె
వలచినంగనలు తమ వలసిన విలాసముల
వలను నెరపనిదేఁటివలపురా వోరి ॥చాలు॥

కొమ్మ నీవురముపై గోరు దివియుచు నాత్మ
నిమ్మైన నను దాఁక నిద్దరినిఁ దాఁకె
దిమ్మరివి కోనేటితిమ్మ నీపైఁ బ్రియము
కుమ్మరించని దేఁటి కోర్కిరా వోరి, ॥చాలు॥ 45

## కాంభోది

ఎప్పుడు గాని రాఁడో యెంతదడవాయ కాలి
చప్పుడాలకించి మతి [1] జల్లురనెనమ్మా ॥పల్లవి॥

ఇద్దరమదరిపాటు యేకాంతాన నాడుకొన్న
సుద్దులు దలఁచిమేను చురుకనెనమ్మా
పెద్దగాఁ గస్తూరిబొట్టు పెట్టిన నాతఁడు [2] గోర
తిద్దుట దలఁచి మేను దిగులనెనమ్మా ॥ఎప్పుడు॥

పాయక యాతఁడూ నేనుఁ బవ్వళించే [3] యింటివంకఁ
బోయి పోయి కడుఁ జిన్నఁబోతి నోయమ్మా
తోయపు గుబ్బల [4] చన్నుదోయి మీఁద వాఁడొత్తిన
పాయపుఁ జంద్రులఁ జూచి భ్రమసితినమ్మా ॥ఎప్పుడు॥

కూడిన సౌఖ్యములందు కొదలేని వాని నా
వేడుక మతిఁ దలఁచి వెరగాయ నమ్మా
యీడులేని తిరువేంకటేశుఁడిదె నాతోడ [5]
నాడినట్టే నాచిత్తమలరించె నమ్మా. ॥ఎప్పుడు॥ 46

## సామంతం [6]

ఎట్టయినఁ జేయరా నీ విఁకనేలా నన్నుఁ
బట్టకుర పలుమారు పదివేలు వచ్చెను ॥పల్లవి॥

ఇంత నేసితివి చాలు నిఁకనేలా తొల్లే
యింతటివాఁడవని నిన్నెఱఁగనా [7]
ఇంతులపై దయగలదిఁక [8] నేలా నీ
పంతములే నీకుఁజెల్లె [9] పదివేలు వచ్చెను ॥ఎట్ట॥

1. ని. రే. ౧౦. గుండె. 2. పెట్టిన యాతని గోర. 3. సా. రే. పవ్వళించి
4. ని. రే. తోయగపు గుబ్బచన్ను. 5. నాతో. 6. ని. రే. ౯౫. శుద్ధవసంతం.
7. ని. రే. ౯౫. నేనెఱఁగనా. 8. గలవిఁక. 9. దక్కె.

ఇచ్చలాడకురా నాతో నిఁకనేలా నీ
యచ్చలమ్ముఁలే నిజమా [1] యఁగా
యెచ్చరిక మఱచితివిఁకనేలా నన్ను
పచ్చిసేయకురా యింత [2] పదివేలు వచ్చెను ॥ఎట్టు॥

ఇనుమడించె నీచేఁత లిఁకనేలా నీ
కనుమాయలిన్నియుఁ గంటిమిగా
యెనసి వేంకటపతి యిఁకనేలా నన్నుఁ[3]
బనుపరచితివిట్టె [4] పదివేలు వచ్చెను. ॥ఎట్టు॥ 47

లలిత

బండి దొక్కెఁ బామునెక్కెఁ బసులెల్లాఁ దక్కె
అండఁ జిక్కె గోపికలకందరికి మొక్కె ॥పల్లవి॥

ఈతఁడు దొంగిలె వెన్న [5] యీతఁడు నాకంటెఁ జిన్న
నేతఁ బాల నోలలాడె నిన్నమొన్న
పాతకపు రాకాసిపల్లెలు చూరలుగొన్న
యేతరిపై నేరమి మాకేఁటికిఁక నెన్న ॥బండి॥

కూరిమినీతఁడు దొల్లి కొనగొనలనే తల్లి (?)
మారిపిళ్ళాడించెనే [6] మారుదల్లి
ఆరుమూరు నేసి విద్యలందరికిఁ బారఁజల్లి[7]
పారితెంచి వోలలాడెఁ బాలవెల్లి ॥బండి॥

ముచ్చువలె నిప్పుడుండె మూఁడులోకములు నిండె
రచ్చసేసెఁ జూడరే రాతిగుండె
తచ్చితచ్చి వింటినారి దనుజులనెల్లాఁ జెండె[8]
పచ్చిదేర [9] వేంకటాద్రి పానుపుగాఁ బండె. ॥బండి॥ 48

---

1. నిజములాయ. 2. యింతపచ్చిసేయకుర మమ్ము. 3. సా. రే. 'నన్ను' లేదు.
4. ని.రే. పరచితివిదె. 5. ని.రే. ౧౫. న్నలీతఁడు. 6. ని.రే.౧౭. మారిపిల్లాండ్లిచ్చెనే.
7. ని. రే. ౧౫. జల్లిఁబారి. 8. జెండి. 9. ని. రే. ౧౫. దేరి.

ఆహిరి

ఓ యమ్మా వినరో యమ్మా
మాయలాఁడి మానిని ॥పల్లవి॥

ఈ యింతికి విభుఁడిచ్చినా చన
వేయెడాఁ బోవదిదిగదే[1]
రాయంచ నడపుల రాజసమ్మున
పాయంపు రమణునిఁ బాయదు ॥ఓయ॥

సారె సటములు సందడింపుచు
జారీఁ బయ్యెద సరుగనా
దూరి రమణునిఁ దొలఁకుఁ గన్నుల
నీరు నించదు నిలుపరే ॥ఓయ॥

అంకించి పిలిచినప్పుడా[2] తిరు
వేంకటేశ్వరు వెరవున[3]
బొంకు లేనియట్టి పొందు చేకొని[4]
పంకజానన పైకొనె[5] ॥ఓయ॥ 49

9-వ రేకు. శ్రీరాగం

వద్దు నీకు నాతోడి వట్టిమాటలు
ముద్దులు నీపైఁ గునిసి మురిసీఁబో యిఁకను ॥పల్లవి॥

ఈడ వచ్చి ప్రియము నాకేమి చెప్పేవిందాఁకాఁ
గూడినాకెకే ప్రియము గులుకరాదా
వాడిక నిందాఁక నీవు వచ్చిన నేరమికి
సూడుఁ బాడుఁ జెనకీఁబో సొలపుఁ జేఁతలసే ॥వద్దు॥

---

1. ని. రే. ఞా. డాఁబొదమిదిగదే. 2. నప్పుడే. 3. సా. రే. వెరపున. 4. సా. రే. లేని పొందు పొసగుకొని. 5. ని. రే. ఞా. ననఁబైకొని.

ఎదిరి నావంకఁ దప్పుకేమి చూచేవిఁక నీ
ముదితపైనే చూపులు ముంచరాదా
మెదలి నా ముంగిలిది మెట్టిన తప్పునకును
సద చేసి జగడాలు చల్లెదిఁబో యిఁకను ॥వద్దు॥

ఇట్టు నట్టుఁ జెఱఁగు నాకేల పట్టేవిదె మున్ను
పట్టినాకెకే చెఱఁగు పట్టరాదా
వెట్టికూటములు చాలు వేంకటేశ యిదె నిన్ను
బెట్టుగాఁగా నలుకలఁ బెట్టుఁగదా యిఁకను ॥వద్దు॥ 50

భైరవి

కాలమెల్లా మోసపోవు (ము ?) కానియ్యరా కల
కాలమెల్లా జరపేవు కానియ్యరా ॥పల్లవి॥

ఎడపుల జవ్వనపుటింతి నొకతెఁ గూడి
కడలనే తిరిగేవు కానియ్యరా
మెడగట్టుకొకతెకు మేలువాఁడవై నీవు
కడవ బొంకేవు నాతో కానియ్యరా ॥కాల॥

బంగారుమెఱుఁగుచాయ పడఁతినొకతెఁ గూడి
కంగనాడేవు నాతో కానియ్యరా
అంగన నొకతె వెనకమర దాఁచుకొని చా
క్కఁంగఁ జేసి ముద్దాడేవు కానియ్యరా ॥కాల॥

సంపద గలాపెఁ గూడి సరసములాడుచు
కంపుతే పూసేవు కానియ్యరా
వెంపరలాడుచు నీ వెంటనొకతె రాఁగా
కంపించకు వేంకటేశ కానియ్యరా ॥కాల॥ 51

ముఖారి

వెరతుమయ్య చూపు[1] వేఁటకాడ
తరితీపు సేసి మమ్మింతటనె యేఁచేవు ॥పల్లవి॥

ఉంటవింటఁ గప్పురాన నుబ్బి నన్ను నేసేవు
యింటి వారెవ్వరుంటా యెరఁగవు
కంటిమి నీ యదలింపు కరఁగి నేఁబైకొన్న
వెంట వెంటఁ దిరిగాడి వెతలఁ బెట్టేవు ॥వెరతు॥

[2] పేలరిపై యేడనైనాఁ బేరుకొని పిలిచేవు
[3] యేలిన వారెవ్వరుంటా నెఱఁగవు
తాలిమి మీరఁగ నీ చిత్తములో మెలఁగఁగ
కాలూఁదనియ్యక యింత[4] కాఁకలఁ బెట్టేవు ॥వెరతు॥

కొప్పులోని విరులు చెక్కుల జారఁ జెనకేవు
[5] యెప్పుడైనా నెవ్వరుంటా నెఱఁగవు
కప్పకుర[6] చెఱఁగు వేంకటరాయ చెమటలఁ
దొప్పఁదోఁగి యెవ్వతో పొందులకు నేఁగితివి[7] ॥వెరతు॥ 52

మాళవ శ్రీ[8]

దుప్పటెల్లా జవ్వాదినే తొప్పఁదోఁగె నీకడనే[9]
వొప్పదా యింతేసి నీకు వో వలపా ॥పల్లవి॥

ఉత్తలపు విరహాన సుడుకుచు వయసు పైఁ
దెత్తినది సతి నీకు నిందుకొరకా
వత్తునని విచ్చేసి వనితల కుచముల
వొత్తగిలి వున్నాఁడ వోహో వలపా ॥దుప్ప॥

1. సా. రే. చోఁపు. 2. ని. రే. ౧౨౦. ఇది మొదటి చరణముగా 'ఉంటవింట' రెండవదిగా నున్నవి. 3. ని. రే. ఏలినవాణెవ్వరు నుంటా. 4. ని. రే. యెంతే. 5. ఎప్పుడు నీవెవ్వరుంటా. 6 సా. రే. కప్పకు చె. 7. ని.రే. నేఁగేవు. 8. ని.రే. ౩౬. ఏకతాళి. 9. నికడనే.

నిదుర గంటికె రాక నెలఁత పానుపుమీఁద
నెదురు చూచీ నీకు నిందుకొరకా
ముదితల కౌఁగిట ముంచిన కస్తూరి నీకు
వుదిరెడి వురమున నోహే వలపా ॥దుప్ప॥

కన్నుల కలికి నింత కరఁగించి కవుఁగిట
ఎన్నిక [1] నేసితివి నీ విందుకొరకా
చిన్నిచిన్ని నగవుల శ్రీవేంకటేశ నీ
వున్నాఁడవారవులై వోహో వలపా ॥దుప్ప॥ 53

సామంతం [2]

మదము దొలఁకెడి యట్టి మంచివయసున మనకు
తుదలేని వేడుకలు దొరకు టెన్నఁడురా ॥పల్లవి॥

ఉదుటుఁ జనుదోయి నీ వురముపైఁ దనివార
నదిమి మోమును మోము నలమి యలమి
వదలైన నీవితో వాలుఁగన్నుల జంకె
లొదవ నీ మీఁద నే నొరగు టెన్నఁడురా ॥మదము॥

కలికితనమున నాదు కప్పురపుఁ దమ్ములము
కులికి నీ వదనమునఁ గుమ్మరించి
పలచనగు గోళ్ళ నీ పగడవాతెర నొక్కి
చెలువమగు నునుగంటి సేయు టెన్నఁడురా ॥మదము॥

గరగరని కురులలో కస్తూరివాసనలు
విరులతావులతోడ విసరఁగాను
తిరువేంకటాచలాధిపుఁడ నినుఁ గూడి నే
నరమరచి సదమదములౌట [3] యెన్నఁడురా. ॥మదము॥ 54

1. సా.రే. ఎన్నికె. 2. తం. ప్ర. కాంభోజి. జంపెతాళం. 3. తం. ప్ర, సదమదంబౌట.

సౌరాష్ట్రం

ఊరులేని పొలిమేర పేరు పెంపు లేని బ్రతుకు
గారవంబు లేని ప్రియము కదియనేఁటికే ॥పల్లవి॥

ఉండరాని విరహవేదన వుండని సురతసుఖమేల
యెండలేని నాఁటి నీడ యేమిసేయనే
పండిగలుగు తమకమనెడి పండలేని తాలిమేల
రెండునొకటి గాని రచన ప్రియములేఁటికే ॥ఊరు॥

మెచ్చులేనిచోట మంచిమేలు గలిగినేమి నెలవు
మచ్చికలేనిచోట మంచిమాటలేఁటికే
పెచ్చుపెరుగలేనిచోట ప్రియముగలిగి యేమిఫలము
ఇచ్చలేనినాటి సొబగులేమి సేయనే ॥ఊరు॥

బొంకులేని చెలిమిగాని పొందులేల మనసులోన
శంకలేక కదియలేని చనవులేఁటికే
కొంకుగొసరు లేని మంచికూటమలర నిట్లఁగూడి
వెంకటాద్రివిభుఁడు లేని వేడుకేఁటికే. ॥ఊరు॥ 55

10-వ రేకు. సామంతం

ఒద్దేల మొక్కేవో వుద్ధవుఁడా తన
ఉద్దండాలె చెల్లె నుద్ధవుఁడా ॥పల్లవి॥

ఊరూర వెలవులుద్ధవుఁడా నే
మోరుతుమా యిఁక నుద్ధవుఁడా
ఊరడించ వచ్చేవు వుద్ధవుఁడా తన
వూరట చెలుములుద్ధవుఁడా ॥ఒద్దే॥

ఒప్పలర మావురిసిన వుం
డ్లుప్పులు వెట్టించె నుద్ధవుఁడా

చెప్పకు మమ్మిఁక చెలువుఁడాతఁడే
వొప్పివుంటేఁ జాలు నుద్ధవుఁడా ॥ఒద్దే॥

గోపికల మమ్మఁ గూరిమిఁజిక్కించె
నోపమింతేసి నే ముద్ధవుఁడా
పైపైనే మమ్మింత ప్రాణము నిలుప
నోపెఁగా తానైన నుద్ధవుఁడా ॥ఒద్దే॥

తెగి తన్నుఁ గూడే తెరఁగు దలఁచి
యుగములైనవి ఉద్ధవుఁడా
పగటున మామా ప్రాణము మాకిఁక
నొగరే తీపాయె నుద్ధవుఁడా ॥ఒద్దే॥

చెల్లించె మాప్రేమ శ్రీ వేంకటేశుఁడు
వుల్లమలర నేఁడుద్ధవుఁడా
చల్లని కూటపుఁ జనవిచ్చి మామా
వొళ్ళెల్లఁ జెనకె నుద్ధవుఁడా. ॥ఒద్దే॥ 56

ముఖారి

పలుమరు వుట్లపండుగను
చిలుకు చిడుక్కని చిందఁగను ॥పల్లవి॥

ఊళ్ళ వీధుల వుట్లు కృష్ణుఁడు
తాళ్ళు దెగిపడఁ దన్నుచును(న్నఁగను?)
పెళ్ళు కరిల్లు పెరిల్లు చిరిల్లని
పెళ్ళగ మ్రోసె పెనురవము ॥పలు॥

బంగారుబిందెలఁ బాలుఁ బెరుగులు
ముంగిట నెగయుచు మోఁదఁగను
కంగు కళింగు కరింగు ఖణింగవి
రంగుమీరు పెనురవములై ॥పలు॥

నిగ్గుగ వేంకటనిలయుఁడుట్టిపా
లగ్గలికఁ బసుల నడుమఁగను
భగ్గు భగిల్లని పరమామృతములు
గుగ్గిలి పదనుగఁ గొసరియఁగను ॥పలు॥ 57

ఆహిరి

చెడ్డ చెడ్డ మనసుల చెంచువారము - ఆల
దొడ్డివాఁడ పోవయ్య దూళికాళ్ళ రాక ॥పల్లవి॥

ఏఁటి దాననైతినేమి యెవ్వతె నేనైతినేమి
ఆఁటదాని నన్ను నీకు నడుగనేలా
మూఁట మాఁటలనె కడు మోవనాడవద్దు లేటి
వేఁటకాఁడ పోవయ్య వెంటవెంట రాక ॥చెడ్డ॥

ఎవ్వరి వారైరేమి [1] యేడనేడ నుండిరేమి
దవ్వుచేరువలు నీకుఁ దడవనేలా
నవ్వకుండఁగానె వట్టి నవ్వునవ్వేవెవ్వరైన [2]
పువ్వక పూచెననేరు పోవయ్య రాక ॥చెడ్డ॥

ఎక్కువ కొప్పయిననేమి యెంత గుబ్బలైన నేమి
చక్కఁదనము వొగడ సారె నీకేలా
వెక్కసాలు మాని మాతో వేంకటేశ మా (మీ ?) యింటి
యిక్కువకే పోవయ్య యింతవంత రాక ॥చెడ్డ॥ 58

శుద్ధదేశి

ఎందరిఁ జెనకేవేరా నీవు
అందపు నీమేన వలముచు [3] ॥పల్లవి॥

ఎక్కడికైనా విచ్చేసి యేరా నీవు
వెక్కస మాడేవు వెఱవక

---

1. సా. రే. వైరైన వేమి. 2. సా. రే. నవ్వేవిటు నేఁడు. 3. వి. రే. ౪౧ - ౧౧౨. నీ ప్రేమ నలయుచు.

యిక్కువలంటఁగ వచ్చేవేరా నీవు
నిక్కపు నీ ప్రేమ నెరపుచు ॥ఎంద॥

ఎప్పుడు మానవు బిగువేరా నీవు
కప్పురపు నోరఁ గసరుచు
యిప్పుడె యింతేసి చేసేవేరా నీవు
వొప్పుదు నాతోడి వుదుటులు ॥ఎంద॥

ఏతరుణిఁ దలఁచితో యేరా నీవు
కాతరాన నన్నుఁ గలయుచు
యేతరి వేంకటేశుఁడ యేరా నీవు
బూతులమాటాడి పొదలేవు. ॥ఎంద॥ 59

హిజ్జిజి

తరుణిపై మరునికి దయలేదు నీవు
మరునినే పోలితి మరియేఁటిబ్రదుకు ॥పల్లవి॥

ఎదురుచూచి చూచి యింతక యేమౌనో
హృదయము ఝల్లనీ [1] నిటుదలఁచి
పొదల [2] తీగెలయింటఁ బొరలి యేమౌనో
మదిరాక్షికొకసైన మరియేఁటిబ్రదుకు ॥తరుణి॥

చెలుల దూరిదూరి సిగ్గునసేమౌనో
తలఁచి తలఁచి గుండె తల్లడించీని
కల నిన్నుఁగని లేచి గక్కున [3] నేమౌనో
మలసి వెన్నెలమంట మరియేఁటిబ్రదుకు ॥తరుణి॥

ఇంతిఁ గలయకున్న [4] నిఁక నెంత యౌనో
పంతపు వేంకటరాయ భయమయ్యీని

1. ని: రే. ౩౩ - ౪౪. ఝల్లని. యిటు. 2. పొదలి. 3. ని. రే. ౪౪. గక్కన.
4. గలయకుంటే.

ఇంత నీకరుణ[1] నిఁక నెంత యౌనో
మంతనమింత లేకున్న మరియేఁటి బ్రదుకు ॥తరుణి॥ 6

రామక్రియ[2]

వద్దే గొల్లెత వదలకువే - నీ
ముద్దు (ముద్దు) మాటలకు మొక్కేమయ్యా ॥పల్లవి॥

యేలే యేలే యేలే[3] గొల్లెత
నాలాగెఱఁగవా నన్ను నేఁచేవు
చాలుఁ జాలు నిఁకఁ జాలు నీ రచనలు
పోలవు బొంకులు పోవయ్యా ॥వద్దే॥

కానీ కానీ కానిలే[4] గొల్లెత
పోనీలే నీ వెందు వోయినను
మాని మాని పలుమారుఁ జెనకుచు మా
తోనిటు సొలయక తొలవయ్యా ॥వద్దే॥

రావా రావా రావా గొల్లెత
శ్రీ వేంకటగిరి[5] చెలువుఁడను
నీవె నీవె నను నించితి కౌఁగిట
కైవశమైతినిఁ గదవయ్యా. ॥వద్దే॥ 61

11-వ రేకు. శుద్ధవసంతం

మెచ్చితి బళిరా వోరి మేటిజాణ నన్నుఁ
బచ్చి చేసేదింత నీకుఁ బంతమా లోకానను ॥పల్లవి॥

ఏకతాన సొలసి నేనేమి నీతోఁ బలికినా
ఆకెతోనే విన్నవించేవాపఁగ లేక

1. ఇంతా నీ కరుణచే. 2. ని. రే. ౨౧. యేకతాళి. 3. సా. రే. ఏలేయాలేయాలే.
4. ని.రే. ౨౫. కానీగా. 5. కటపతి.

పైకొని వలచి కిందుపడిన యింతులమాఁట
కాకు సేసే మగవాఁడు గలఁడా లోకానను ॥మెచ్చి॥

చక్కఁగా నేఁదీసిన సన్నపు నీ పై రేక
యెక్కువ నాకెకే చూపేవేతులకును
మక్కువ నిలుపలేని మగువల వెలిపుచ్చి
వెక్కసమయినవాఁడు విభుఁడా లోకానను ॥మెచ్చి॥

ఉండలేక చేతనున్న వుంగరమిచ్చినఁ బోయి
వెండియు నాకెకేయిచ్చి విఱ్ఱవీఁగేవు
కండగట్టుకొంటివా వేంకటరమణుఁడ దీన
బండుసేసితివి నన్ను బాపురా లోకానను. ॥మెచ్చి॥ 62

ముఖారి. ఏకతాళి

సన్నపు నవ్వుఁజూపుల చల్లులాఁడి యిప్పు
డిన్నివిధముల మించె నిదివో తపము ॥పల్లవి॥

ఏడునిలువుల పైఁడిమేడమీఁద నుండి నిన్నుఁ
జూడ వేడుకైన మించుఁజూపు[1] లాఁడి
వాడుచు నీకునెదురు వడిఁజూడ నంతలో నీ
వేడనుండో విచ్చేసితివిదివో తపము ॥సన్నపు॥

కొత్తలయిన మాణికపు కొలువుటోవరిలోన
ముత్తెల[2] చెఱఁగుదూలు మురువులాఁడి
తత్తరానఁ దమకించి తరుణికోరికలెల్ల
నిత్తునని విచ్చేసితివిదివో తపము ॥సన్నపు॥

పుష్పొడితావులు చల్లు పువ్వులచప్పరములో
కొప్పు నన్నుఁ[3] బెట్టుమన్న గుబ్బలాఁడి
తెప్పలుగ నినుఁగూడి తిరువేంకటేశ నిన్ను
నెప్పుడుఁ బాయకున్నదిదివో తపము. ॥సన్నపు॥ 63

---

1. సా. రే. మంచిచూపు. 2. ని. రే. లా౩. ముత్యాల. 3. నిన్ను.

ముఖారి

కలగన్నచోటికిని గంప యెత్తిన యట్లు
అలవు మీఱినదెట్లనమ్మా ॥పల్లవి॥

ఎలయింపుఁ గడకంట నెన్నఁడో వొకనాఁడు
చెలఁగి తను నతఁడు చూచినవాఁడట
పొలిఁతి యదిదలఁచి యిప్పుడు మదనవేదనల
నలసీ నిఁకనెట్లనమ్మా ॥కలగన్న॥

ఎఱుకయును మఱపుగా నేఁటికో వొకనాఁడు [1]
కెఱలి తను నొవ్వఁ బలికినవాఁడట
తఱినదియె చెలి యిపుడు దలఁచి పరితాపాగ్ని
నఱగీ నిఁకనెట్లనమ్మా ॥కలగన్న॥

ఇయ్యకోలుగఁ గలసి యెప్పుడో యిదెనేఁడు
నెయ్యమున చెలిలోన నెలకొనెనట
తియ్యముల నటకాఁడు తిరువేంకటేశ్వరుఁడు
అయ్యో యిఁకనెట్లనమ్మా. ॥కలగన్న॥ 64

కాంబోది

పొందెఱుఁగుదునందువు భోగినందువు నీ
యందరు సతులకు నేనాకు మడిచిత్తునా ॥పల్లవి॥

ఎవ్వతెకైనాఁ జనవిచ్చేవు మెచ్చేవు నీ
నవ్వులకైనాను మన్ననఁ జూచేవు
అవ్వలి [2] యివ్వలి నీయంగనల వొద్దను
పవ్వళించి వుండఁగా నేఁ బాదములొత్తుదునా ॥పొందె॥

ఏపున నెక్కడికైనా నేఁగేవు దాఁగేవు నీ
కోపాన నాతోనైనా [3] మేకులు నేసేవు

1. ని.రే. ౭-౪౨. కోయిదెనేఁడు. 2. సా.రే. అవ్వలినీ యివ్వలినీ. 3. ని.రే. నాతో నేనే.

వైపున నీవెందుండైనా వచ్చిన నేనంతలో
నోపికనప్పుడు[1] నీ కూడిగాలు సేతునా ॥పొందె॥

వేడుకలెందైనాఁ బారవేసేవు మూసేవు నీ
వాడికచేఁతలెన్నైనా వన్నె వెట్టేవు
ఈడు లేని తిరువేంకటేశ కూడితివి నన్ను
వాడుచు నీ తోడ నేను వాసి చూపఁగలనా. ॥పొందె॥ 65

పాడి

సుతుని నరకునిఁ జంపఁ జూచినాఁడవు సుమ్మీ
మతి నన్నుఁ దలఁచక మానిన నీకాన ॥పల్లవి॥

ఎత్తుక నీతోడఁబుట్టు హిరణ్యకశిపుని
నెత్తురు దాగితి సుమ్మీ నేఁడే రాకుంటే
ఉత్తలాన నేడనైనా నుండుదువో యని భీతి
బిత్తరముగాఁ బెట్టితి పెట్టరాని యాన ॥సుతుని॥

కప్పుక నీ మేనమామ కంసుని ప్రాణానకు
తప్పినవాఁడవు సుమ్మీ తడసితేను
ఇప్పుడిట్టే నీవు రాని యీరసానఁ బ్రియములు
చెప్పలేక పొడిచితి చెడుగైన యాన ॥సుతుని॥

సిరుల మేన మరఁది శిశుపాలు నీ విట్టే[2]
పొరిగొంటివి సుమ్మీ పోయితే నీవు
తిరువేంకటేశ నన్నుఁ దివిరి కూడి (డే ?) వని[3]
కరుణఁ బెట్టితి నీకుఁ గపటాన నాన. ॥సుతుని॥ 66

శుద్ధవసంతం

చాలదా యీ చనవులు
మేలపు సేఁతల నిన్ను మెచ్చించఁ గలిగె ॥పల్లవి॥

---

1. సా. రే. నేనీ కూడి. 2. వి.రే. గంతి. విని విట్టే. 3. కూడేనని.

ఎంతటిదిరా నిన్ను నిందాఁక రానీక
పంతమాడి వలపించి బాసగొన్నది
ఇంతి నోఁచినట్టి నోము యెటువంటిదో నీ
చెంతఁజేరి నీ మంచి చెక్కు నొక్కఁగలిగె ॥చాల॥

ఎవ్వతెరా నిన్ను నెలయించి తన నిండు
జవ్వనము విలువిచ్చి జట్టిగొన్నది
అవ్వల దాని భాగ్యమది యెట్టిదో నీవు
పవ్వళించు పరపుపై పవ్వళించఁ గలిగె ॥చాల॥

ఎట్టిదిరా సతి నిన్ను యింటిలోన వెళ్ళనీక
పట్టుకొని కౌఁగిటిలోఁ బాయనీనిది
అట్టె నిన్ను తిరువేంకటాధీశుఁడా నీవు
దట్టించు నీ కౌఁగిటిలో తగులఁగఁ గలిగె. ॥చాల॥ 67

12-వ రేకు. ఆహిరి

చక్కఁదనములచేత జవ్వన భారము చేత
యెక్కడౌటాఁ గానదిఁక నేమి సేతమే ॥పల్లవి॥

ఒయ్యనె బంగారు తూఁగుటుయ్యాల మంచముమీఁద
పయ్యెద చెఱఁగు జారఁ బవ్వళించి
ముయ్యక మూసిన రెప్ప మూయుచుఁ దెరచుఁ గాని
నెయ్యమునఁ జూడనేరదేమి సేతమే ॥చక్క॥

ముత్తేల గద్దియమీఁద ముద్దుల కురులు దూల
నొత్తిలి యొకతె మీఁద నొరగుండి
చిత్తగించి చేతనున్న చెంగలువ బంతిఁ జెక్కు
లొత్తుఁగాని మాటలొల్లదేమి సేతమే

కమ్మని తావులతోడ కన్నుల నవ్వులతోడ
చిమ్ముఁ జెమటలతోడఁ జెలువొంది

కొమ్మకు నేఁడుఁగలిగె కోనేటిరాయని పొందు
నెమ్మనము దాఁచ నేరదేమి సేతమే. ॥చక్క॥ 68

ఆహిరి

దవ్వుల నుండవే యాల దగ్గరేవు ఆతఁ
డెవ్వరౌతా నెఱఁగవిదేమే చెలియా ॥పల్లవి॥

ఒద్దికతో చనుదోయి నొరయుచు కంట
నద్దలింపుచుఁ దిట్టేవు అమ్మ మీఁదను
ముద్దుమోము విరియించి మురిసేవు ఇంత
వద్దువో ఆతనితో గర్వము నీకుఁ జెలియా ॥దవ్వు॥

బొమ్మముడి జంకెనలఁ బొలయుచు మోవిఁ
దమ్మచూపి సన్నసేసి తసరేవు
చిమ్మేవు నీ చెమటలు చెక్కుమీఁద ఓ
యమ్మరో యాతనితో వొయ్యార మేలే చెలియా ॥దవ్వు॥

మొరయు మెట్టెలు పాదమున మెట్టి
చెరఁగులోపల గోరఁ జెనకేవు
కరఁగి వేంకటపతి కౌఁగిట నీ
నెరతనములు చూప [1] నేర్తువా చెలియా. ॥దవ్వు॥ 69

శంకరాభరణం

తరుణి నీ యలుక కెంతటిదింతినీ వేళఁ [2]
గరుణించఁగదర వెంకటశైలనాథా ॥పల్లవి॥

ఒకమారు సంసారమొల్లఁ బొమ్మని తలఁచు
ఒకమారు విధిసేఁతలూహించి పొగడు
ఒకమారు తనుఁజూచి వూరకే తలవూఁచు
నొకమారు హర్షమున నొంది మే [3] మఱచు ॥తరుణి॥

---

1. సా. రే. మానసేర్తు. 2. సా. రే. దింత యీవేళ. 3. ని. రే. ౧౧ మైమ.

నిన్నుఁ జూచి వొకమారు నిలువెల్లఁ బులకించు
తన్నుఁ జూచి వొకమారు తలపోసి నగును
కన్ను దెరచి నినుఁజూచి కడు సిగ్గువడి నిలిచి
యిన్నియును దలపోసి యింతలో మఱచు ॥తరుణి॥

వదలైన మొలనూలు గదియించు నొకమారు
చెదరిన కురులెల్లఁ జెరుగునొకమారు
అదనెరిఁగి తిరువేంకటాధీశ పొందితివి
చదురుఁడవు నినుఁ బాయఁజాలదొక మారు. ॥తరుణి॥ 70

బౌళి

మోహము సేయించుకొని మురిసేవు నీ
సాహసములె[1] దురా చదురాలికిపుడు ॥పల్లవి॥

ఒక్క చక్రమె నీకునున్నది[2] గాని, యింతి
రెక్కల చక్రాలె పో రెండు గుబ్బలు
మక్కువ సేయించుకొని మలసేవు నీ
చక్కఁదనమెదురా జవరాలికిపుడు ॥మోహ॥

నీలమేఘము చాయ నీమేను గాని పెద్ద
నీలమేఘమే పో నెలఁత కొప్పు
జాలిఁ బొరలించేవు సతిని నీవు నీ
తాలిములెదురా తరుణికి నిపుడు ॥మోహ॥

మరుని ప్రతినిధి నీ మహిమ గాని ఆ
మరుని సంపదే పో మగువ నేఁడు
తిరువేంకటేశ పొందితివి గాని నీ[3]
సరసము లెదురా సకియకు నిపుడు. ॥మోహ॥ 71

1. ని. రే. ౧౪-౮౧. హసమెదురా. 2. ని. రే. (౧౪లో ఈ చరణము లేదు.) ౮౧. నుండేది. 3. ని. రే. వేంకటగిరి దేవుఁడ నేఁడు నీ.

పాడి

వచ్చెరా మా యమ్మతోడు వన్నెలుగావు నీ
మచ్చరములెల్ల మాని మందకేఁగ నియ్యరా ॥పల్లవి॥

ఓసోసి యెందు వొయ్యేవే వొయ్యారపుగొల్లెతా
దోసము మమ్మునంటక తొలఁగరటు (రా అటు ?)
మూసేవే గుబ్బలఁ గొంగు మురిపెంపుగొల్లెతా
మాసినది చీరకొంగు మందకేఁగ నియ్యరా ॥వచ్చె॥

సానఁ బట్టేవే మాటలే చల్లజంపు గొల్లెతా
నేనేమి బాఁతిరా నీకు నెరజాణా
కానిలే రావైతివిగా గబ్బిచూపుగొల్లెతా
మానమువంకఁ జూడక మందకేఁగ నియ్యరా ॥వచ్చె॥

జంకించేవే బొమ్మలను జవ్వనంపుగొల్లెతా
వెంకటవిభుఁడ నీకు వెరతుమయ్యా
అంకపు గుబ్బలను నన్ను నదిమేవె గొల్లెతా
మంకుఁ గూటములు మాని మందకేఁగ నియ్యరా. ॥వచ్చె॥ 72

దేసాళం

కులుకక నడవరో కొమ్మలాలా
జలజలన రాలీని [1] జాజులు మా యమ్మకు ॥పల్లవి॥

ఒయ్యనే మేను గదలీ నొప్పుగా నడవరో
గయ్యాళి శ్రీపాదతాఁకు కాంతలాలా
పయ్యెద చెఱఁగు జారీ భారపు గుబ్బల మీఁద
అయ్యో చెమరించె మా యమ్మకు నెన్నుదురు ॥కులు॥

చల్లెడి గందవొడి మైజారీ నిలువరో
పల్లకి వట్టిన ముద్దుఁ బణఁతులాల

1. ని. రే. ३೨ - ౬౭. జలజల రాలీజా.

మొల్లమైన కుందనపు ముత్యాల కుచ్చులదర
గల్లనుచుఁ గంకణాలు గదలీ మాయమ్మకు ॥కులు॥

జమళి ముత్యాలతోడి చమ్మాళిగ[1] లిడరో
రమణికి మణుల నారతులెత్తరో
అమరించి[2] కౌఁగిట నలమేలుమంగనిదె
సమకూడె వేంకటేశ్వరుఁడు మాయమ్మకు. ॥కులు॥ 73

13వ-రేకు. ఆహిరి

కొమ్మ తన ముత్యాల కొంగు జారఁగఁ బగటు
కుమ్మరింపుచుఁ దెచ్చుకొన్న దీవలపు ॥పల్లవి॥

ఒయ్యారమున విభుని వొరపు గనుఁగొని రెప్ప
ముయ్యనేరక మహా మురిపెమునను
కయ్యంపుఁ గూటమికిఁ గాలుద్రవ్వుచు నెంతె
కొయ్యతనమునఁ దెచ్చుకొన్న దీవలపు ॥కొమ్మ॥

పైపైనె ఆరగింపకుము పన్నీరు గడు
తాపమవునని చెలులు దలఁకగానే
తోపు సేయుచుఁ గెంపు దొలఁకుఁ గన్నుల కొనల
కోపగింపుచుఁ దెచ్చుకొన్న దీవలపు ॥కొమ్మ॥

ఎప్పుడును బతితోడ నింతేసి మేలములు
ఒప్పదని చెలి గోర నొత్తఁగానే
యెప్పుడో తిరువేంకటేశు కౌఁగిటఁ గూడి
కొప్పుగులుకుచుఁ దెచ్చుకొన్న దీవలపు. ॥కొమ్మ॥ 74

ముఖారి

పొదలు[3] నీ సొబగెల్ల పోడేల కొల్ల
తుదలేని నీ మేలు దొరకెఁగా నాకు[4] ॥పల్లవి॥

---

1. సమ్మాళిగ. 2. అమరించెఁ గౌఁగి. 3. సా. రే. బొదలి; 4. నీకు;

ఒడలిపై నీ చెమట వూరు వాడెడు[1] చెలమ
ఉడియు నీ తమకంబు సంత తగరు
పడగంటి నీ చూపు కట్టు వదలిన క్రేపు
పడి నిన్నుఁ గరఁగింప వశమా నాకు ॥పొదలు॥

చిఱునవ్వు నీ పలుకు జిగురు చుట్టిన కండె
తెఱవలకు నీ మోవి తెరువుపెసరు
పఱచు నీ సుసఁజేఁత బట్టబాయిటి యీఁత
తఱి నిన్నుఁ బైకొనఁగఁ దరమా నాకు ॥పొదలు॥

చెలువంపు నీ చెలిమి చెఱకు పండిన పండు[2]
కెలపు నీ యలుక తంగేటి జున్ను
చలివాపు నీ చనవు జాజులుఁ బ్రసాదంబు
కలిగె నీ కరుణ వేంకట విభుఁడ నాకు. ॥పొదలు॥ 75

ఆహిరి

మచ్చికల మొగసిరి మందులాఁడ నీ
కిచ్చిన దేహమిది యెట్టయినఁ జేయరా ॥పల్లవి॥

ఓడక యెక్కడనైన నుండి నీవు
వేడుకతో మాయింటికి విచ్చేయఁగాను
వాడుమోముఁ జూచి నవ్వువచ్చుఁ గాని కోప
మేడఁ దెచ్చుకొన్నరాదు యెట్టైనాఁ జేయరా ॥మచ్చి॥

ఎంతవొద్దు వోయియైనా యిటునీవు
వింతలేక మాయింటికి విచ్చేయఁగాను
చింతతో నీ కెదురు చూచితిఁ (చెద?) గాని
యెంతైనాఁ బాయలేను యెట్టయినాఁ జేయరా ॥మచ్చి॥

కుంకుమచెక్కుల మెఱుఁగులతోడ తిరు
వేంకటేశ మాయింటికి విచ్చేయఁగాను

1. ని. రే. ౧. వాడేచె. 2. సా. రే. పంట.

వంకలాడి నిను( గూడవలె( గాని
యింక నిన్ను( బాయలేము యెట్టయినా( జేయరా. ॥మచ్చి॥ 76

ఆహిరి

వలపు నిలుపలేని వారము నేమటుగాన
పలుమారు( బట్టుకొన్న( బయికొనవేలరా ॥పల్లవి॥

ఒత్తి నీవాడినమాటకోరువ( జాలక నే
ముత్తరమిత్తుము గాని ఊరకుండలేమురా
బత్తి గొట్టాన( బెట్ట(గ( బనిలేదు వోరి సి
చిత్తమింతేకాని యి(క( జెప్పనేమున్నదిరా ॥వలపు॥

కా(కల( బెరిగినట్టి కళవళమున నిన్ను(
దా(కనాడుదుము గాని తడవుండలేమురా
యే(కట( జెందినయట్టి యింతుల మాటకు నీవు
సో(కోరువవలె( గాక చురుకనరాదురా ॥వలపు॥

సారెకు నీవెడసిన సైచలేము నీవు
చేరువనలిగి మమ్ము( జేకొనవేరా
ధీరు(డవు కోనేటితిరువెంకటేశ నన్ను
గారవించి యిట్లానే కరుణించ( గదరా. ॥వలపు॥ 77

శంకరాభరణం

అహో సురతవిహారోయం
సహజ పరాజయశంకా నాస్తి ॥పల్లవి॥

యమునాకూలే [1] సుమలతాగృహే
విమలసైకత వివిధస్థలే
రమణీరమణౌ రమతస్తయోః
ప్రమదస్య పరాత్పరం [2] నాస్తి ॥అహో॥

---

1. ని రే. లా. హితలతాగృహే. (ఈ పాఠమునకు 'యెమునాకూలే' అను పూర్వార్ధపాఠము కారణముగా నుండి యుండును.) 2. పరాపరం.

రజనీ కావా ప్రాతః కింవా
త్యజనం భజనం తత్కింవా
విజయః కోవాపజయః[1] కోవా
భుజపరిరంభ స్ఫుటం నాస్తి ॥అహో॥

చీనాంశుక రంజిత మేఖలావి
తానే జఘనం తరతి సతి
మానవికలనే మానినీమణే (ః ?)
హీనాధిక పరిహృతిం నాస్తి (తిర్నాస్తి?) ॥అహో॥

కింవా మిళనం కింవాఽ మిళనం
త్వం[2] వాఽహంవా తన్నాస్తి[3]
సంవాదో వా సరసః కోవా
కింవా వాచ్యా క్రియా నాస్తి[4] ॥అహో॥

ఆదిదేవ పీతాంశుక బద్ధా (?)
స్వేద సురభి కాశ్మీరజలం
సాదురుంహ్యా (రూహ్యా?) లజ్జావివశతయా
ఖేదేన వచః కించిన్నాస్తి (?) ॥అహో॥

వరకుచాగ్ర సంవ్యానం కరేణ
హరౌ పరం[5] పరిహరతి సతి
సరసలోచనంచల (నాంచల ?) వివశతయా
తరుణ్యాం చైతన్యం నాస్తి ॥అహో॥

[6] సురతాంతశ్రమ సుఖం కింవా
వరలజ్జా సావా కావా
పరవశతను వైభవం కింవా
నిరతాం తయో నికృతిం నాస్తి (?) ॥అహో॥

1. సా.రే.ని.రే. భజయః. 2. ని. రే. తంవా. 3. సా.రే. తం నాస్తి. 4. సా.రే. ని.రే. క్రియాం నాస్తి. 5. ని.రే. హరంపరి. 6. ని.రే. లో ఈ చరణము లేదు.

పరిమళ భరిత ప్రచుర సుశీతల
వరమృదువాయౌ వాతి సతి
తిరువేంకటగిరిదేవ రాధయో
స్సరసరతి సుఖశ్రాంతిర్నాస్తి. ॥అహో॥ 78

14-వ రేకు. శ్రీ రాగం

విరహమొ సంభోగంబుల[1] వేడుక శృంగారమొ యిది
సరసిజముఖిఁగని ప్రాణము జల్లనఁ గలఁగెడినే[2] ॥పల్లవి॥

కుటిలాలకి మైఁబూసిన కుంకుమగంధపు రసములు
చిటిపొటి చెమటలఁ బెనఁగొని చిప్పిలి రాలఁగను
విటరాయని యలరమ్ములు వీఁపున వెడలఁగ నాఁటిన
తొటతొటఁ దొరిగిన నెత్తురుతోఁ దులదూఁగెడినే ॥విరహ॥

మృగలోచన చనుఁగవపై మెత్తిన కమ్మని తావుల
మృగమదమంటినచోట్లు మెఱుఁగులు వారెడిని
చిగురాకున మరుఁడేసిన చిచ్చరబాణంబులచే
ఎగసిన పొగలై తోఁచీ[3] నేమని చెప్పుదునే ॥విరహ॥

యోగవియోగంబులచే నొనగూడిన యీ చెలియకు
నాగరికంబుల చేఁతలు నటనలు మీరఁగను
శ్రీ గురుఁడై చెలువొందిన శ్రీ వేంకటగిరి నిలయుని[4]
భోగించిన పరిణామపు పొందులు దెలిపెడినే[5]. ॥విరహ॥ 79

నాదరామక్రియ

[6] చెలియకు విరహపు వేదన సేయని సింగారంబిది
సొలవక వలపుల ముద్రల చొవ్పులు మాపకుఁడీ ॥పల్లవి॥

---

1 సా.రే. సంభోగంబో. 2. ని.రే. ౧౧౪. గరఁగెడిని. 3. తోఁచెడి. 4. గిరిరాయఁడు. 5. దలఁచెడిని. 6. ని.రే. ౯౪. ఈ పల్లవి పాఠము 'ఎక్కడఁ జేసిన విదులును యీ చిత్తజు బాణాజ్ఞులచే - నొక్కులు దేరెడి కాంతకు నొప్పులు సేయకుఁడీ' అని.

కిక్కిరిసిన చనుగుబ్బలు గీఁటినఁ బగిలెడి నయ్యో
పక్కనఁ గనుకలి దాఁకీఁ బయ్యెద దెరవకుఁడీ
పెక్కసమగు ముఖకాంతికి పెడవెడ మరుఁగై తోఁచెడి
చెక్కుల చెమటలు గందెడి చేతులు వెట్టకుఁడీ[1] ॥చెలియ॥

అంగన మేనికిఁ బులకలు అడ్డము దోఁచెడి నయ్యో
బంగరు మొలకలవంటివి పైపైఁ దుడువకుఁడీ
తొంగలి రెప్పల కెలఁకుల తొరిగెడి కన్నుల మెరుఁగుల[2]
ముంగిటవేసిన చూపుల[3] మురిపెము మానుపుఁడీ (?) ॥చెలియ॥

తిరువేంకటపతినింతికిఁ దెచ్చెదమనఁగా నయ్యో
కరుణించినవాఁడాతఁడె[4] కళవళమందకుఁడీ
తరుణీమణి యీ దేవునిఁ దగఁ గౌఁగిట[5] సౌఖ్యంబుల
పరవశమందినదేమో పలుమరుఁ బిలువకుఁడీ. ॥చెలియ॥ 8॥

పాడి

అంత సేయకుండి తేనే[6] నాఁటదాననా
పంతపు నీ బిగువెల్ల బయట వేయింతునా[7] ॥పల్లవి॥

కూరిమి సతుల భీతి గోర నన్ను[8] సంటనీక
సారెకుఁ దప్పించుకొంటా సాము సేసేవు
యేరా నీకు నింత వెరపిటువంటి నిన్ను నే పో
జీరలు మేనెల్లఁ[9] జేసి సిగ్గు విడిపింతునా[10] ॥అంత॥

మొక్కుచుఁ గెమ్మోవి మీఁద మోపనియ్యవేర పల్లు
వెక్కవపు తమకాన విఱ్ఱ పీఁగేవు[11]

---

1. పలుమరు చేతులఁ దుడువకుఁడీ. 2. రెప్పల మఱఁగుల తొలకరి మెరుఁగుల కన్నుల. 3. ముంగిటవేసెడిఁ జూపులు. 4. కరుణించెను దేవుఁడు. 5. యీతనితో తగు కౌఁగిటి. 6. వి.రే.లా. కుండివవే. 7. వేయింతును. 8. సా.రే. గోరు నన్ను నంట. 9. వి.రే. వొళ్ళెల్ల. 10. వింతును. 11. వెదపీఁగేవు.

చిక్కితి వెక్కడికి విచ్చేసేవు నిన్ను నే
దక్కఁగొని మదన విద్యలనే చొక్కింతునా [1] ॥అంత॥

ఎక్కువ నామేని జవ్వాదిందరుఁ దెలిసేరంటా
మిక్కిలి నీ మేనితావి మెరయించేవు
చక్కని వేంకటగిరి స్వామి నన్నుఁ గూడితివి
గక్కన నాచూపు నీకుఁ గావలి వెట్టింతునా. [2] ॥అంత॥ 81

నాదరామక్రియ

ఏమొకో చిగురుటధరమున [3] యెడనెడఁ గస్తురి నిండెను [4]
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా ॥పల్లవి॥

కలికి చకోరాక్షికిఁ గడకన్నులు గెంపై తోఁచిన
చెలువంబిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువునఁ బ్రాణేశ్వరుపై నాఁటిన యాకొన చూపులు [5]
నిలువునఁ బెరుకఁగ నంటిన నెత్తురు గాదు గదా ॥ఏమొ॥

పడఁతికి చనుఁగవ మెఱుఁగులు [6] పైపైఁ బయ్యెద వెలుపల
కడు మించిన విధమేమో కనుఁగొనరే చెలులు
ఉడుగని వేడుకతోఁ [7] బ్రియుఁ డొత్తిన నఖ శశి రేఖలు
వెడలఁగ వేసవికాలపు వెన్నెల గాదు గదా ॥ఏమొ॥

ముద్దియ చెక్కుల కెలఁకుల ముత్యపు జల్లుల చేర్పుల
వొద్దికలాగు [8] లివేమో వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున
అద్దిన సురతపుఁ జెమటల [9] అందము గాదు గదా. ॥ఏమొ॥ 82

---

1. క్కింతును. 2. ట్టింతును. 3. ని.రే. రా౩. చిగురట అధరము. 4. నించిన. 5. శ్వరుమది నాటఁగఁ జూచిన చూ. 6. పడతుక చనుగవ మెరుఁగుల. 7. ప్రేమంబునఁ బ్రియు. 8. మెరుఁగులివే. 9. పా.రే. పతి కౌఁగిటి యధరామృతముల అద్దిన సురతపు వేళల అందము.

### శ్రీరాగం

చిమ్మకువే గోళ్ళంత జీరలయ్యీని
చిమ్ముఁ జెమటల[1] నిన్నుఁ జిక్కించె నతఁడు ॥పల్లవి॥

కులికి నవ్వకువే కొప్పు వీడీని బెట్టు
పలుకకువే మోవి బయలయ్యీని
వులికి పడకువే వొళ్ళు నొచ్చీని ని
న్నెలయించి వలపుల నింతసేసె నతఁడు ॥చిమ్మ॥

కన్నుల మొక్కకువే కాఁక రేఁగీని నీ
వన్నెలు చూపకువే వడ చల్లీని
సన్నలఁ దిట్టకువే చలమెక్కీని నిన్ను
మన్ననలనే సిగ్గు మరపించె నతఁడు ॥చిమ్మ॥

గుట్టున నడవవే కొంగు జారీని యింత
తట్టుపుణుఁగేఁటికే తల నొచ్చీని
గట్టిగ శ్రీ తిరువేంకటరాయఁడు నిన్నుఁ
బెట్టని చోట్లఁ బెట్టి పెద్దసేసె నతఁడు. ॥చిమ్మ॥ 83

### ఆహిరి

[2] లంజకాఁడవౌదువురా
లంజకాఁడవౌదువు నీ లాగులెల్లఁ గానవచ్చె
ముంజేతఁ బెట్టిన సొమ్ములకద్దమేలరా ॥పల్లవి॥

కొంకక యెవ్వతో కాని కోరి నీ బుజము మీఁద
కంకణాల చేయి వేసి కౌఁగిలించఁ బోలును[3]
వంకలైన వొత్తులెల్ల వడిఁ గానవచ్చె నింక
బొంక నేమిటికిరా నీ బూమెల్లఁ గంటిమి ॥లంజ॥

1. ని.రే. ౨౪. జెమ్మటల. 2. సా.రే. లో ఈ పాదములేదు. ని.రే.౧, ౫ాలలో గలదు. 3. ని.రే. ౫ాల బోలురా.

ఒద్దిక నెవ్వతో గాని వోరి నీ వురము మీఁద
నిద్దిరించఁ గంటమాల నీలములొత్తినది
తిద్దిన జాణవుగాన తిరిగి తిరిగి మాతో
బద్దనేఁటికిరా నేఁ బచ్చిసేయఁ జాలను ॥లంజ॥

వేడుక నెవ్వతో తిరువేంకటేశ్వర నిన్ను
కూడిన నీ మేనితావి కొల్లవట్టుకొన్నది
తోడనె నాకౌఁగిటిలో దొరకొంటి వింక నిన్ను
నాడ నేమిటికిరా నాయలపెల్లఁ దీరెను. ॥లంజ॥ 84

15-వ రేకు. ఆహిరి

లేఁత మాయలు నీకు నింతేసి[1]
పూఁత సిగ్గులే[2] బూమిలో వారికి (?)
యీఁతవలపు చిత్తములోన నెవ్వరికైనఁ దెలుసునే[3] ॥పల్లవి॥

కొప్పునఁ జిన్ని కొనలు సాగ కురులు దురుమ నేఁటికే
కుప్పలు గాఁగఁ జెక్కుల దాఁక కుంకుమ పూయనేఁటికే
ముప్పిరి గొనఁగ రెప్పల తుదల ముద్దులు గునియ నేఁటికే
విప్పక నెలవిఁబార నవ్వుచు వింతలు సేయనేఁటికే ॥లేఁత॥

గుబ్బల మించులు పయ్యెద వెడల కులికి నడవ నేఁటికే
గబ్బితనము చూపులోని కలికిలాగులేఁటికే
వొబ్బిడియైన చెలులలోన వొయ్యారములేఁటికే
అబ్బురపడఁగఁ జూచిన వారికాసలు సేయ నేఁటికే ॥లేఁత॥

కొండల తిమ్మనిఁ[4] జూచి లోలో కుతిల కుడువ నేఁటికే
కొండుక వయసు వారికింత గుట్టున నడవ నేఁటికే

1. ని. రే. ౭, ౨౪. మాయలుకేల నీ కింతేసి. 2. ని. రే. ౨౪. సిగ్గులు. 3. ని. రే. లోపల యవ్వరికిన్నియుఁ దెలుసునే. 4. ని. రే. ౭. తిమ్మయ్య. ౨౪. తిమ్మయ.

యెండయు పీతయు నిపుడె కంటిమెమ్మెలుఁ బొరల నేఁటికే
కొండంతమేలు నేసిపవారిని[1]కొడిమెలెన్న నేఁటికే. ॥లేఁత॥ 85

తెలుఁగుఁగాంబోది

చెట్ట వట్టేవేరా నన్నుఁ జెంచు దానిని[2]
పుట్టతేనెలారగించి పోకవుండేవా ॥పల్లవి॥

పదురు గడలని నా సుబ్బులే చూచితి గాని
గదరుఁ బుఱుఁగు కంపు గానవైతిగా[3]
చిదిమినా నెఱఁగవు చేరేవు నా పొడగని
గుదికొన్న మరునమ్ము గుండె దాఁకెనా ॥చెట్ట॥

తోరంపు నామెఱుఁగుల తొడలే చూచితి గాని
జీరల నా చెమట్లమై చిత్తగించవా
చేరేవు నా పొడగని చిందుపడి నీవు నాకు
యీరాని చనవులెల్లా నియ్యఁ బోపుదా ॥చెట్ట॥

పిక్కటిల్లు తేనెల నా పెదవే చూచితి గాని
చొక్కపు నా యెంగిలవి చూడవైతిగా[4]
ఇక్కువ గరఁగి వేంకటేశ నన్నుఁ గూడితివి
వొక్కనిమిషమోరువ నోపవైతిగా. ॥చెట్ట॥ 86

శ్రీరాగం

తేనెయు నేయు[5] నంపేవు తీపుమాటల
కానీలే తేనెయు నేయుఁ[6] గాదా నీయలుక ॥పల్లవి॥

కప్పురమే యంపేవు కటకటా అందుతోనే
అప్పుడైనా నిమ్మపండు నంపవైతివి

1. ని.రే. ౨౪. వారికి. 2. ని.రే. ౨౪. ఇయా, పుట్ట. 3. ని.రే. గాన, వైతివా. 4. వైతివా. 5. సా. రే. నెయ్యి. 6. నెయ్యిఁగా.

కప్పురగంధికి [1] నీకరుణ లేకుండుఁటే
కప్పురము నిమ్మపండుఁ గాదా నీయలుక ॥తేనె॥

సంపెంగనూనె యంపేవు సారెసారె నందుతోనె
అంపవైతి గన్నెరలు అప్పుడైనాను [2]
ఇంపులేని కోమలికి నేఁటికి సంపెంగనూనె
కంపులును గన్నెరలుఁ గాదా నీయలుక ॥తేనె॥

నేరేడుఁబండ్లే యంపేవు నెలఁతకు నందుతోనె
ఆరనియ్యానవాలైనా నంపవైతివి
కోరి వేంకటేశ యింతిఁ గూడితిగాక లేకుంటే
నేరేడుఁబండ్లుఁ బాలును నేఁడేవో నీయలుక. ॥తేనె॥ 87

కన్నడగౌళ

ఏమనఁగలదిఁకఁ గాలము యింతయు విపరీతములై
భామినిదేహము పరితాపంబున వేఁగెడిని ॥పల్లవి॥

కప్పురమియ్యని పీడెము గైకొననొల్లని కాంతకు
కప్పురమంటిన చోట్లే కడుఁగడుఁ బొక్కెడిని
పుప్పొడివెన్నెల పొళ్ళు (?) [3] పొలఁతికి వెన్నెల బాయిలు [4]
నిప్పులఁ దోఁగినయట్లే నిలువునఁ గాఁగెడిని ॥ఏమన॥

పానుపు పువ్వులఁ బరవక పవళింపని సతి పూవుల
పానుపు కన్నులఁ జూచినఁ బరవశమందెడిని
తేనగవాదవని మాటలు లేనిలతాంగికి నగవులు
కానుకవట్టిన [5] నొల్లక కన్నుల విసిగెడిని ॥ఏమన॥

కందర్పుని గురుఁడనఁగాఁ గలిగిన తిరువేంకటపతి
చందము చూపుల భామిని చనవున నొప్పెడిని

---

1. గంధికిని నీ. 2. అంపరాని గన్నెరలు నంపవైతివి. 3. ని.రే.౭౫, రా.౫. లోను 'పొళ్ళు' అనియే. 4. ని.రే. రా.౫. బాయిలి. 5. ని. రే. ౭౫. గట్టిన.

ఇందు వదనకే దేవుఁడు యింపులఁగడు మన్నించిన
కందువ పొలయలుకలఁ దమకము వడి రేఁపెడిని. ॥ఏమన॥ 88

ముఖారి

ఆతఁడేపో చెలియా మాయాతఁడు
చేతనే పరము చూపి చెలువైన యాతఁడు ॥పల్లవి॥

కుప్పలుగాఁ గస్తూరియు కుంకుమయు మయినిండ
నప్పళించుకొని యున్న యాతఁడు
గొప్ప గొప్ప ముత్తేల[1] కుప్పె సవరఘు పెద్ద
కొప్పుతోఁ జెలఁగీ నదెకో మా యాతఁడు ॥ఆత॥

మలయుఁ జెక్కుల నవ్వు మకర కుండలముల
అలర నిగ్గులె చల్లే యాతఁడు
బలువైన ముత్యాల పదకాల హారాల
వెలుఁగొందీ నదె చూడవే మా యాతఁడు ॥ఆత॥

సంకుఁ జక్రపుఁ జేతుల సందుల బాహుపురుల
అంకెలఁ బ్రభల మించే యాతఁడు
వెంకట నగము మీఁద విభవంపుఁ గౌఁగిలి నా
కుంకువగా నిచ్చె నదెకో మా యాతఁడు. ॥ఆత॥ 89

16వ రేకు. సాళంగం

వద్దు నాతో బొంక నిటువలె[2] నీకు నీ
సుద్దుల కాఁకల మంట సొద చొచ్చేరా ॥పల్లవి॥

కనలి సేనపరాధిఁ గానని కలికి నీ
కొనచూపులనే యలుగులఁ బారేనే
యెనసి యెవ్వతెకో మోహింతువని నీ మోవి
మనసార నాలిక మడ్డువట్టే రా ॥వద్దు॥

1. ని. రే. ౧౪. ముత్యాల. 2. ని. రే. ౭౧. వలెనా నీకు.

మఱచి యెవ్వతెతో నే మాటాడనని నీ
చిఱునవ్వు నిప్పులు దోసిట ముంచేనే
తెఱలఁ గాఁగిన నీ దేహపు టుక్కుఁ గంబము
కఱతలిన్నియు నని కౌఁగిలించేరా ॥వద్దు॥

వెలఁత దక్కితినని నీ వీడెపు రసము
చలివాయ నిపుడు పోసము దాగేనే
కలసియు నన్ను వెంకటరాయ కపటాన
నలయించేవని నీపై నాన వెట్టేరా. ॥వద్దు॥ 90

వరాళి

పన్నీరు చల్లేరా నీపై పలచని దెవ్వతో
అన్నువయలపుతోడ నసలాయఁ[1] జెక్కులు ॥పల్లవి॥

కప్పురము చల్లె నీపై కలికి యదెవ్వతో
యిప్పుడె నీ వురమెల్ల నెఱ్ఱనాయను
చెప్పరాని మురిపెంపు చేఁతలెల్ల నాకును
కప్పినఁ గప్పఁగరాని గతులాయ నిప్పుడు ॥పన్నీ॥

మృగనాభి చల్లె నీపై మెలుఁత యదెవ్వతో
తెగువ నీ మోమెల్ల తెల్లనాయను
నగవు మేలము గాదు నమ్మరా నా పలుకు
సగమాయ నిప్పుడే యీ చక్కని నీ దేహము ॥పన్నీ॥

కుంకుమ చల్లెర నీపై కోమలి యదెవ్వతో
సంకె దేరి నీమేనెల్లా చల్లనాయను
వెంకట విభుఁడ నీకు వెచ్చమైతిఁ[2] జెప్పరా
వుంకువగా నాకు నబ్బె ఉదుటు నీ చేఁతలు. ॥పన్నీ॥ 91

1. వి. రే. ౪౧. అసలాయ. 2. వెచ్చనైతి.

ఆహిరి

కుందణంపుమై గొల్లెత తా
నెందును బుట్టని యేతరి జాతి ॥పల్లవి॥

కప్పులు దేరేటి కస్తురి చంకల
కొప్పెర గుబ్బల గొల్లెత
చప్పుడు మట్టెల చల్లలమ్మెడిని
అప్పని ముందట హస్తిణీజాతి ॥కుంద॥

దుంప వెంట్రుకల దొడ్డతురుముగల
గుంపెన నడపుల గొల్లెత
జంపుల నటనలఁ జల్లలమ్మెడిని
చెంపల చెమటల చిత్తిణీజాతి ॥కుంద॥

వీఁపున నఖములు వెడవెడ నాఁటిన
కోపపుఁ జూపుల గొల్లెత
చాఁపున జట్టిగఁ జల్లలమ్మెడిని
చాఁపేటి యెలుగున శంకిణీజాతి ॥కుంద॥

గారవమున వేంకటపతి కౌఁగిట
కూరిమిఁ బాయని గొల్లెత
సారెకు నతనితో చల్లలమ్మెడిని
భారపుటలపుల పద్మిణీ జాతి ॥కుంద॥ 92

ముఖారి[1]

సతి గర్వమిది నీ తేజము గాదా
అతివఁ బ్రేమముతోడ నాదరించవయ్యా ॥పల్లవి॥

కనకపుఁ జమ్మాళిగలు మెట్టియల జ
వ్వని గర్వమున నెట్టె వచ్చి వచ్చి

1. ని. రే. ౩౬. భైరవి.

వెనక వెనకకె [1]పోయీ వెఱచి దేవరఁగని
కనకపుంపలము గక్కున నంపవయ్యా ||సతి||

అడప తొయ్యలి తన [2]కాకు మడచియ్యఁగా[3]
నడపుల [4]మురిపేన నవ్వుచు నచ్చి
అడరి నీ పొడగని [5]ఆకడే తపపుఁ దావె
పడుచుకొనెడి నీవె మడిచియ్యవయ్యా ||సతి||

కొప్పున సంపంగిరేకులు గానరాఁ జెరిగి
కప్పుచు మొయిల నిన్నుఁ గని కవిసి
యెప్పుడును దిరువేంకటేశుఁడ నీ వెలపెల్ల
చెప్పరాని తమకమే చిత్తగించవయ్యా. ||సతి|| 93

భైరవి

గోళ్ళ పెట్టుచునుండెఁ గొన్నాళ్ళు గొల్ల
పిళ్ళ పాలారగించె పిండు కొన్నాళ్ళు ||పల్లవి||

కోడెకాఁడై తిరిగెఁ గొన్నాళ్ళు తాఁ
గోడెల నావులఁ గాచెఁ గొన్నాళ్ళు
కోడెల వల్లెతాడై గొల్లెతలా తాఁ
గూడి పైకొనసుండెఁ గోరి కొన్నాళ్ళు ||గోళ్ళ||

గుజ్జు రూపము ధరించెఁ గొన్నాళ్ళు (తా?)
గుజ్జనగూళ్ళారగించెఁ గొన్నాళ్ళు
గుజ్జుబాలకిఁ దగిలెఁ గొన్నాళ్ళు తా
బొజ్జనె లోకము నించె బొందుగఁ గొన్నాళ్ళు ||గోళ్ళ||

కొండ గొడుగుగాఁ బట్టెఁ గొన్నాళ్ళు తాఁ
గొండముచ్చుల నేలెఁ[6] గొన్నాళ్ళు

1. ని.రే. ౩౬, ౩౭, ౬౫. వెన వెనకకె. 2. ని.రే. ౩౬. తన్నకాకు. 3. య్యగాను. 4. నడపుల్ల. 5. అడరుచు నిమఁగన్ని. 6. ని.రే. ౧౫. లనేయేల.

కొండల కోనేటి వాఁడై కోరికలా తాఁ
గొండుక చేఁతలు దొరకొనియెఁ గొన్నాళ్ళు. ॥గోళ్ళు॥ 94

ముఖారి

దొరకెఁగా పూజ కందువపూజ నీ
విరహపు తనుతావి విరవాదిపూజ ॥పల్లవి॥

కలికి నీ కనుచూపు కలువరేకులపూజ
లలన నీ నగవు మొల్లల[1] పూజ
తలపోఁత చింత చిత్తపుఁ గమలపు పూజ
చలివేఁడి వూర్పు నీ సంపంగి పూజ ॥దొరకె॥

కనలుఁ జెక్కునఁ జేయి కరపల్లవపు పూజ
తనుపులకలు జాజిననలపూజ
తనరు నీ వలులు దొంతరపూవుల పూజ
మొనయుఁ జెమట మల్లెమొగ్గల పూజ ॥దొరకె॥

చెనకు నీగోళ్ళే చిఱుగేదగుల పూజ [2]
గునియు గుబ్బలు పూవుగుత్తుల పూజ
ఘనతమైఁ గూడి వేంకటపతి మోము సోఁ
కిన నీదుమోవి మంకెనపూవు[3] పూజ. ॥దొరకె॥ 95

17వ రేకు. ముఖారి

పసులు గాచేటి కోల పసపుఁజేల
పొసఁగ నీకింతయేల బుద్ధుల గోల ॥పల్లవి॥

కట్టిన చిక్కపు బుత్తి కచ్చకాయల తిత్తి
చుట్టిన పించెపుఁబాగ చుంగుల సోగ
ఇట్టి సింగారము సేయ నింత నీకుఁ బ్రియమాయ
వెట్టి నీచేఁతల మాయ విట్టలరాయ ॥పసులు॥

---

1. ని.రే. ఉఽ. మల్లెల. 2. సా.రే. చిగురు గేదఁగి పూజ. 3. ని.రే. ఉఽ. పూవులపూజ.

పేయలఁ బిలుచుకూఁత పిల్లఁగోవి బలుమోఁత
సేయరాని గొల్లెతల సిగ్గులచేఁత
ఆయెడలఁ దలపోఁత యమునలోపలి యీఁత
వేయరాని మోపులాయ విట్టలరాయ ॥పసులు॥

కొంకులేని పొలయాట కూరిములలో తేట
అంకెల బాలులతోడి యాట పాట
పొంకపు తుత్తురు కొమ్ము పొలుపైన నీ సొమ్ము
వెంకటనగము చాయ విట్టలరాయ. ॥పసులు॥ 96

భైరవి

ఉగ్గు వెట్టరే వోయమ్మా చె[2]
య్యొగ్గీనిదె శిశువోయమ్మా ॥పల్లవి॥

కడుపులోని లోకమ్ములు గదలీ
నొడలూఁచకురే వోయమ్మా
తొడికెడి సరుగనఁ దొలఁగఁదీయరే
వుడికెడి పాలివి[3] వోయమ్మా ॥ఉగ్గు॥

చప్పలు వట్టుక సన్నపుబాలుని
సుప్పరమెత్తకురో యమ్మా
అప్పుడె సకలము నదిమీ నోరనె[4]
వొప్పదు తియ్యరె వోయమ్మా ॥ఉగ్గు॥

తొయ్యలులిటు చేతుల నలఁగించక
వుయ్యల నిడరే వోయమ్మా
కొయ్య మాటలను కొండల తిమ్మని[5]
నొయ్యన తిట్టకురోరమ్మా, ॥ఉగ్గు॥ 97

---

1. వి. రే. ౪౧. యేమెడఁ జూచిన నీ యమున. 2. వి. రే. ౮౧. చెయి వొగ్గీ.
3. ౮౧. పాలిదె. 4. నోరను. 5. తిమ్మయ.

దేసాళం

కొలనిదోఁపరికి గొబ్బిళ్లో యదు
కులము స్వామికిని గొబ్బిళ్లో ॥పల్లవి॥

కొండ గొడుగుగా గోవులఁ గాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్లో
మెండుగంపు దైత్యులకెల్లను తల
గుండు గండనికి గొబ్బిళ్లో ॥కొలని॥

పాపవిధుల శిశుపాలుని తిట్ల
కోపగానికిని గొబ్బిళ్లో
యేపునఁ గంసుని యిడుములఁ బెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్లో ॥కొలని॥

దండివైరులను తఱిమిన దనుజుల
గుండెదిగులునకు గొబ్బిళ్లో
వెండిఁ బైఁడియగు వెంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్లో. ॥కొలని॥ 98

కాంభోది

తమ్ములాల అన్నలాల తల్లులాల నే
నెమ్మనపు హరిఁ బాసి నిలువలేనిఁకను ॥పల్లవి॥

కొమ్మలాల మరుకోట కొమ్మలాల వో
యమ్మలాల తొలరె నా యక్కలాల
తమ్మిరేకుఁ గన్నుల యాతనిఁ బాసినే
నమ్మల సొమ్ములచేత నుండలేనిఁకను ॥తమ్ము॥

చెలులాల కలికి తొయ్యలులాల వో
యెల జవ్వనముల మోహినులాల

చెలువంపు హరిఁ బలఁచిన నాకు నే (?)
సులుహుఁగన్నీరాఁపకుండలే నిఁకను ॥తమ్ము॥

బోఁటులాల జవ్వనపు మేఁటులాల వో
గాఁటపుఁ దురుముల చీఁకటులాల
వాఁటమైన వేంకటేశ్వరుఁ జూసి నే
నాఁటుదాననై జన్మమందలేనిఁకను. ॥తమ్ము॥ 99

పాడి

ఏఁటికిఁ జేరీనేమితఁడు
నాఁటించి రతి నన్నేరె ॥పల్లవి॥

కన్నుల మొక్కీఁ గానుకలంపీ
నెన్నటికెన్నఁడిదేమితఁడు
నిన్నట నుండియు నెయ్యమె పెంచీ
నన్నేలీతఁడు నవ్వీనే ॥ఏఁటి॥

పువ్వుల వేసీఁ బొంచుక లాసే
నెవ్వరికెవ్వరిదేమితఁడు
దవ్వుల నున్నాఁ దాపము రేఁచీ
రవ్వలనే కడు రాసీనే ॥ఏఁటి॥

పంపులె పూసీఁ గౌఁగిట మూసీ
నింపులు సేసీనేమితఁడు
చెంపల చెమటల శ్రీవేంకటేశుఁడు
అంపరాని విభుఁడాయఁ గదే. ॥ఏఁటి॥ 100

శ్రీరాగం

సామాన్యమా వలపు సతులుఁ బతులనుభవన
[1] రేమరినఁ బ్రాణంబులేరీతి నుండు ॥పల్లవి॥

1. వి. రే. ౨౩. వన, యామరిన.

పలికె చూపుల మనసు గరఁగ కెటువలె నుండు
అలయింతలను దేహములయ కేలుండు
ఉలుపుఁ బిలుపుల మేను పులకించ కేలుండు
మొలకనగవుల యా (నా?)స మొలవ కేలుండు ॥సామా॥

పచ్చిచూపులు[1] కాఁడి పార కెటువలెనుండు
మెచ్చుమార్పులు[2] మనసు వేఁచ కేలుండు
మచ్చికల హృదయంబు మరులు గొన కేలుండు
అచ్చలంబునఁ గాఁకలలము కేలుండు ॥సామా॥

వంటమాటలఁ గూర్మి ఎగుల కెటువలెనుండు
నంటునను మోహంబు నాఁట కేలుండు
గొంటుఁజేఁతల (ఉ?) మనసు కొల్లగొన కేలుండు
రెంటలను విరహాగ్ని రేఁచ కేలుండు ॥సామా॥

కింకలను దమకంబు కెరల కెటువలె నుండు
జంకెనలఁ బ్రేమ కొనసాఁగ కేలుండు
వెంకటవిభుఁనిఁ గలసి[3] వెడయలుక యేలుండు
పంకజానన వానిఁ బాసియేలుండు. ॥సామా॥ 101

18-వ రేకు. మంగళకౌశిక

నేనేలెవ్వరునేల నీ కింక లో
లోనె వలపు లోఁచీఁ బోవయ్యా ॥పల్లవి॥

కలువరేకులు నీకుఁ గానుక యిచ్చినదట
చెలఁగి నీవెందో విచ్చేయఁగాను
అలమి కన్నులనె నీ వందుకొంటివని యాకె
పిలిచీనంటాఁ బిలిచేరు పోవయ్యా ॥నేనే॥

---

1. పులకాఁడి. 2. నూర్పుల. 3. సా. శే. వెంకటాద్రివిభుఁగాంచి వెడ.

చిగురుఁ దేనెలు నీపై చిలికించినదట
నగవు నీ వెందో వగఁగాను
జిగిగా నీవపుడే చేకొంటివంటా నాపై
నొగిలినంటా నొగిలేదు పోవయ్యా ॥నేనే॥

మోవిపంటు నీకు మోవినిచ్చినదఁట (?)
మోవికెంద నీవు మలయఁగాను
శ్రీవేంకటేశ యిచ్చితివి కౌగిలి నాకు
నీ వెంటు వలచినా నేనే పోవయ్యా. ॥నేనే॥ 102

శ్రీరాగం

గొల్లెతలకేలరా గోవజవ్వాది నీకు
చెల్లఁగాక యెటువలెఁ జేసినా నన్ను (ను?) ॥పల్లవి॥

కట్టినది అంచులతొగరుఁ జీర సందిఁ
బెట్టినది మొలవంక పెద్దగాజు
మెట్టిన (ది?) కంచుమట్టెల మించుమోఁత చేతఁ
బట్టినది చల్లచాడె పట్టకురా నన్నును ॥గొల్లెత॥

మాసినది తురుము చెమరుకంపు నే
వేసినది వెండికుప్పె వెంట్రుకదండ
వోసికొట్టు గొట్టి కంచుటుంగరాల చేయి
తీసేవు నీ చెల్లెతోడు తియ్యకురా నన్నును ॥గొల్లెత॥

ముంచినవి చెమటలు మోమునిండ కడు
వంచినది చూడరా నావాలుఁజూపు
యెంచనేల నన్నువిట్టె యేలితివి వోరి
చెంచెతల లంజకాఁడ శ్రీవేంకటేశుఁడా. ॥గొల్లెత॥ 103

పాడి

ఏతులే నెరప వచ్చీనెవ్వఁడే వీఁడు తన
రాతిసుంచెతోఁడ నన్ను రమ్మనీనే చెలియా ॥పల్లవి॥

కదిమిన చూపులకుఁ గన్నుల నవ్వుచు నా
యెదురయి నిలుచున్నాఁడెవ్వఁడే వీఁడు
ఉదుటు మీరి తిరిగి నొద్దిగి వీనిపుచము
సదనేసి వడి నణఁచఁగదె వోచెలియా ॥ఏతు॥

చేసువనె నియుచుండి చెలితో నవ్వఁగను
యీరసములే యాడీ నెవ్వఁడే వీఁడు
వారించకిటువంటివానిఁ బట్టి కొనగోరఁ
జీరఁగా నొడలెల్లఁ జించఁగదె చెలియా ॥ఏతు॥

చెంతనుండి నన్ను వేసీ సేమంతిపూవులనే
యెంత చెప్పినా మానఁడెవ్వఁడే వీఁడు
ఇంతటి యీ తిరువేంకటేశుఁడిదె నన్నుఁ గూడి
పంతము నెరపి పోయీఁ బట్టుకొనవే చెలియా. ॥ఏతు॥ 101

లలిత

నిక్కమటే యీ[1] మాట నిజమనేవు
నిక్కముగాక బొంకనేర్తుమా బాలుఁడా ॥పల్లవి॥

కంటివటే వెన్న దియ్యఁగా గొల్లెతా ని
న్నంటిమా మా వెన్న వోయనంటిమి గాక
ఇంటికి నే వచ్చితినటే గొల్లెతా మా
యింటికేఁక నీకు రానేలయ్య బాలుఁడా ॥నిక్క॥

ఏటే మాకుఁ బాలు లేవటే గొల్లెతా నీకు
నేలలేవు మమ్మునిట్టె యేఁచేవు గాక

1. ని. శే. ఉ౨. నీమాట.

పాల నేఁబంచుటు వలెంపవే గొల్లెతా ఆ
పాలు నీకునేల మా పాలేకాక బాలుఁడా ॥నిక్క॥

కల్లలాడ నేరకొంటిగా గొల్లెతా యేల
పల్లదాలు వేంకటాద్రిపై బాలుఁడా
చెల్లఁబో నన్నొల్లవటే చిన్నిగొల్లెతా నీకు
జెల్లునిట్టె యేమైనఁ జేయవయ్యా బాలుఁడా. ॥నిక్క॥ 105

పాడి

అప్పటిని చెక్కు నొక్కేవందుకా యిది
యెప్పుడో కూడితిరి మీరిందుకా యిది ॥పల్లవి॥

కుందనపు బొమ్మవలెఁ గోపగించుకొని రాఁగా
నందలానఁ బెట్టుకొంటివందుకా యిది
చందెపు ముత్తెపుఁబేరు సందులదండల నిట్టె
యిందమంటా నింతికిచ్చితిందుకా యిది ॥అప్ప॥

దీకొని కోమలి నిన్నుఁ దిట్టుచు దగ్గరి రాఁగా
ఆకు మడిచియ్యఁ జూచేవందుకా యిది
మీకు మీకే పెంచటాడి మీరుమీరే మీలోన
యేకమై కూడితిరి మీరిందుకా యిది ॥అప్ప॥

ముద్దులమోముల మీ మీ మోవులపై చేఁతలెల్ల
సద్దములోపలఁ జూచేరందుకా యిది
తిద్దుకొంటిరి రతుల[1] తిరువేంకటేశ మీ
యిద్దరికి నింపులాయ నిందుకా యిది. ॥అప్ప॥ 106

పాడి

చక్కని తల్లికి చాఁగుబళా తన
చక్కెరమోవికి చాఁగుబళా ॥పల్లవి॥

1. ని. రే. ౨౪. కొంటిరలపులు.

కులకేటి మురిపెపుఁ గుమ్మరింపుఁ దన
సళుపుఁ జూపులకు చాఁగుబళా
పలుకుల సొలపులఁ బతితోఁ గసరెడి[1]
చలముల యలుకకు చాఁగుబళా ॥చక్క॥

కిన్నెరతోఁ బతి[2] కెలన నిలుచుఁ దన
చన్నుమెఱుఁగులకు చాఁగుబళా
ఉన్నతిఁ బతిపై నొరగి నిలుచుఁదన
సన్నపు నడిమికి చాఁగుబళా ॥చక్క॥

జందెపు ముత్యపు సరులహారముల
చందనగంధికి చాఁగుబళా
విందయి వెంకటవిభుఁ బెనఁచిన తన
సందిదండలకు చాఁగుబళా. ॥చక్క॥ 107

211-వ రేకు.[3] శంకరాభరణం

పోదిగా[4] నేఁడతనికే పొలఁతి మానము గావ
నేదదేరఁ జెమటయు చిలికించెఁ జూడరే ॥పల్లవి॥

కుంతలపు నెరుల చిక్కుల చీఁకటులఁ జిక్కి
యింతలోనే ముఖచంద్రుఁడింతికి నేఁడు
చెంత వాయఁ బతివచ్చి జిగిచన్నుఁగొండలపై
వింత చందురుల దండు విడియించెఁ జూడరే ॥పోది॥

ఈతల నిట్టూరుపుల యెండమావులనె వాడె[5]
లేఁతమోవి చిగురు యీ లేమకు నేఁడు
పూఁతగాఁ దెచ్చి చెలియ పులకలవెల్లి నించె
మేఁతలాడి[6] రమణుఁడీ మెలుఁతమైఁ జూడరే ॥పోది॥

1. ని. రే. ౨౩, గొసరెడి. 2. కిన్నెరపతితో కెలన. 3. ౧౯-వ రేకు నష్టమైన వానిలో నొకటి. 4. ని. రే. ౫౭. పోదుగా. 5. నాఁడె. 6. మేఁతలాఁడి (డీ ?).

పుట్టుబోగి సిగ్గుల చూపుల పూవుఁదీగెలపై
పిట్టపిడుగాయ సతిప్రేమము నేఁడు
గట్టిగ వేంకటపతి కౌఁగిటనలమి కొమ్మ
దిట్టఁజేసి భయమెల్ల దిగఁదోసెఁ జూడరే. ॥పోది॥ 108

## నారణి [1]

ఏమి సేయఁగవచ్చు నేకాలమేత్రోవ
ఆమీఁది దైవగతులటుగాక పోదు. ॥పల్లవి॥

కసుమాయ నెన్నడిమికరవుననె లలితాంగి
పసువుచునుఁ గుచగిరుల పాలాయను
కనలి లోలోని దొంగలచేతఁ బోటువడి
వొనరఁ గట్టినచీరయును శిథిలమాయ ॥ఏమి॥

పెడమరలి సునుఁదురుముపెదచీఁకటినె చెలియ
బడలి వదనము వంచఁ బాలాయను
వెడఁదకన్నుల చూపువేడుకల వగలెల్లఁ
దడవి హితవైన చిత్తంబు నెరవాయ [2] ॥ఏమి॥

అరుదైన పరవశంబును అడవిలోఁ దగిలి
పరిమళపుఁ జెమట నది [3] పాలాయను
ఉరవైన తిరువేంకటేశుకౌఁగిటఁ గూడి
కురులు సవరించ సిగ్గులునుఁ బగలాయ. ॥ఏమి॥ 109

## శ్రీరాగం

అంతకంతకు గాలినణఁగునా యనలంబు
కాంత నిట్టూర్పులాఁకలి చెరిచెఁగాక ॥పల్లవి॥

---

1. వి. రే. ౩౭. నారాయణి. 2. త్తంబుఁ బగలాయ. 3. నదిచెమట.

కలువలూరక నీటఁ గందునా యెందైనఁ
జెలియకన్నీరిట్లఁ జేసెఁ గాక
జలజంబుపై వేఁడి చల్లునా రవి యిట్ల
నలఁచి మదనాగ్ని వదనము నొంచెఁ గాక ॥అంత॥

విరులకునుఁ దుమ్మిదలు వేరచునా యెందైన
మరుబాణముల నెరులు మలఁగెఁగాక
వరుస మంచునఁ దీగె వాడునా యెందైన
అరిది చెమటలనె దేహము నొగిలెఁ గాక ॥అంత॥

కుముదహితుఁడెందైనఁ గూడునా జక్కవల
కొమరె గుబ్బలమీఁదఁ గూడెఁ గాక
తిమిరంబు తిమిరమునఁ దెమలునా యెందైన
రమణి వేంకటవిభుని రతిమఱపుగాక. ॥అంత॥ 11॥

ముఖారి

ఆఁపలేక నిను దూరేనంతె కాక
యేఁపుచుఁ గూడేటి[1] పొందులేలయ్య విభుఁడా ॥పల్లవి॥

కోపగించుకొన్నచోట కూరిమితో వినయమే
చూపిన నామాట నీకు సొగసీనటే
యేపు రేఁగి నీకుఁ బ్రియమెక్కుడనో వుండఁగాను
తాపమయ్యే పొందు నీకుఁ దగదయ్య విభుఁడా ॥ఆఁప॥

నేరములెన్నఁగ నేను నిజములు వలికిన
వైరములే యౌఁగాక వలపౌనటే
యీరుదీయఁ బేను వచ్చినిఁకనేల మాటలు నీ
వారము మమ్మిఁకఁ దడవకుమయ్య విభుఁడా ॥ఆఁప॥

1. వి. రే. ౪౭. గూడెడి.

ననిచి కూడినవారు నమ్మక [1]ప్రియునిమీఁద
కసలి యాడినమాట కసరౌనటే
ఘనుఁడవు తిరువేంకటరాయ మనలోని
కినుకలన్నియు నిట్టె గెలుపయ్యె విభుఁడా. ॥ఆఁప॥ 111

కాంబోది

అతివ జవ్వనము రాయలకుఁ బెట్టిన కోట
పతి మదనసుఖరాజ్యభారంబు నిలుప ॥పల్లవి॥

కాంతకనుచూపు మేఘంబులోపలి మెఱుఁగు
కాంతుని మనంబు [2]చీఁకటి వాపను
ఇంతి చక్కనివదన మిందుబింబము విభుని
వంత కనుదోయి కలువలఁ జొక్కఁజేయ ॥అతివ॥

అలివేణిధమ్మిల్లమంధకారపు భూమి
కలికి రమణునకు నేకతమొసఁగను
పొలఁతికి [3]బాహువులు పూవుఁదీగెల కొనలు
పొలసి ప్రాణేశు వలపుల లతలఁ బెనచ ॥అతివ॥

పంకజాననరూపు బంగారులో నిగ్గు
వేంకటేశ్వరు సిరులు వెదచల్లఁగా
చింకచూపుల చెలియచేఁత మదనునిచేఁత
యింకా నతనినె [4]మోహించఁ జేయఁగను. ॥అతివ॥ 112

నాదరామక్రియ [5]

ఏమి సేయుదునమ్మ యిన్నియును నిటుగూడె [6]
తామసపుఁ బ్రేమ వేదనఁ బాయనీదు ॥పల్లవి॥

1. నమ్మికప్రియు. 2. సా. ఠే. మనసు. 3. ని. రే. ఇకా. బాలిఁతికి. 4. ఇంకా నతని మో. 5. తా. వెం; తం. ప్ర. కాంబోది - జంపెతాళము. 6. తా. వేం. నాతామస.

కినిసి నే సొలసి పలికెప నంటినా యతని
    నెనయుఁడెడఁబాటు నోరెత్తనీదు
    చెనకి యలపార[1] జూచెద నంటినా యతని
    కనుఁగవ జలంబు సరుగనఁ జూడనీదు. ॥ఏమి॥

కెంచుపడి కదిసి మ్రొక్కెద నంటినా యతని
    యంది (నంది ?) పరవశము[2] చేయాడ నీదు
    డెందంబు మఱచి యుండెద నంటినా యతనిఁ
    జెందిన తలఁపు మఱచియు మఱవనీదు ॥ఏమి॥

తిరువేంకటేశుఁ బొందితినంటినా[3] యతని
    దొరతనము నాగరిమ దోఁచనీదు
    సరిదొలఁకు రతుల నలసితి[4] నంటినా యతని
    సరసంబు వేడుకలఁ జాలించనీదు. ॥ఏమి॥ 113

21-వ రేకు. కాంబోది - రచ్చతాళం

తవ మాం ద్రష్టుం దయా స్తివా
    [5] త్రివిధైర్ఘనాని తే నామాని ॥పల్లవి॥

కరరమణీ కంకణైర్ఘనకుచ
    గిరౌ[6] స్థాపిత కిన్నరియం[7]
    సరసం మ్లేచ్ఛరచనాని త్వయి[8]
    స్థిరా నదయతి తే నామాని ॥తవ॥

కలవర కంపిత కంఠవిలసనం
    కిలకిలమేళన కిన్నరియం
    లలనా కావా లంఘితవాద్యం
    తిలకయతి తదా తే నామాని ॥తవ॥

1. తా. వే. యెలవార. 2. తం. ప్ర. అందినా పరవశత. 3. తం. ప్ర; తా. వేం. గలసెద నంటినా. 4. నలసెద నంటి. 5. ని. రే. ఉ౯. త్రివితేర్ఘనా. 6. గిరియో. 7. కిన్నెరియాం. 8. త్వేసుసిరా.

నిరత మూర్ఛనా నిబిడతాళరవ[1]
గిరాయోజిత కిన్నరియం
తరుణీ రణయతి తదా సమీపే
తిరువేంకటవర తే నామాని. ॥తవ॥ [2] 114

వరాళి

సొంపుల నీ వదనపు సోమశిల కనుమ
యింపులెల్లఁ జేకొనఁగ నిల్లు నీపతికి ॥పల్లవి॥

కలికి నీపిఱుఁదసే గద్దెరాతికనుమ
మొలనూళ్ళలతలనే ముంచుకొన్నది
కలయఁ బోకముడినే కట్లువడ్డది
అలరువిలుతుదాడికడ్డము నీ పతికి ॥సొంపు॥

ఇదివో నీ కెమ్మోవి యెఱ్ఱశిల కనుమ
కదిసి లేఁజిగురులఁ గప్పుకొన్నది
వదలకింతకుఁ దలవాకిలైనది
మదనుని బారికి మాఁటువో నీ పతికి ॥సొంపు॥

కాంత నీ చిత్తమే దొంగలసాని కనుమ
యింతటి వేంకటపతికిరవైనది
పంతపు నీ గుబ్బలే గుబ్బలికొండకనుమ
మంతనాల కనుమాయ మగువ నీ పతికి. ॥సొంపు॥ 115

కన్నడగౌళ - అటతాళం

తురుము నీవియు జార తొయ్యలి వెరగంద
సిరులఁ బరవశము సేసితిగా నీవు ॥పల్లవి॥

---

1. రవంగిరా. 2. ఈ సంకీర్తన అనన్వితము. యథామూలముగా ఇందుద్ధరింపఁబడినది.

కొమ్మ మోవి నీకుఁ బిల్లగోవిగాఁగ నిడుకొని
కుమ్మరించుఁ గుత్తుకలోఁ గుల్కుకుచును [1]
తమ్ములపు రసము చిత్తడిగా [2] ఁ గుర్రియుచు
చిమ్మిరేఁగ రాగము నించితివిగా నీవు ॥తురుము॥

పడఁతిగుబ్బలు నీకుఁ బాంచజన్యములుగా
కడివోని మొనలోలిఁ గదియ [3] నొత్తి
తడయక మదనయుద్ధము గెలిచితినంటా
వొడలి చెమటలార [4] నూదితిగా నీవు ॥తురుము॥

వెలఁదివీఁపిది నీకు వీణె వాళవుగా [5]
ములువాఁడి కొనగోళ్ళ మోఁపి మోఁపి
కలసి కౌఁగిటను వెంకటగ్గిరి విభుఁడ [6] నీ
మెలుపుఁగళల తంత్రి మీఁటితిగా నీవు. ॥తురుము॥ 116

కన్నడగౌళ [7]

రమణి సురటిగాఁ జెరఁగు వీచీని
చెమరించెనంటాఁ జెలి దూరీని ॥పల్లవి॥

కలగంటినంటా కాటుకకనుల నీరు
వొలకఁగా మలగు [8] పై నుసురనీని
తల నొచ్చీనంటా దంతపుటోవరిలోన
పలుకదు పిలిచినాఁ బవ్వళించీని ॥రమణి॥

తొలఁగితినంటా తూఁగుమంచముమీఁద
నెలవినవ్వులతోడ శిరసూఁచీని
అలసితినంటా నల్లరుఁబానుపుఁమీఁద
పులకలమేనితోఁ బొరలాడీని (ల్లాడీని ?). ॥రమణి॥

---

1. ని. రే. క్వచి. గుల్లుకులను. 2. బిత్తరమ్ముగా. 3. గమియ. 4. టజార. 5. పిరె........గాఁగ. 6. కటగిరీంద్రుఁడ. 7. ని. రే. ౧౧౦. తెగదమ్మటతాళం. 8. గుమల్లు.

సొరిగితినంటా సురతపరవశాన
నరవిరి కనురెప్పలల్లాడించీని
తిరమాయనంటాఁ దిరువేంకటేశ్వరుఁ
దరుణి గలసి యుంకాఁ దమకించీని. ॥రమణి॥ 117

ఆహిరి

చెంగటనే చెలువంపుఁ జీఁకటి దవ్వఁగను
ముంగిట నిధానమబ్బె మొక్కుదుఁగాకిఁకను ॥పల్లవి॥

కొండుకవయసు కొమ్మగుబ్బలపైఁ [1] బ్రేమపు
లెండదాఁకి పులకలెన్ను వెళ్ళఁగా
బెండుపడి కైవాలెఁ బెనుదురుమిఁకనేమి
పండెఁ గోఁకుకొందుగాక పనులేఁటికిఁకను ॥చెంగ॥

చక్కని జవ్వని కన్నుఁజాయల పాదరసము
పుక్కిటి వెచ్చని వూరుపుల నూదఁగా
గక్కన బంగారాయ కడలేని కోరికలు
దక్కెఁ దీసుకొందుగాక తడవేల యిఁకను ॥చెంగ॥

పల్లదపుఁ జెమటల పాలజలనిధి దచ్చి
వెల్లిగొన సిరులెల్ల వేంకటేశుఁడా
పల్లవాధరిచనవు పచ్చిదేర వేడుకెల్ల
కొల్ల చేకొందువుగాక కొంకనేఁటికిఁకను. ॥చెంగ॥ 118

ముఖారి

ఏలే దగ్గర నియ్యవిట్టె నన్ను
తూలపుచ్చి మరుబారిఁదోయ దొరకొంటివి ॥పల్లవి॥

కాలు దాఁకీ మొక్కేమయ్యా గబ్బినసేవు [2] గనక
యేల దగ్గర విచ్చేసేవిట్టె నన్ను

1. వి. రే. ౬౩. గుబ్బపై. 2. వి. రే. ౧౩. గబ్బినసేవు.

తిరువేంకటగిరి దేవునితోఁగూడి
సరసపుఁ బెండ్లి జరగెఁ గా నీకు. ॥ఏమి॥ 120

కాంభోధి

చెంపల యేరు[1] ముండ్ల చెంచువారము నీకు
నింపుగాని[2] మా పొందులేలయ్యా ॥పల్లవి॥

కమ్మనిమామయి[3] పూఁత గదరుఁబిల్లల గబ్బు
యెమ్మెల మాపట్టుచీర యేపెనార[4]
సొమ్ములుఁ బెంచపుకన్నుఁ[5] జూపులయమ్ములకె
వొమ్మదు నీ పొందు నాకు[6] నొల్లమయ్యా ॥చెంప॥

కొప్పుగేదఁగులుమాకు కొన నెమలీకలు
గొప్పముత్యాలివి మాకు గురిగింజలు
కప్పురంబు మాకేటి[7] గడ్డల తెల్లని మన్ను
వొప్పదు మాకేల యిచ్చేవొల్లము నేమయ్యా[8] ॥చెంప॥

కుంకుమ మాకిపుడు జేగురుఁబొడి నుదుటికి
బింకపుఁ దిట్లె[9] మా ప్రియములు
కంకిగాఁగ నెలయించి కౌఁగిటఁ గూడితి నన్ను
వేంకటవిభుఁడ యిఁక వీడవయ్యా. ॥చెంప॥ 121

వరాళి

కటకట సతిశృంగారము కన్నులపండువు దోఁపుచు
యిటువలె నిలిచి చిత్తంబిందరినేఁపెడిని ॥పల్లవి॥

కోమలి కొప్పునఁ జెరివిన క్రొవ్విరులాత్మజు శరములు
వేమరుఁ బొదిగొన నాఁటిన విధమున నొప్పెడిని

---

1. ని. రే. ౧౦౦. చెంపల్లయేదు. 2. గాము. 3. పై పూఁత. 4. యేపినార. 5. సొమ్ములఁ బిచ్చేవు నన్ను. 6. మాకు. 7. కప్పురపు మానికింది. 8. వొల్లమయ్యా. 9. దేంట్లే.

కాముని పూసిన కస్తురి కంతుని బాణారుణిమే
యీమైఁ బై పైఁబేరిన యిటువలె నొప్పెడిని ॥కట॥

అతివకు భూషణజాలంబంతయు మరునస్త్రములకు
జతనంబగు షైమపుషై సరిఁ జెలువొందెడిని
సతి గట్టిన వెలిపట్టము చంపెడు మదనుని బారికి
సితకరుఁడడ్డము చొచ్చిన చెలువము దోఁపెడిని ॥కట॥

బలుపగు చెలిచనుగుబ్బలపై వేంకటపతి నించిన
లలితపురేఖల బిత్తరిలాగులు దోఁపుచును
వలరాయని చిరునమ్ములు (?) వడిఁదాఁకిన గంట్లవలెఁ
బొలుపుగఁ జూచినవారల బొమ్మరపరపెడిని. ॥కట॥ 122

ఆహిరి [1]

అన్నిజాతులు దానె యైవున్నది [2]
కన్నులకలికి మాయగరచెనో యనఁగ ॥పల్లవి॥

కన్నె శంకిణీజాతి గాఁబోలు వీఁపునను
సన్నపు మదనాంకములు జడి [3] గొన్నవి
వన్నెలుగ వలరాజు వలపు తలకెక్కించ
వన్నినటువంటి సోపానములో [4] యనఁగా ॥అన్ని॥

తెలవ దలపోయ చిత్తిణీజాతి గాఁబోలు
నెఱులు విచ్చుచు వీధి నిలుచున్నది
నెఱతనము [5] మరుఁడు తను [6] నిండనేసిన యంప
గరులిన్ని యనుచు లెక్కలు వెట్టుగతిని ॥అన్ని॥

కాంత హస్తిణీజాతి గాఁబోలు కరమూలము [7]
లంతకంతకు నలువులై యున్నవి

1. ని. రే. ౨౩. వరాళి. యీ కన్నుల. 3. నాంకురములజడ. 4. పానంబు లనఁగ. 5. నవు. 6. తలనిండ. 7. మూలమంత... ...యున్నది.

పంతంపు మరుఁడు తన భండారమిండ్లకును
దొంతిగా నిడిన కస్తురి ముద్రలనఁగా ॥అన్ని॥

ఘనత [1] పద్మిణిజాతి గాఁబోలు సీలలన
తనువెల్ల పద్మగంధంబైనది
మినుకుగా మరుఁడు తామెరలమ్ములనె [2] మేను
కనలించి వడిఁ బువ్వుగట్టెనో యనఁగా ॥అన్ని॥

ఇదియు జగదేకమోహిణి [3] దానె కాఁబోలు
కదలు కనుఁగవకెంపు గలిగున్నది
వదలకటు వేంకటేశ్వరుని కుంకుమపూఁత
చెదరి చెలికనుఁగొనలఁ జిందెనోయనఁగా ॥అన్ని॥ 123

ఆహిరి

కెరలి బయట దాఁగీ వీఁడు తన
వొరపులు చూపుచు నొరగీ వీఁడు ॥పల్లవి॥

కొమ్మ చూడవే కొలిమిగూటిలో
నెమ్మొడి నూదులె యదె వీఁడు
ఎమ్మెలు నెరపుచు నెక్కడఁ దిరిగో
నమ్మికబొంకుల నను నొలసీని ॥కెరలి॥

నాఁతిరో చూడవె నవ్వుచు మీలకు
సేఁతలు గరపీనిదె వీఁడు
కాఁతాళంబునఁ గనలెడి నాపై
చేఁతలు సేసీఁ జెలఁగుచుఁ దాను ॥కెరలి॥

అల్లనె చూడవె అడవిమృగములకుఁ
బల్లము వేసీఁ బై వీఁడు

1. నతఁబద్మి. 2. యమ్ములనె. 3. మోహిని.

వొల్లని ననుసిదె వుల్లము (ము ?) చేకొనెఁ
గల్లరి తిరువేంకటపతి వీఁడు. ॥కెరలి॥ 124

ఆహిరి

మూసిన ముత్యాన[1] కేలే మెరఁగులు
ఆసల చిత్తాన కేలే అలవోకలు ॥పల్లవి॥

కందులేని మోము[2] కేలే కస్తూరి
చిందు నీ[3] కొప్పున కేలే సేమంతులు
మందయానమున కేలే మట్టెల మోఁత
గందమేలే పైపై కమ్మని నీ మేనికి ॥మూసిన॥

భారపు గుబ్బల కేలే పయ్యెద నీ
బీరపుఁ జూపుల[4] కేలే పెడమోము
జీరల బుజాల కేలే చెమటలు నీ
గోరంట గోళ్ళ కేలే కొనవాండ్లు ॥మూసిన॥

ముద్దుల మాఁటల కేలే ముదములు నీ
యద్దపుఁ జెక్కుల కేలే అరవిరి
వొద్దిక మాటల[5] కేలే వూర్పులు నీకు
నద్దమేలే తిరువేంకటాద్రీశుఁ గూడి ॥మూసిన॥ 125

23-వ రేకు. శ్రీరాగం

కలికి కాఁతాళములు కారింపులా
లలితంపు వలపులకు లంచములు గాక ॥పల్లవి॥

కినుక కనుఁగొనల జంకెనలు విరసంబులా
రసములొలికెడి మనోరతులు గాక

1. ని. రే. ౪౫. ముత్యాల. 2. మేనికేలే. 3. చిందని. ... .తావలతులు. 4. చూపున.
5. కూటమికే.

కొసరు గుంపెనల సిగ్గులు[1] విళంబంబులా
　　ముసికిలని[2] మోహముల దొంతరలు గాక ॥కలికి॥
అబ్బురములైన పొలయలుక లోలంబులా[3]
　　గబ్బుఁ దమకముల మీఁగడలు గాక[4]
　　గబ్బిమాటల సొళంగంబులలి యేతులా
　　సబ్బితిలు మోహముల[5] కుంపెనలు గాక ॥కలికి॥
కొనబు కొనగోళ్ళ తాఁకులవి మే(ని) నొప్పులా
　　ననుపులకు నుబ్బుఁగవణములు గాక
　　వనితకీవేంక[6] టేశ్వరు సిటలు మరపులా
　　మనసు మర్మముల తన్మయములవి గాక[7]. ॥కలికి॥ 126

భైరవి

భామ నోఁచిన నోము ఫలము సఫలముగాను
　　కామతాపంబునకు కాండవము నోమె ॥పల్లవి॥
కొమ్మ చలిమందులకు గొంతిదామెర నోమె
　　కమ్మఁదావులకు మును గౌరినోమె
　　నెమ్మదిని కన్నీట నిండుఁగొలఁకులు నోమె
　　ముమ్మడించిన వగల ముచ్చింత నోమె ॥భామ॥
చెదరు గందంబునకు చిట్టిబొట్లు నోమె
　　కదియు పులకలకు మొలకలనోము నోమె
　　ముదిత మాటాడక్షిదె మౌనద్వాగెలు నోమె
　　పొదలు చెమటలకు నినుపులనోము నోమె ॥భామ॥
నెలఁత మొగమునకు వెన్నెలమించులటు నోమె
　　వెలయుఁగాంతికి వీధివెలుఁగు వా నోమె

---

1. ని. రే. ౧౭. గుంపెనలు మంకుల విడంబం. 2. సా. రే. దుసికిలెటి. 3. సా. రే. బొల్లంబులా. 4. ని. రే. గుబ్బుఁ దమకముల గుంపెనలుగాక. 5. కోరికల. 6. సా. రే. వనిత తిరువేంక. 7. తనివోని సురతముల తన్మయముగాక.

ఎలమితోఁ దిరువేంకటేశుకౌఁగిటఁ గూడి
లలితాంగి విచ్చకల్యాణంబు నోమె. ॥ధామ॥ 127

సామంతం

అపురూపమైన మోహము దాఁచి యిటువంటి
కపటపు నటనలు గడియించనేలే ॥పల్లవి॥

కెన్నెరకాయలఁ బోలు కిక్కిరిసినట్టి గుబ్బ
చన్నులపై నునుఁగొంగు జారఁగ
కెన్నెర మీఁటుచు మంచి సన్నపు వడపుతో
కన్నులు దేలఁగమేసు కదలించేవేలే ॥అపు॥

వీడియు వీడనికొప్పు వేగన ముడుచుచు
ఆడెడి బిత్తరిమాటలమరఁగా
చూడనొప్పె నీ మంచి సుద్దులు చెప్పఁగనెంతే
వాడక వాడుదురే వైతాళమేలే ॥అపు॥

చెక్కుటద్దములమీఁది చెమట చిత్తడితోడ
సొక్కులు దేరఁగ మేను సుదతికి
చిక్కించి నిన్నుఁగూడె శేషగిరీంద్రుఁడు నీ పయి
మక్కువగలిగి కొంత మనసియ్యఁదేలే. ॥అపు॥ 128

పాడి

ఒఱపో మెఱుపో వొయ్యారమో నీకు
వెఱతుమయ్య గోవిందుఁడా ॥పల్లవి॥

కపటమొ నిజమో కరుణయొ కోపమో
వుపచారమో వుపతాపమో
నిపుణత త (ఁద ?) నపై నెయ్యమే నేసేవు
విపరీతము గోవిందుఁడా ॥ఒఱ॥

సనుపో నగవో నయమో ప్రియమో
చనవో చలమో సరసమో
కనుకూరిమియో గయ్యాళితనమొ
వెనుతగిలేవు గోవిందుడా ॥ఒఱ॥

మంకో మరులో మదమో ముదమో
బింకో లంకో జగడమో
శంకలేక నను సరుగనఁ గూడితి
వెంకటగిరి గోవిందుఁడా. ॥ఒఱ॥ 129

ఆహిరి

లలితలావణ్య విలాసముతోడ
నెలఁత ధన్యత గలిగె నేఁటితోడ ॥పల్లవి॥

కుప్పలుగా మైనసలుకొన్న కస్తూరితోడ
తొప్పఁదోగేటి (గెడి ?) చెమటతోడ
అప్పుడటు శశిరేఖలైన చనుఁగవతోడ
దప్పిదేరేటి (రెడి ?) మోముఁదమ్మితోడ ॥లలిత॥

కులుకుఁ గబరీభరము కుంతలంబులతోడ
తొలఁగఁ దోయని ప్రేమతోడ
మొలకనవ్వులు దొలఁకు ముద్దుఁజూపులతోడ
పులకలు వొడమైన పొలుపుతోడ ॥లలిత॥

తిరువెంకటాచలాధిపుని మన్ననతోడ
సరిలేని దివ్యవాసనలతోడ
పరికించరాని అరవిరిభావముతోడ
సిరి దొలఁ (లం ?) కెడి చిన్నిసిగ్గుతోడ. ॥లలిత॥ 130

సామంతం

చింతాపరంపరలు చిత్తంబునకుఁ దోడవు
ఇంతి సౌభాగ్యంబులిన్నిటికిఁ దోడవు ॥పల్లవి॥

కలికి నెమ్మోముసకుఁ గబరీభరము తోడవు
తళుకుఁజూపులు చక్కఁదనమునకుఁ దోడవు
ఎలమిచెక్కుల మించుల్చిరువంకలకుఁ దోడవు
మొలకనగవులు సొబగు మురిపెముల తోడవు ॥చింతా॥

కరమూలరుచులు బంగారంబునకుఁ దోడవు
గురిగాని కౌఁదీగె గుబ్బలకుఁ దోడవు
సిరిదొలఁకు జఘనంబు చిన్నినడపుల తోడవు
నిరతంపుఁ బాదములు నిలువునకుఁ దోడవు ॥చింతా॥

శ్రీ వేంకటేశుకృప చెలియకెప్పుడుఁ దోడవు
భావసంగతులకునుఁ బరవశమె తోడవు
ఈ వెలఁది నునుఁబలుకులించువిలుతుని తోడవు
లావణ్యములకు నీలలన దాఁ దోడవు. ॥చింతా॥ 131

24-వ రేకు. పాడి

అవి యెటువంటి రహస్యములో
సవరని సతులకు ఝల్లనె మేను ॥పల్లవి॥

కల గని చెలితో కాంత నాయకుని
చెలువము చెప్పుచు చిడిముడితో
పలుకఁగనేరక భ్రమసిన మాటలు
తలఁచి చెలులు కడుఁ దత్తరపడిరి ॥అవి॥

రమణుఁడు కలలో రమణితో ననిన [1]
ప్రమదపు దైన్యపు పలుకులివి
చెమరించఁగ విని శిరసులు వంచుక [2]
కొమెరలు దలఁచిరి కూరిమిపతుల ॥అవి॥

1. ఇది ని. రే. ౩౬. పాఠము ; సా. రే. నగిన. 2. వంపుచు.

వేంకటరమణుఁడు వెలఁదియుఁ గలలో
బింకపుఁ గూటమిఁ బెనఁగుటలు
లంకెల పొందులు లలనలు విని విని
కొంకక కనుఁగొనఁ గురిసిరి నీరు. ॥అవి॥ 132

సామంతం

కొనచూపులనె వింతకోరికలు దైవార
పెనగొన్న తమకములఁ బెనఁగుటెన్నఁడురా ॥పల్లవి॥

కమ్మ (ని) కస్తూ (స్తు ?) రితావి కప్పురపువాసనల
తమ్ములము నోరిలోఁ దగఁ గులికి కులికి
ఉమ్మగింతల రతులనుడివోని వేడుకల
ఇమ్ములను గూడి సుఖియించుటెన్నఁడురా ॥కొన॥

బిగువుఁ గౌఁగిటఁజేర్చి బిత్తరపుఁ జూపులను
నగవు దేరఁగ మనసు నాఁటించి మించి
మొగము మొగమునఁజేర్చి ముద్దుమాటలను సుసుఁ
బగడవాతెర గదలఁ బలుకుటెన్నఁడురా ॥కొన॥

కడు మోహమున సిగ్గు గదియుటెన్నఁడు లేక
యెడలేని కూటముల యెచ్చరికె లేక
విడువకిటువలెనె తిరువేంకటేశుఁడ నీవు
వడిఁ దలఁచి నాకడకు వచ్చుటెన్నఁడురా. ॥కొన॥ 133

శ్రీరాగం

దైవకృత మెవ్వరికిఁ దప్పింపరాదనుచు
భావించి జనులాడుపలుకు నిజమాయ ॥పల్లవి॥

కందునకుఁ బెడఁబాసి చందురుఁడింతి ముఖ
చందురుఁడైన నది అందును గలిగె

కందువగు చెలినొసలి కస్తూరితిలకమను
కందు ముఖచంద్రుననుఁ గడునందమాయ ॥దైవ॥

జలజములు శశిచేతనులికి యీ కాంతకుచ
జలజంబులైన నది సరుసనే కలిగె
లలితమగు ప్రాణవల్లభుని సురతాంకమున
విలువ సేయఁగరాని విదియచందురులు ॥దైవ॥

తీగె బహుజలములకుఁ దెమలి కామినిమేనుఁ
దీగె యయ్యిన నదియుఁ దిరుగ మరి కలిగె
ఈగతులఁ దిరువేంకటేశ్వరుని సమసురత
యోగంబువలన ఘర్మోదకశ్రీలు. ॥దైవ॥ 134

ముఖారి

జానామ్యహంతే సరసలీలాం
నానావిధ కపటనాటక సఖత్వామ్ ॥పల్లవి॥

కిం కరోమి త్వాం కితవ పరకాంతాన
ఖాంకురప్రకటన మతీవ కురుషే
శంకాం విసృజ్య మమ సంవ్యాన కర్షణం
కింకారణమిదం తే ఖేలన మిదానీం ॥జానా॥

కిం భాషయసి మాం కృతకమానసతయా
డాంభికతయా విట విడంబయసి కిం
గాంభీర్యమావహసి కాతరత్వేన తవ
సంభోగ చాతుర్య సాదరతయా కిం ॥జానా॥

కిమితి మామనునయసి కృపణ వేంకటశైల
రమణ భవదభిమతసురతమనుభవ
ప్రమదేన మత్ప్రియం ప్రచురయసి మానహర
మమతయా మదననిర్మాతా నకిం త్వం. ॥జానా॥ 135

ఆహిరి

వట్టిసటలు గాక నాకు వలతు ననెడి మాటలెల్ల
  నెట్టుకొన్న మోహమైన నిలువనెట్టు వచ్చురా ॥పల్లవి॥

కొప్పువెట్టుకొనుచునున్న కొమ్మ బాహుమూలమిపుడు
  చొప్పుదప్ప రెప్పలెత్తి చూడనెట్టు వచ్చురా
  అప్పుడుపరిసురతవేళలందుఁ బచ్చి దోఁచునట్టి
  చెప్పరాని పనులవంకఁ జిత్తగించినాఁడవో ॥వట్టి॥

మొలకనవ్వు నవ్వుచున్న ముదితముద్దుమోవిమీఁది
  చిలుకవోటు చూచి సన్నసేయనెట్లు వచ్చురా
  వలను మెరసి నీకునందు వన్నెలైన చేఁతలెల్లఁ
  గలయఁ జేయుపనికిఁ గొంత కన్నువేసినాఁడవో ॥వట్టి॥

తట్టుపుణుఁగు శిరసుమీఁద దైలువారనంటి నొసలఁ
  బట్టువెట్టుకోరి నన్నుఁ బట్టనెట్టు వచ్చురా
  వెట్టిగాదు వేంకటాద్రివిభుఁడ నీవు మదనరచన
  లట్టు నిట్టుసేయ నన్ననంగవించినాఁడవో. ॥వట్టి॥ 136

మాళవి

ఏమి సేయఁగనగు నెట్టువలసిననౌ
  కాముకుల పూర్వసంకల్పమో కాక ॥పల్లవి॥

కమలలోచనహృదయకమలంబె మఱచేతి
  కమలమై తనమనసు గాఁడి పారినది
  గములైన యాపదలు గదిరినప్పుడు దమ్మ
  తమచేతియమ్ములే తాఁకునో కాక ॥ఏమి॥

లోలలోచన మేనిలోనియనలము లోని
  గాలి గూడ (డు ?) క చిచ్చుగాలివలెనాయ

తాలిమెడతెగి రతులు దప్పినప్పుడు లోని
తాలిమే తమకములతాపలో కాక ॥ఏమి॥

శ్రీ వేంకటేశ్వరుఁడు చెలియఁ గరుణించినను
కైవశంబయి యవియ కడునితవులాయ
దైవకృప గలిగినను తమకు నాపదలెల్ల
భావింప నిత్యవైభవములో కాక. ॥ఏమి॥ 137

25-వ రేకు. సామంతం

పొద్దిఁకనెన్నఁడు వొడచునొ పోయినచెలి రాదాయను
నిద్దుర గంటికిఁ దోఁపదు నిమిషంబొకయేఁడు ॥పల్లవి॥

కన్నుల నవ్వేడి నవ్వులు గబ్బితనంబుల మాటలు
నున్నని యొయ్యారంబులు నొచ్చినచూపులును
విన్నఁదనంబుల మఱపులు వేడుకమీరిన యలపులు
సన్నపుఁజెమటలఁ దలఁచిన ఝల్లనె నామనను ॥పొద్దిఁక॥

ఆఁగినరెప్పల నీరును నగ్గలమగు పన్నీటను
దోఁగియుఁ దోఁగనిభావము దోఁచిన పయ్యెదయు
కాఁగిన దేహపు నెకలును కప్పిన పువ్వుల సొరబులు (?)
వేఁగిన చెలితాపమునకు వెన్నెల మండెడిని ॥పొద్దిఁక॥

దేవశిఖామణి తిరుమలచేపునిఁ దలఁచినఁ బాయక
భావించిన యీ కామిని భావములోపలను
ఆ విభుఁడే తానుండిఁక నాతఁడె తానెఱఁగఁగవలె
నీ వెలఁదికిఁ గల విరహంబేమని చెప్పుదము. ॥పొద్దిఁక॥ 138

మలహరి

ఎంపరి దూరుచమిందరుఁ గూడుక
సందడివలపులఁ జంపేరే ॥పల్లవి॥

కంటఁ బుట్టినవాఁడు కమలముఖులకడ
 కంటఁ బుట్టినవాఁడు గవగూడి
 జంట వాసినఁ జంపుదుమని లేని
 వెంటలు గడియించి వేఁచేరే ॥ఎంద॥

ఏఁటఁ బుట్టెడివాఁడు నేడు దెరువులై
 వూఁటాడెడివాఁడు నొనగూడి
 మాఁటమాఁటకు మాయపు మనసులు
 తీఁటలు రేఁచుక తిరిగేరే ॥ఎంద॥

కొండలరాయఁడు కోనేటి తిమ్మయ్య
 వుండినచోట నేసుండఁగా
 పండిన మోహము బాధలఁ జిత్తము
 మెండైన వేడుక మెచ్చినే. ॥ఎంద॥ 139

నాట

చిత్తము నిజమైనఁ జేరు నేపనులైన
 బత్తి సౌఖ్యమునకుఁ బ్రాణము ॥పల్లవి॥

కన్నుల కలికెక్కెఁ గలిగెఁడో కడ
 కన్నులమీఁది బింకపు నవ్వు
 చిన్నిచెక్కులమీఁది చెమటలు - మేన
 సన్నపు మురిపెపుటలపులు ॥చిత్త॥

తోయజగంధికి దొరకెఁబో మన
 మాయ నియతితోడి మఱపులు
 సోయగమగు మోము సొబగులు - కడు
 రాయిడి చనుదోయి రచనలు ॥చిత్త॥

లావణ్యమతి (వతి ?) మీఁది లాసెఁడో
 శ్రీ వేంకటేశుని చెలువులు

తావి చల్లెడి కమ్మఁదనములు - పాసి
పోవని విభుతోడి పొందులు. ॥చిత్త॥ 140

కాంబోది

ఒయ్యనె దగ్గరరమ్మ వూడిగాల సతులు
అయ్యో విసరరమ్మ అలసున్నవాఁడు ॥పల్లవి॥

కరఁగెఁజెమటలతో గంధపుఁ బేంట్లతోడ
ఒరగి పవ్వళించున్నాఁడొత్తగిల్లి
సరసపు మాటలతో చాఁచిన పాదములతో
గురియైన సతులతో గోవిందరాజు ॥ఒయ్య॥

తెల్లసి కన్నులతోడ తేనెగారు మోవితోడ
చెల్లుబడిఁ బవ్వళించి శేషునిమీఁద
వెల్లిగొను పూర్పులతో వెన్నెల నవ్వులతోడ
కొల్లవలపులతోడ గోవిందరాజు ॥ఒయ్య॥

బొడ్డు పూఁపకొడుకుతో పుక్కిటి తమ్మలముతో
నొడ్డిన రతులతోడ నోలలాడీని
వెడ్డు వెట్టి కూడెనిదె వేంకటేశుఁడింతులను
గొడ్డువోని వరముల గోవిందరాజు. ॥ఒయ్య॥ 141

ఆహిరి

కామించి నీవరుగఁ గలయు నాయకుఁడు నేఁ
డేమి భాగ్యము నేసెనే తరుణి ॥పల్లవి॥

కాఁగిన గుబ్బలమీఁద కమ్మఁజెమటలఁ దొప్పఁ
దోఁగిన పయ్యెదకొంగు దూలఁగను
వేఁగైన కొప్పున క్రొవ్విరులు దురిమి విజ్జి
వీఁగుచు నీవెటు వొయ్యేవే తరుణి ॥కామిం॥

ఒప్పైన శిరసుమీఁదఁ గుప్పళించిన జవ్వాది
చిప్పిలి చెక్కులవెంటఁ జిందఁగను
అప్పళించిన కస్తూరిలప్పలు రాలఁగ నీ
విప్పుడెక్కడికి నేగేవే వోతరుణి ॥కామిం॥

వీడినది మొలనూలు విరులు చెదరెఁ గొంత
వాడినది కెమ్మోవి వన్నెలై
యీడులేని తిరువేంకటేశుఁడిదె నిన్నుఁగూడె
యీడఁ గొత్తలివి యేఁటివే వోతరుణి. ॥కామిం॥ 142

శుద్ధరామక్రియ

ఇన్ని రాసులయునికి యింతి చెలువపురాశి
కన్నె నీరాశికూటమి గలిగినరాశి ॥పల్లవి॥

కలికి బొమవిండ్లుగల కాంతకును ధనురాశి
మెలయు మీనాక్షికిని మీనరాశి
కులుకు కుచకుంభముల కొమ్మకును కుంభరాశి
చెలఁగు హరిమధ్యకును సింహరాశి ॥ఇన్ని॥

చిన్నిమకరాంకపుఁ బయ్యెద చేడెకు మకరరాశి
కన్నెపాయపు సతికి కన్నెరాశి
వన్నెమై పైఁడితులఁదూఁగు వనితకుఁ దులారాశి
తిన్ననివాఁడి గోళ్ళసతికి వృశ్చికరాశి ॥ఇన్ని॥

ఆముకొను నొరపుల మెరయు నతివకు వృషభరాశి
గామిడి గుట్టుమాఁటల సతి కర్కాటకరాశి
కోమలపు చిగురుమోవి కోమలికి మేషరాశి
ప్రేమ వేంకటపతిఁ గలసె ప్రియమిథునరాశి ॥ఇన్ని॥ 143

26-వ రేకు. సామంతం

ఎట్టు ధరింపఁగనగు భువినిట్టి వియోగావస్థల
నట్టును నిట్టును విధి దమునారడిఁ బెట్టఁగను ॥పల్లవి॥

కాంతునిచూపులఁ జిక్కినకాంత వియోగాగ్నికిఁ దగ
శాంతికిఁ జెంగలువలుపైఁ జల్లిరి నెచ్చెలులు
కాంతుఁడు చూచినతొల్లిటి కనుచూపులె బహుళములై
కాంతశరీరంబంతయుఁ గప్పిన తెఱఁగాయ ॥ఎట్టు॥

రమణునిమాటలఁ దగిలిన రమణికి సంగజతాపం
బమరఁగ మకరందముపై సలికిరి నెచ్చెలులు
రమణుని తియ్యని మాటలరచనలె కడునగ్గలమై
కమలదళాక్షికిఁ బైపైఁ గట్టినతెఱఁగాయ ॥ఎట్టు॥

ప్రాణము సందియమై యీ పడతికిఁ బ్రాణము వచ్చెను
ప్రాణేశుఁడు తిరువేంకటపతి గరుణించినను
ఏణాక్షికి నొకతెకుఁ గాఁదీయఖిలంబున కీ దేవుఁడు
(దీయఖిలమునకు దేవుఁడు ?)
ప్రాణము ప్రాణంబనియెడి పలుకిది నిజమాయ. ॥ఎట్టు॥ 144

కాంభోది

ఇంతగాఁ జేసితి[1] నన్ను నింతలోననె వోరి
సంతవలపుబేరాల జట్టికాఁడ రారా ॥పల్లవి॥

గంపంత దురుముతోడి గబ్బిచూపుఁగన్నుల[2]
గుంపెన గుబ్బలది షోకులు సేయఁగా
అంపలేక మాటలాడే వాపె[3] తోడనె వోరి
జంపు వలపుబేరాల జట్టికాఁడ రారా ॥ఇంత॥

1. ని. రే. ౧౧౪. ఇంతసేసితి. 2. మరపుఁగన్నుల. 3. వాకెతో.

సుద్దలింపుఁగులుకుల కొనవంపుచూపుల[1]
అద్దపుఁ జెక్కులది నిన్నుద్దలించఁగా
పెద్దరికా[2] లాకెతోడ బెరయించేవా వోరి
చద్దివలపుబేరాల జట్టికాఁడ రారా ॥ఇంత॥

మెల్లనె మురిపెములమ్మెడి లేఁతమాటల
గొల్లెతచిత్తమంతయుఁ[3] గొల్లగొంటివి
వెల్లిగా నన్నుఁ గూడితి[4] వేంకటేశుఁడా వోరి
చల్లువలపుబేరాల జట్టికాఁడ రారా. ॥ఇంత॥ 145

## సామంతం

సింగారరాయనిఁ దిట్టేఁ జెంచెత వేలి
వుంగరాలచేత నన్నొత్తకు నీవనుచు ॥పల్లవి॥

గురువింద పొదమరఁగున నుండి బిగిసేని
సిరివరు నెదుటనే చెంచెత
దొరలకే కాక నెత్తురుమన్ను మాకేల
బురదచెమటనామై పొలసుకంపనుచు ॥సింగా॥

సుదిగొన్న మొగలిరేకుల యెన్ను కొనగోరఁ
జిదిమి దేవునివేసీఁ జెంచెత
గదసుఁ బిల్లుల నేతికంపు నీ వాళ్ళెల్ల
కదియకు నామేను కంటగించీననుచు ॥సింగా॥

కప్పురపుఁ దావి వేంకటపతికౌఁగిటఁ
జెప్పక యేతులే చెప్పీఁ జెంచెత
ఇప్పిదేరు తేనెల తనివార నీ మోవి
యెప్పుడుఁ బాయక ఇట్టె ఇచ్చేవో యనుచు. ॥సింగా॥ 146

1. మాఁటల. 2. సా. రే. పెద్దరికలాకె; తం. ప్ర. గద్దరి కలికితోడ కడు బేరయిం. 3. తం. ప్ర. పల్లవపాణిచిత్తము. 4. వెల్లిగా నన్నేలు తిరు.

ఆహిరి

అయ్యో వీఁడు నన్నుఁ జెనకించీనే వీని
కొయ్యతనాలెంచక కోపమేల తీరునే ||పల్లవి||

గుట్టున వాఁడిందు రాఁగ గొబ్బున నే ముంగురులు
పట్టుకొని పరపుపైఁ బడఁదీసి[1]
గట్టిగ గుబ్బలమీఁది కస్తూరిచెమటలనే
అట్టునిట్టు సేయక నాయలపేల తీరునే ||అయ్యో||

గక్కన వాఁడిందు రాఁగా గడెవెట్టి[2] తమకాన
చెక్కుదోయి నాకొనచేతనే నొక్కి
పుక్కిటితమ్ములమిడి పొదిగొన్న కాఁగిటిలో
నొక్కినఁగాని నానొగులేల తీరునే ||అయ్యో||

కూరిమి వాఁడిందు రాఁగా కొంకక నా వాఁడిగోళ్ళ
జీరలుగా నొడలెల్ల[3] జిమ్ముచుఁ దీసి[4]
ధీరత వేంకటగిరి దేవుఁడైన వానికి నా
నేరుపెల్లఁ జూపక నా నెగులేల తీరునే. ||అయ్యో|| 147

శ్రీరాగం

వద్దు వోరా నీవు గడు వచ్చి తడవాఁడునేరు[5]
నిద్దురవుచ్చేవు నేము నీ కొలఁదివారమా ||పల్లవి||

గయ్యాళి యెవ్వతో కాని కస్తురివాట్లు చూడ
నొయ్యారముగా వేసె నుదుటైవ గుబ్బల
కయ్యపుఁ గూటముల నీ కౌఁగిలెల్లానంటె నీవు
పుయ్యక పూసిన కమ్మఁబూఁత వింతలాయరా ||వద్దు||

1. తం. ప్ర. పడఁగ విగిచి; వి. రే. ౧౨. పడవేసి. (ఈ రేకులో ఇది రెండవ చరణము.) 2. వి. రే. ౧౨. గద్దెమెట్టి. 3. మరమెల్లి. 4. తం. ప్ర. చిమ్ముచును జేరి. 5. వి. రే. ౪౦. వాయె యేరు.

గొంచెత యెవ్వతోకాని కొదలేవి తమకె తా
సంటఁగాక నిన్నుఁగూడె నదిరి[1] పాటునసు
వెంటనే తెచ్చితివోరి వెడగెంపునీరు కోక
సంటినది నీవు నమ్మ వంటక తొలఁగరా ॥వద్దు॥

కొండలలో నెలకొన్న కోనేటిరాయఁడ యెందు
వుండిన[2] నామనసులోనుండి పాయలేవురా
నిండిన కౌఁగిటఁజేర్చ నీవు దాన్నె కూడి
యుండినట్లనే పాయకుండె నెవ్వతెరా. ॥వద్దు॥ 148

27-వ రేకు. రామక్రియ

కొంచెము[3] మాకులము గుణము చంచలము
చెంచెతతో నీకు నేల చెప్పవయ్య చలము ॥పల్లవి॥

గదరుఁ గస్తూరిమన్ను కమ్మవి మై[4] పూఁత
చెదరిన[5] పట్టునార చీరపాఁత
పదిలమైన పండు ఫలము మామేఁత
ఇదివో నే[6] మెవ్వరికి నేలయ్య రోఁత ॥కొంచె॥

గుబ్బలపై వెడజారు గురుగింజ[7] పేరు
సిబ్బపుఁ జెక్కుల నవ్వు చిక్కఁజేరు
మబ్బు మబ్బు నెరుల దిమ్మరి కొప్పుతీరు
గబ్బిచూపు కన్నుల[8] మాకడనేల నోరు ॥కొంచె॥

అడవి లేఁతచిగురదివో[9] మాపరపు
వెడ వెడ నగవే మావింత వొరపు
యెడయక తిరువేంకటేశ మాపై వెరపు
గొడవకూటమి నిన్నుఁ[10] గూడిన మైమరపు ॥కొంచె॥ 149

---

1. నద్దరి. 2. సా. రే. వుండినామన. 3. ని. రే. గంళ. కొంచెపుమా. 4. మే పూఁ(. 5. సా. రే. చెదరినా. 6. ని. రే. మేమె. 7. గురివింద. 8. కొనలమా. 9. చిగురు లవివో. 10. నన్నుఁగూ.

వరాళి - ఏకతాళి

తక్కులచేతలఁ మాయదారివట బొంకు
  నిక్కములు సేయనేమి నేరవా యీ నీవు ॥పల్లవి॥

పెట్టున నూఁదిన పిల్లఁగోవి నీరవమున
  వట్టిమాఁకుల నిగురు వెట్టీనట
  పట్టినఁ గందెడి నామై పై పులకలిగురు
  వెట్టఁగా నన్నింత సేయ బెట్ట (ట్టా ?) యీ నీకు ॥తక్కు॥

పాదముచెమటనీరు పరపి దురితముల
  నేదదేర నిందరిని జేసీనట
  మేదినీధరుఁడ నీ మేని చెమటలతావి
  నాదరించి నసుఁగాచుటరుదా యీ నీకు ॥తక్కు॥

అల నీమదిఁబుట్టిన అంగజుఁడు లోకులను
  చెలరేఁగి కాఁపురాలు సేయించీనట
  కలసి వేంకటేశ్వర కందువరతుల నన్ను
  కలకాలమునేలుట ఘనమా యీ నీకు. ॥తక్కు॥ 150

సౌరాష్ట్రగుజ్జరి

కన్నులనే నవ్వితే నే గబ్బిదాననా నీవు
  నన్ను నేల యిట్లా సన్నలనే తిట్టేవు ॥పల్లవి॥

గొల్లచల్లంటానే యక్కునఁ బోయుమనేవు
  చెల్లఁబో గొల్లవారింత చేడఁబోయిరా
  గొల్లువేసి యలకల కొప్పున నే ముడిచిన
  పల్లెపూవులేల నీకు మనసాయ నిపుడు ॥కన్ను॥

కొంత కోక నల్ల[1] నైతే గొరపడము సవేవు (?)
  అంత నేను సదరమనైతినా నీకు

1. ని. రే. ౪౪. కొంత నల్లనైతే.

పంతగాఁడవట్టియాకంబళి నీవు ధరియించి
అంత నింతనుండి యాల ఆవులఁగాచితివి ॥కన్ను॥

మాఁటలాడ నేరకుండే మాయదారిననేవు
వేఁటలోన ననునింత వేఁచుకుంటివా
యేఁటికెంత తిరువేంకటేశ నన్నుఁ గరఁగించి
పూఁట పూఁటకింతేసి బూమెలు నేసేవు. ॥కన్ను॥ 151

శ్రీరాగం

అతఁడు చొచ్చినవేళ నలయు యడవి
సతి నీదుమురిపెంపు జవ్వనపుటడవి ॥పల్లవి॥

గురుకుచముగిరుల నెక్కువయైన యడవి
తరుణంపు బాహులతల యడవి
పురిగొన్న వాలుఁజూపుల తేటు (లేటి?) యడవి
గరిమతోఁ దనుతావి కప్పురపుటడవి ॥అత॥

గనియైన నెరులచీఁకటి పెనుయడవి
ఘనమైన జఘనకందకములడవి
సునుపు నడపుల యోనుక పెద్దయడవి
చెనకు నట్టనడిమి సింహపుటడవి ॥అత॥

అతివ నీ పూరుల యరంట్లయడవి
కత కళపుల చిలుకల యడవి
ప్రతిలేని వేంకటపతి యాఁక యడవి
తతి నీకుఁగానతఁడు తపమున్న యడవి. ॥అత॥ 152

శంకరాభరణం

తలపట్టు వెట్టుకొన్న[1] తరుణీమణి నిన్ను
నలసి వేమరుదూయ నాకెవో యాకె ॥పల్లవి॥

1. ని. రే. ఒళ. వెట్టుకున్న.

గొప్పలయిన గుబ్బలవేఁగుల నలయు సతులు
కొప్పులు జారఁగఁ దన్నుఁ గొలిచి రాఁగా
చెప్పరాని నటనల సింగారపుఁ దోఁటలోన
అప్పుడు నిన్నుఁ జూచిన ఆకెవో యీకె ||తల||

పాదపుఁబెండేలు మ్రోయఁ బడఁతులిరువంకల
సేదలు దేరుచుఁ దనచెంగట రాఁగా
మేదకపు తొలుకరి మెఱుఁగంటా నీ వప్పు[1]
డాదిగొని చూచిన ఆకెవో యీకె. ||తల|| 153

బంగారు చెరఁగుచీర పయ్యెదకొంగు దూలఁగా
అంగన వొకతె దనకాకు చుట్టీఁగా
ఇంగితమెఱిఁగి వేంకటేశుఁడ నిన్నుఁ గలసి
అంగడినెల్లఁ బెట్టిన ఆకెవో యీకె ||తల||

ఆహిరి

దిక్కులేక పోయెనిట్టె దినదినము
వెక్కసపు లోకమేలే విభుఁడెవ్వఁడో ||పల్లవి||

గుత్తముగా నెల్లవారుఁ గుడిచేటి కంచము
ఎత్తుక లోఁబెట్టుకొనె నెవ్వఁడో దొంగ
కొత్తగానే యింతి గట్టేకోక బయట వేసిన
మెత్తనిదంటాఁ బట్టి మింగె నెవ్వఁడో ||దిక్కు||

బంతిగాఁగ నెల్లవారుఁ బండేటి మంచమూర
గుంతలో విరుగఁదోసె కూళఁడెవ్వఁడో
దొంతుల కడవలోనఁ దొరలి దాఁచిన పెద్ద
పొంతకూటికుండ గొంటఁబోయె నెవ్వఁడో ||దిక్కు||

1. పా. రే. గంటానిప్పుడా.

సారిది సంతలలోఁ సుద్దులెల్లా విని విని
విరసములెల్లఁ బాపె వీఁడెవ్వఁడో
తిరువేంకటగిరిదేవుఁడై యిందరికిఁ
గరుణ లోకముగాచె ఘనుఁడెవ్వఁడో. ॥దిక్కు॥ 154

28-వ రేకు. ముఖారి

చిన్ననాఁడు ముద్దులు చంచినవాఁడు తా
నున్నవాఁడే యిపుడు నాయొడయఁడై నేఁడు ॥పల్లవి॥

గోవులఁ గాచినవాఁడు గొల్లెతల మేనిగబ్బుఁ
దావుల పెనుభ్రమలఁ దగులువాఁడు
కోవిదుఁడెట్లనాయఁ గోమలులఁ బదియారు
వేవురను వలపించే వెరవరెట్టాయెనే ॥చిన్న॥

వెన్నలారగించువాఁడు విడువక వెకలియై
కన్నచోనే తిరిగేటి గద్దరీఁడు
వన్నెకాఁడెట్లానాయ వడి గోపవనితల
నెన్నరాని చేఁతలెల్ల నెట్టు నేసినాఁడే ॥చిన్న॥

కొండలెక్కి దాఁటువాఁడు కొండమోచునట్టివాఁడు
కొండలే నెలవుగాఁ గైకొన్నవాఁడు
కొండుక పాయపువాఁడు గుబురైన తిరుమల
కొండమీఁద నెలకొన్న కోనేటివాఁడు. ॥చిన్న॥ 155

ముఖారి

కలికి కోరికల నుంగరము వెట్టినవాఁడె
చెలువంపు విరహాగ్ని నేసెఁగా పెండ్లి ॥పల్లవి॥

గరిమెఁ[1] గేయూరకంకణహస్తముల సతులు
మురియుచును నిన్నుఁ గరములఁ జూపఁగా

1. వి. రే. ఉ. గరిమ.

తరుణి నినుఁ జూచినంతటనె మదనుఁడిద్దరికి
సరవిరుల సేసలివె [1] నాయెఁగా పెండ్లి ॥కలికి॥

పొదరిండ్ల చవికెలో పువ్వుఁదేనెల చెమట
చెదరకిరువంక నభిషేకములుగా
కొదపు తేంట్ల (తేఁటుల ?) విప్రకోటి మిమ్మిద్దరిని
పొదలించఁ జిత్తములు పొసఁగెఁగా పెండ్లి ॥కలికి॥

సోలుచును పేరఁటపు శుకపికంబులు మిమ్ముఁ
జాలుపడి నలుగడలఁ బాడఁగాను
తేలించి లలితాంగి తిరువేంకటేశ నినుఁ
గాలు దొక్కినదిపుడె కలిగెఁగా పెండ్లి. ॥కలికి॥ 156

కన్నడగౌళ

వంచన ప్రియములవారే కాక
నించిన కన్నీటి [2] నేసేల నీకు ॥పల్లవి॥

గిలుకు మట్టెలతోడ కిందిచూపులతోడ
నెలవి నవ్వులు నీపైఁ జిందఁగాను
వలతువుగాక యెవ్వతి [3] కైనఁ జిత్తము
నిలుపఁగనోపని నేసేల నీకు (ను) ॥వంచన॥

గోడచాట్లతోడ కొనచీఁకటితోడ
వాడల నెలయించువారేకాక
వాడుచు లేమావి వడచల్ల వెడమాయు
నీడలనెండే నేసేల నీకు ॥వంచన॥

జగడంబులతోడ సణగు సొలపుతోడ
వగ నిన్ను భ్రమయించువారె కాక

1. సా. రే. నేసలివియా. 2. సా. రే. కన్నియయిది నేసేల. 3. సా. రే. ఎవ్వరి.

దిగులులేక నిన్ను తిరువేంకటేశుఁడ
నెగులెఱుఁగక కూడు నేనేల నీకు. ॥వంచన॥ 157

ఆహిరి

వేడుక నెవ్వతెరా విడువక నిన్నంటి
వాడుదేరే వలపుల వన్నెలు వెట్టినది ॥పల్లవి॥

గద్దరి యెవ్వతెరా నీ గారవంపు చెక్కున
నిద్దంపు చంద్రరేఖ నిలిపినది
అద్దిరా దానిగయ్యాళితనమెట్టిదో
ముద్దుఁదనమోము నీ మోమున రాచినది ॥వేడు॥

దిట్టైన యది యెవ్వతెర నీ యధరమందు
కొట్టఁగొన మరుచిలుకులొత్తినది
గట్టిగఁ జూడర దానిగబ్బితనమెట్టిదో తన
గుట్టెల్ల నీకు నాకున వ్రాసెంపినది ॥వేడు॥

చక్కనిదెవ్వతెర నీ సరిలేని మేనఁ దన
మిక్కుటంపు మేనిత్రావి మేళవించినది
అక్కరగాఁ దిరువేంకటాధీశ కూడితివి
మక్కువతో నీకు పరిమళములంపినది. ॥వేడు॥ 158

పాడి

అలమేలుమంగ నీవభినవరూపము
జలజాక్షుకన్నులకు చవులిచ్చేవమ్మా ॥పల్లవి॥

గరుడాచలాధీశు ఘన వక్షమున నుండి
పరమానందసంభరితవై
నెరతనములు చూపి నిరంతరము నాథుని
హరుషించఁగఁ జేసితి గదమ్మా [1] ॥అల॥

---

1. ఈ పాదమున యతిభంగము. 'జేసితౌఁగదమ్మా' అని యుండఁ బోలును.

[illegible]కిరణములకు చలువల చూపుల
విశదముగా మీఁద వెదచల్లుచు
రసికత పెంపునఁ గరఁగించి యెప్పుడు నీ
వశము చేసుకొంటి వల్లభునోయమ్మా ॥అల॥

రట్టడి శ్రీ వేంకటరాయనికి నీవు
పట్టపురాణివై పరఁగుచు
వట్టిమాఁకులిగిరించు వలపుమాటల విభు
జట్టిగొని పురమున సతమైతివమ్మా. ॥అల॥ 159

## దేశాక్షి

ఒడయఁడవు నిసుఁబాసి యుండవశమా తరుణి
చిడుముడియలుక చేతిచిలుకఁ బగచేసె ॥పల్లవి॥

గారవపు జలరాశికన్య నీతోనలిగి
ఆరామములలోన నలయఁగాను
వైరంపుబాణమై వనజమిరుమై గాఁడె
ఈరీతి నీ యలుక యుల్లు పగఁజేసె ॥ఒడ॥

ఎలజవ్వనిటు నీకు నెదురుచూచుచు వెడలి
చెలఁగి వెన్నెలకు విచ్చేయఁగాను
నలుపొందఁ జంద్రకిరణములు మయివడిఁ బొక్కె
బలుపుఁ గోపము తోడఁబుట్టుఁ బగచేసె ॥ఒడ॥

పంతంపు శ్రీసతికిఁ బతివి వేంకటరమణ
కాంతహృదయంబెఱిఁగి కలయఁగాను
అంతలోననె మదసుఁడలయించె నిప్పుడిటు
కొంతవడి నీకసరు కొడుకుఁ బగచేసె. ॥ఒడ॥ 160

29-వ రేకు.

## సామంతం

ఎన్నిసేఁతలైనఁ జేయునిపుడు యీతఁడు
కన్నెవయసువారినెల్లఁ గాఁకదేర్చె నీతఁడు ॥పల్లవి॥

గుబ్బచన్నుదోయి మెఱుఁగుఁ గులుకరించి చెలఁగి నదచు
గబ్బుతావిరమణి చల్లకడవతోడను
సిబ్బమైన చెక్కులందు చిన్నిచెమటగారఁ జెనకి
గబ్బిసేఁతలెల్లఁ జేసె కళలుగరఁగ నీతఁడు ॥ఎన్ని॥

వాలుగన్నుదోయి మెఱుఁగు వల్లెవేసివేసి రతికి
కాలుదవ్వురమణి చల్లకడవతోడను
కేలుదమ్మి కంకణాలు గిలుకరించి చెలఁగి వడచు (వ ?)
కీలుగొప్పు సడిలి జారఁ గిందుపరిచె నీతఁడు ॥ఎన్ని॥

కొదలుదేరు కోవిలెలుఁగు కుత్తికందు సొళగించి
కదలుమోవిరమణి చల్లకడవతోడను
ఎదురమెరయు వేంకటేశుఁడింతి ప్రేమదీరఁ జెనకి
కదిసి మదనకదనమందు కలికిఁజేసె నీతఁడు. ॥ఎన్ని॥ 161

పాడి

ఏతేయేతే మరఁదలా చాయఁజాయ చాయను
చాయ నీతోడి సరసంబు బావ ॥పల్లవి॥

గాఁటపు సిబ్బెలు గదలఁగఁ గులికేవు
మాటలఁ దేటల మరఁదలా
చీటికి మాటికిఁ జెనకేవే వట్టి
బూటకాలు మాని పోవే బావ ॥ఏతే॥

అందించె నన్ను నదలించి వేసేవు
మందమేలపు మరఁదలా
సందుకోఁ దిరిగేవు సటకారి వోబావ
పొందు గాదిఁకఁ బోవే బావ ॥ఏతే॥

చొక్కపు గిలిగింత చూపుల నన్ను
మక్కువ సేసిన మరఁదలా

గక్కన నను వెంకటపతి కూడితి
వక్కాణించుకొంటివి తగులైతి బావ ॥ఏలే॥ 162

ఆహిరి

కామిని నీ సౌభాగ్యము గలిగిన ఫలమిది గలిగెను
ఆమని వెన్నెలకేఁటికి సలయుచు వచ్చెదవే ॥పల్లవి॥

గుబ్బల చెమటల పయ్యెద కొనగొంగున నల్లార్చుచు
ఉబ్బున గమనావస్థల నూఁటాడెదవేలే
బబ్బిలికాయల రవములు పదనూపురములఁ గెలయఁగ
తబ్బిబ్బుగ నునుపాదము తాటించెదవేలే ॥కామి॥

ఎత్తిన కరమూలపురుచులిరుగడ మెఱుఁగులు దొలఁకఁగ
తత్తరమందుచు నెవ్వనిఁ దలఁపుచు మ్రొక్కెదవు
ముత్తెపుసరముల వేఁగున మురియుచు నెచ్చరిపై నీ
వొత్తిలి నిట్టూర్పులతో నొయ్యన పలికెదవే ॥కామి॥

తావులు చల్లెటి దేహము తలఁపులుమీరిన హరుషము
లోవెలుతుల వెడయాసలు లోపలి కోరికలు
శ్రీ వేంకటగిరినాథుని చెలువపు కౌఁగిటి వుయ్యాల
భావజసౌఖ్యాంబుధిలో పలుమరుఁ జెలఁగెదవే. ॥కామి॥ 163

కాంబోధి

చెలికిఁ జక్కఁదనము సేసిన యజుఁడు భూమిఁ
గలవారికెల్లఁ బ్రేమ గలిగించెఁ గదవే ॥పల్లవి॥

గుబ్బలపై కొనగోరిగురుతులంటినచోటు
లబ్బురమై మృగమదమంటినది చూడవే
గబ్బికన్నుల కలికి కప్పిన పయ్యెదలోన
నిబ్బరపుఁదనువల్లి నిగ్గులు వెళ్ళఁబారెనే ॥చెలికి॥

కొప్పునఁ దట్టుపుణుఁగు కొలఁదిమీరఁగ నంటినఁ
జిప్పిలి చెక్కులవెంటఁ జిందినది చూడవే
ఒప్పయిన నీ నడపున నొడికపుమట్టియల
చప్పుడు విన్నఁ జిత్తము జల్లురనెఁ గదవే ॥చెలికి॥

చక్కఁదనములచేత సరిలేనివాఁడు గన
దిక్కుల వెలసినట్టి తిరువెంకటేశుఁడు
మక్కువలరఁగ నింతి మరగించి ప్రియమెల్లఁ
జక్కఁదనముగఁ జేసెఁ జాలదా యింతయును. ॥చెలికి॥ 164

రీతిగౌళ

రాధామాధవరతిచరితమితి [1]
బోధావహం శ్రుతిభూషణం ॥పల్లవి॥

గహనే ద్వావపి గత్వా గత్వా
రహసి రతిం ప్రేరయతి సతి
విహరతస్తదా విలసంతౌ
విహతగృహాశౌ [2] వివశౌ తౌ ॥రాధా॥

లజ్జాశబళ విలాసలీలయా
కజ్జలనయన వికారేణ
హృజ్జావ్యవహృత (హిత ?) హృదయా [3] రతి
స్సజ్జా సంభ్రమచపలా జాతా [4] ॥రాధా॥

పురతో యాంతం పురుషం [5] వకుళైః
కురంటకైర్వా కుటజైర్వా
పరమం ప్రహరతి పశ్చాల్లగ్నా
గిరం వినాపి వికిరతి ముదం ॥రాధా॥

---

1. ని. రే. ౧౦౬. చరితం - బోధా. 2. సా. రే ; పె. రే. విహితగృహవశౌ.
3. హృదయరతి. 4. జాత. 5. పురుషైర్వకు.

[1] హరి సురభూరుహ మర్హాతివస్తు (మారోహతీవ ?)
చరణేన కటిం సంవేష్ట్య
పరిరంభణ సంపాదితపులకై
స్సురుచిర్జాతా సుమలతికేవ ॥రాధా॥

విధుముఖదర్శన విగళితలజ్జా
త్వధరబింబఫలమాస్వాద్య
మధురోపాయనమార్గేణ కుచా
నిధివద (ద్ద ?) త్వా నిత్యసుఖమితా ॥రాధా॥

సురుచిరకేతక సుమదళ నఖరై
ర్వరచిబుకం సా పరివృత్య (వర్త్య ?)
తరుణిమసింధౌ తదీయదృగ్జల
చరయుగళం సంసక్తం చకార ॥రాధా॥

వచన విలాసై ర్వశీకృత (త్య ?) తం
నిచులకుంజ మానితదేశే
ప్రచురసైకతే పల్లవశయనే
రచితరతికళా రాగేణాస ॥రాధా॥

అభినవకల్యాణాంచితరూపా
వభినివేశ సంయుతచిత్తా
బభూవతు స్తత్పరౌ వేంకట
విభునా (నా ?) సా తద్విధినా పతయా ॥రాధా॥

[2] పచ లజ్జావీక్షణో భవతి తం
కచభరం (ర ?) గంధం ప్రాపయతి

1. ఇది మొదలు ౫ చరణములు సా. రే. పె. రే.ల లో మాత్రము కలవు. ని. రే. లో వేఱు ౫ చరణములున్నవి. అవి యీ పదము కడపట చేర్పఁబడినవి. 2. ఈ చరణము మొదలు ౫ చరణములు ని. రే. ౧౦౬. లో నుండునవి.

సచలతిచేన్మానవతీ తథాపి
కుచసంగాదనుకూలయతి ॥రాధా॥

అవనతశిరసావృతి సుభగం
వివిధాలాపైర్వివశయతి
ప్రవిపుల కరరుహరచన విలాసై
ర్భువనపతి (తిం ?) తం భూషయతి ॥రాధా॥

లతాగృహమేళనం నవసై
రతవైభవ సౌఖ్యం దృష్ట్వా
తత స్తతశ్చరసౌ (శ్చరతస్తౌ ?) కేళీ
వ్రతచర్యాం తాం వాంఛంతౌ ॥రాధా॥

వనకుసుమ విశదవరవాసనయా
ఘనసారరజోగంధైశ్చ
జనయతి పవనే నవధి వికారం
వనితా పురుషౌ జనితాశౌ ॥రాధా॥

ఏవం విచరన్ హేలా విముఖ
శ్రీవేంకటగిరి దేవోయం
పావనరాధాపరిరంభసుఖ
శ్రీవైభవసుస్థిరో భవతి ॥రాధా॥ 165

30-వ రేకు. ధన్నాసి

ఏవం వర్ణ్యమసి[1] హితమతిరివ
కేవలంతే ప్రియసఖీవా తులసీ ॥పల్లవి॥

ఘటిత మృగమద మృత్తికా స్థానకం
పటు శరీరే తే ప్రబలయతి

---

1. పె-రే. సా-రే. వర్ణయతి. ఈ కీర్తనభావము సుగ్రాహము గాదు.

కుటిలతద్ఘనఘారకుచవిలగ్నంవా
పిటర స్థలే మృత్స్నితా తుళసీ ॥ఏవం॥

లలిత నవ ఘర్మలీలా విలసనో
జ్జ్వలనం తవ తనుం వంచయతి[1]
జల విమలకేళీవశా సతతం
అలిక ఘర్మాంచిత విహారా తులసీ ॥ఏవం॥

సరస నఖచంద్రలేశాస్తే సదా
పరమం[2] లావణ్యం పాలయతి
తిరువేంకటేశ తత్కరుణా గుణా వా
వరరూప నవచంద్రవదనా తులసీ. ॥ఏవం॥ 166

సామంతం

సారెసారె విన్నవించఁ జాలమిఁక నీవు
దారిదప్పఁ దిరిగేవు తగవా వోరి ॥పల్లవి॥

చెప్పరాదు కడు వలచిన వానివలె నా
కొప్పులోని సవరము కొంటఁబోయి
అప్పుడే వొక్కతికిచ్చితట వోరి నా
తప్పుగాని నీవల్లఁ దప్పులేదు వోరి ॥సారె॥

కడలేని మోహంబు గలవానివలె నా
కడితాను (?) చీర నీవు కాసెవోసి
వడిగానేఁగెదవు యవ్వతికియ్యవలెనో[3] నన్ను
వడిఁబెట్టి యింతసేయవలెనా వోరి ॥సారె॥

ముద్దుల నా వేలనున్న ముద్దుటుంగరము నీవు
వుద్దండానఁ గొంటఁబోతి వోరి

1. పె-రే. సా-రే. సంచయతి. 2. ని-రే. ౨. సా-రే. పరమలావణ్యం. 3. ని-రే. ౧౧౫. నేఁగెద వెవ్వతికినో.

తిద్దలేము నీగుణాలు తిరువేంకటేశ నీవు
వొద్దికతో నన్నుఁబాయకుండరా [1] వోరి ||సారె|| 167

సామంతం

తలనొక్కమాటాడఁ దలకెక్కె వలపు దీని
తలఁపు రేఁచక మీరు తలరమ్మా ||పల్లవి||

చిత్తజు నమ్ములు దాఁకి జీర వారినందుకు పూ
వత్తులు వేయక కాని వాడదమ్మా
బత్తిగల వారిందరు పచ్చకప్పురము [2] మేన
మెత్తకకాని మానదు మెత్తరమ్మా ||తల||

కంటిచూపు కాయజుని వింటిబాణములు దాఁకి [3]
గంటిలేని పోటులాయఁ గదరమ్మా
అంట ముట్టరాని తాప మగ్గలమైనది ముల్లు
ముంటఁగాని పోదు మేను మూయరమ్మా ||తల||

అప్పుడింత సొబగు లేదతివమొగమునందు
చొప్పులెల్ల బాగులాయఁ చూడరమ్మా
అప్పఁడు శేషాద్రిరాయఁడంగనఁ [4] గలిసెఁ గాన
యెప్పుడూఁ బాయని చనవిచ్చె నమ్మా. ||తల|| 168

పాడి

చింతల చిగురులె [5] చిచ్చులట
యింతటిలోనిఁక నేలాగే ||పల్లవి||

చక్కని మన్మథ సంవత్సరంబున
చుక్కలరాజే సూరియుఁడై

1. సా-రే. తో మమ్ముఁ గూడుకుండరా. 2. సా-రే. పచ్చకప్పురపుమేన. 3. ని-రే. ౧౦౫. వింటిబాణమె మేను. 4. డతివెఁ గలశీఁ. 5. సా-రే. చిగురేచి.

యెక్కువరాత్రుల యెండగాయునట[1]
యెక్కడిదిఁక బ్రదుకేలాగే ॥చింత॥

కాంతల నడుములఁ గఱవయ్యీడినట
అంతట జవ్వనపాయునిని
వింత మీన స (శ ?) ని[2] వెలఁదులకన్నుల
నెంత గననౌనో[3] యేలాగే ॥చింత॥

కుంకుమగుబ్బల కుంభరాశికిని
పంకల చంద్రుఁడు వచ్చెనట
వేంకటరమణుఁడు వెలఁదిఁ గూడెనట
యింక నితమక మేలాగే[4] ॥చింత॥ 169

పాడి

మారుకు మారు సేయ మఱచి నీ వంతలోనే[5]
నేరములెంచుకొనేవు నేఁటిలోనే తప్పెనా ॥పల్లవి॥

చొక్కపు నీ గుబ్బలపై జూజపు[6] నేఁతలవలె
చిక్కలి జీరలువారఁ జించెనాతఁడు
తెక్కుల నీ వూరకుండి తెలిగన్నుల విక్కు
గుక్కేవు నీ చేతులేమి కూరగోయఁ బోయెనా ॥మారు॥

ముసిముసి నగవుల మోవిమీఁది కెంపులవి[7]
కసిగాటు నేఁతలనే కప్పె నతఁడు
అసురుసురై నీవు ఆతనిఁ జేయఁగలేక
వుసురనేవప్పుడేమి వూరలేక వుంటివా ॥మారు॥

1. ని-రే. ౫౪. రాత్రులు యెండలు గాయఁగ. 2. మీనసాని. 3. నింతే గనమాయనే. 4. నితమకంచేలాగే; ౯౩. తమకమ్మేలాగే. 5. ని-రే. ౯౩-౧౨౦. నీ వింతలోనే. 6. ని-రే. ౯౩. జూదపు. 7. ని-రే. ౧౨౦. కెంపులు. ని.

కూరిమి నీ కౌఁగిటిలోఁ గూడి నీ చిత్తమనెడి[1]
పూరిలోనఁ గాఁపురమైవుండె నాతఁడు
వేసలేని మహిమల వెంకటేశుఁడతనిపై
చూరగొంటి వప్పుడేమి జోడువెట్టుకుంటేనా[2] ॥మాఱు॥ 170

కాంభోది

ఉయ్యాల మంచముమీఁద నూఁచి వేసారితిమి
ముయ్యదించుకయు రెప్ప మూసినాఁ దెరచును ॥పల్లవి॥

చందమామ పాదమాన సతికి వేఁగినదాఁకా
యెందును నిద్రలేదేమి నేతమే[3]
గందపుటోవరిలోనఁ గప్పురంపుటింటిలోన
యిందుముఖి పవ్వళించు నింతలోనే లేచును ॥ఉయ్యా॥

పంచసాయకుని పుష్పబాణమాన యిందాఁక
మంచముపైఁ బవ్వళించి మాటలాడదు
నించిన వాలుగన్నుల నిద్దురంటానుండితిమి
వంచిన రెప్పలవెంట వడిసీఁ గన్నీరు ॥ఉయ్యా॥

వెన్నెలల వెంకటాద్రివిభుని వేసవ్వలాన
నన్నుఁ జూచియైనాఁ[4] జెలి నవ్వదాయను
ఇన్నిటాను సంతసిల్లి యీ దేవదేవుని గూడి
మన్ననల యింత (నింత ?) లోన మలసీని[5] జెలియు ॥ఉ॥ 171

31-వ రేకు. కాంభోది

ఉండఁబాసీ నడవిలో నొకతె నేను
ఎండలు నీడలు గాసీ నేమి నేతురా ॥పల్లవి॥

---

1. ని-రే-౯౩-౧౨౦. గూడిన చిత్తమనెడి. 2. వేంకటేశ్వరుఁడు నిన్ను చూరగానె టప్పుడేమి జోడు వెట్టుకుంటివా. 3. ని-రే, ౩. దేమి నేతుతే. 4. జూచినాఁ. 5. మన్నన యింతలోనే మలసీనే.

చిన్నినానడుము చూచి సింహము దగ్గరెనంటా
ఉన్నతపుఁ గుచములకోరసెఁ గరి
మున్నిటి పొందులు వైరమును జేసె మృగపతి
యిన్నిటికి నగ్గమైతి[1] నేమి సేతురా ॥ఉండ॥

నిండు నా నడపు చూచి నెమలి దగ్గరి[2] వచ్చె
బెండు సేసి నారుసూచి పాయదు పాము
రెండుఁ జూచి పగయుఁ గూరిమి దోఁచె[3] నింతలోనే
యిందె వట్టె నిన్నిటికి నేమిసేతురా ॥ఉండ॥

కోరి నాపలుకు విని కోవిల దగ్గర వచ్చె
చేరీ నామోవికిదె చిలుక నేఁడు
గారవాన నిన్నియు వేంకటగిరి విభుఁడా
యేరా యిట్టె చేకొంటివేమి సేతురా. ॥ఉండ॥ 172

శంకరాభరణం

వెక్కసమగుఁ గుచవిభవములు
జక్కవా (వ ?) పులుగుల[4] జగడములే ॥పల్లవి॥

చింతచేత నిదె చెలియ నుదుటిపై
చెంతలఁ జెదరిన చిరునెరులు
కాంత కన్నులను గండుమీలకును
కంతుఁడు వేసిన గాలములే ॥వెక్క॥

తమకంబునఁ గాంతకుఁ గరమూలపు
చెమటల తావుల చెలువములు
మమతలఁ బెంచిన మరుని కొంతముల
జమళితీఁగెలకు జలకములే ॥వెక్క॥

1. ని-రే. ౧౦౭. నేనగ్గమైతి, ని-రే-౪. కినగ్గలమైతి. 2. దగ్గర. 3. ని-రే. ౧౦౭. రెండుఁజూచి శిఖికిఁ బగయుఁ దోఁచె. 4. ని-రే. ౯. జక్కవ చూపుల.

తెలవమోవిపై[1] తిరువేంకటపతి
గుఱుతులు సేసిన కురుఁబసలు
ఒఱగి వివశతల నుండఁగ సురతపు
మఱపులు దెలిపిన మర్మములే.[2] ॥వెక్క॥ 173

61-వ రేకు. కొండమలహరి

భోగీంద్రశయనుని బోయతి దివ్య
భోగాలు మరిగిన బోయతి ॥పల్లవి॥

పొదిగొన్న[3] పెనుఁగొప్పు బోయతి మించుఁ
బొదలిన గుబ్బల బోయతి
పొదలఁ[4] బూవులు చూచి బోయతి యంప
పొది నవి[5] వెరచెనె బోయతి ॥భోగీ॥

పొడల గందపుమేని బోయతి పచ్చి
పొడికప్పురపుఁ బూఁత బోయతి
పొడవైన హరిఁ జూచి బోయతి నేఁడు
పుడుకు వేఁడురుగొన్న బోయతి ॥భోగీ॥

పొందైన రచనల బోయతి పతిఁ
బొందక పొందిన బోయతి
పొంచులెరఁగని[6] బోయతి రతిఁ[7]
బొందె వేంకటపతి బోయతి. ॥భోగీ॥ 174

ముఖారిపంతు[8]

ఎవ్వఁడో వీఁడేల తఁగి వచ్చి
నవ్వీ నవ్వీ నాతోనే ॥పల్లవి॥

---

1. మోముపై. 2. ఈ ౩౧-వ రేకులోని మిగిలిన నాల్గు పాటలు IV-వ సంపుటము తుదలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారిచే పరిశోధింపఁబడి చేర్పఁబడినవి. ౩౨-వ రేకు మొదలు ౬౦-వ రేకు వఱకుఁగల పదములు వారు ఆ సంపుటమున చేర్చి ప్రకటించినారు. 3. ని-రే. ౫౨. పొదిగిన. 4. పొదలుఁ బూ. 5. సా-రే. నవ్వి. 6. ని-రే. పొందులు యరఁగని. 7. రతి అన్న మాటలేదు. 8. ని-రే. ౭౩. ముఖారి.

పచ్చిపాలే పచ్చిపాలే
పచ్చిపాలే తోడంటుఁబాలే
వచ్చి వచ్చి వాడ వాడలఁ
జొచ్చి యారగించెఁ జూడరే ॥ఎవ్వ॥

పెంటపెరుగే పెంటపెరుగే
పెంటమంచ పెనుఁబెంట పెరుగే
అంటకంటకు మనఁగానే వాఁడు
వొంటి నారగించీ నోయమ్మా ॥ఎవ్వ॥

బొంకుగోరో బొంకుగోరో
బొంకుగోరో కోరో పొలఁతులు
వేంకటేశుఁడు వేసాలరాయఁడు
అంకెలా నన్ను నలరించెనే[1]. ॥ఎవ్వ॥ 175

సామంతం

ఎటువంటి భోగి వీఁడెటువంటి జాణ
వటపత్రమున నున్నవాఁడా వీఁడు ॥పల్లవి॥

పొదిగొనఁ బూచిన పున్నాగతరులలో
పొదలుఁ బుప్పొళ్ళపైఁ బూఁదేనె సోనలు
గదలుచు జడివానకాలంపుఁ బెదపెద్ద
నదులై పారనున్నతిని
కదలని నడిగడ్డ కల్పభూజంబుల
పదిలమైన నీడ బంగారు చవికెలో
కదిసిన జలరాశి కన్నెకౌఁగిటఁ గూడి[2]
వదలకెప్పుడు నున్నవాఁడా వీఁడు ॥ఎటు॥

---

1. లంకెలా నన్ను నలయించెనే. 2. ని-శే. ఒ-ని. కౌఁగిటిలోన.

వలనగు తావుల వాసంతికలలోన
కెలకుల నరమోడ్పుఁ గెందామరలయందు
పొలయుచు గొజ్జంగపూవుల దూళితో
లలితంపు గాలి చల్లఁగను
కొలఁదిమీరిన మంచి కోనేటి పన్నీటి
జలములలో నున్న జలజముఖులుఁ దాను
అలరుచుఁ దగనోలలాడుచు నేప్రొద్దు
వలపులు చల్లినవాఁడా వీఁడు ॥ఎటు॥

లోకము లోపలి లోలలోచనలెల్లా
జోకైన తనవాలుఁ జూపులచేఁ జిక్కి
యీకడాకడ చూడనెఱఁగక నిజమైన
సాకారమునకె[1] మెచ్చఁగను
పైకొన్న సరసపుఁ బలుకులఁ గరఁగించి
యేకాంతమున సౌఖ్యమెల్లఁ జేకొనుచుఁ దా
నీకడఁ దిరువెంకటేశుఁడై యున్నాఁడు
వైకుంఠపతియైన వాఁడా వీఁడు. ॥ఎటు॥ 176

శ్రీరాగం

వేవేగన రానివిభునితోడి పొందు
యేపూరికేపూరు యేపూరే ॥పల్లవి॥

ప్రేమమెఱఁగి రాఁడు పిలిచిన సతితోడ
యేమందమేమందమేమందమే
భామిని తను నొవ్వఁబలికెననుచు నాడె
యేమాఁటకేమాఁట యిది యేఁటికే ॥వేవే॥

జామాయ నిదె వచ్చి నటలెల్లఁ బచరించి
యేమేలుకేమేలు ఇదియేఁటికే

1. సాకారములకె.

కామునిశరములఁ గాఁగునింతకుఁ జెలి
యేమిటికింక మనమేమిటికే ॥వేవే॥

దిమ్మరితసములఁ [1] దిరువేంకటేశుని
రమ్మను రమ్మను రమ్మనవే
నెమ్మనమలరఁగ నేఁడింతలోననే
కమ్మరఁ గమ్మరఁ గరుణించెనే. ॥వేవే॥ 177

దేసాళం

నెయ్యములల్లోనేరేళ్ళో
వొయ్యన వూరెడి వువ్విళ్ళో ॥పల్లవి॥

పలచని చెమటల బాహుమూలముల
చెలమలలోనాఁ జెలువములే
థళథళమను ముత్యపుఁ జెఱఁగు సురటి
దులిపేటి నీళ్ళతుంపిళ్ళో ॥నెయ్య॥

తొటతొటఁ గన్నులఁ దొరిగేటి నీళ్ళ
చిటిపొటి యలుకల చిరునగవే
వటఫలంబు నీ [2] వన్నెల మోవికి
గుటుకలలోనా గుక్కిళ్ళో ॥నెయ్య॥

గరగరికల వేంకటపతి కౌఁగిట
పరిమళములలో బచ్చనలు [3]
మరునివింటి కమ్మనియంప విరుల
గురితాఁకులినుపగుగ్గిళ్ళో. ॥నెయ్య॥ 178

శుద్ధవసంతం

ఎన్ని సేసినా నీకు నిది గొత్తలా
అన్నిటిలోపల నుండే ఆతఁడౌదో కావో ॥పల్లవి॥

1. ని-రే. ఉ-౨. ములతిరువేం. 2. ని-రే. ౮-౫. లంపు యీ వన్నె. 3. బచ్చనలే.

వాలఁతి మెయిఁదీగెపై పులకలు వొడమించే
విల నిస్నుఁ దలఁపించి యిది గొత్తలా
తలకొన్న వేణునాదమునసె వట్టిమాఁకు
లలరఁ జేసినవాఁడవౌదువో కావో ॥ఎన్ని॥

గుట్టునఁ బయ్యెదకొంగు గుబ్బలసె జారించే
విట్టె నీప్రేమసే యింతికిది గొత్తలా
మట్టుకొని వేణురవమున గొల్లెతల చీర
లట్టు నిట్టు వదలించి నాతఁడౌదో కావో ॥ఎన్ని॥

కాంత కవుఁగిటను వేంకటగిరి విభుఁడా నీ
వింత మేను మఱపించుటిది గొత్తలా
పంతమాడి యడవిలో పసుల నీరాగాల
రంతులనే మఱపించే రాజవవుదో కావో. ॥ఎన్ని॥ 179

62-వ రేకు. ఆహిరి [1]

ఎంతవడి దాఁక నీ యెల [2] యింపులు
సంతమై విభునికిటు చనవియ్యరాదా ॥పల్లవి॥

పొగరుఁగెమ్మోవి గిరుపుల నగవులాఁడి నీ
పగడవాతెర దెరచి పలుకవమ్మా
బిగువుఁ బొలయలుక మురిపెముల నీ సొబగెల్ల [3]
సగమాయఁ జలమింకఁ [4] జాలించరాదా ॥ఎంత॥

కలికి సునుమెఱుఁగుఁ టుల [5] కల గుబ్బలాఁడి నీ
సొలపుఁగన్నులు దెరచి చూడవమ్మా
వలపు వసివాడ జవ్వనపు లేఁదీగతో [6]
తలఁకేవు కోపంబు తలఁగించరాదా ॥ఎంత॥

1. ని-రే. ౧౦౧. ముఖారి. 2. నీ వెల. 3. పములనే తనువల్లి. 4. జెలి యింక. 5. మించుఁఖుల. 6. కొఁదీగతో.

లావణ్యముల సొబగులాఁడి నీ ప్రియుఁడైన
గోవిందుని పైఁ బ్రేమ గొలుకవమ్మా
శ్రీ వేంకటేశ్వరుఁడు చెలఁగి నిను మన్నించె
[1] నీ వేడుకలనైన నిట్లుండరాదా. ॥ఎంత॥ 180

ఆహిరి [2]

చిఱుత నవ్వులవాఁడు శిన్నెకా వీఁడు
వెఱపెఱఁగడు సూడవే సిన్నెకా ॥పల్లవి॥

పొలసు మేనివాఁడు బోరవీఁపువాఁడు
నెలసు మోరవాఁడు సిన్నెకా
గొలుసుల వంకల కోరలతో భూమి
వెలసినాఁడు సూడవే సిన్నెకా ॥శిఱుత॥

మేఁటి కుఱుచవాఁడు మెడమీఁది గొడ్డలి
సీటకాలవాఁడు సిన్నెకా
ఆఁటదానిఁ బాసి అడవిలో రాకాసి
వేఁటలాడీఁ [3] జూడవే సిన్నెకా ॥శిఱుత॥

బింకపుమోఁతల పిల్లఁగోవివాఁడు
సింక సూపులవాఁడు సిన్నెకా
కొంకక కలికియై కొసరి కూడె నన్ను
వేంకటేశుఁడు సూడవే సిన్నెకా. ॥శిఱుత॥ 181

శ్రీరాగం

చెల్లఁబో అలుగ నేఁడు సిగ్గుగాదా
వొల్లని వీనిఁ బాసి వుడికీ నామనసు ॥పల్లవి॥

---

1. యా వేడుకలనైన యిట్లు. 2. ౨-రే. ౪౦. సామంతం. 3. లాడె. సూడ.

పొలసి యీ ప్రాణమిట్టె పోయినాఁ బోయఁగాక
తలవంపు నేసే యీతనువేఁటికే[1]
కలసియుఁ గలయని కతిచిత్తుని వీని
సొలసి కమ్మరఁ జూచీ నామనసు ॥చెల్ల॥

పరుతాపమున మేను మాఁడిన మాఁడెఁగాక
పరులబారికిఁ జిక్కి బ్రదుకేఁటికే
విరహాన నొకతెప్పె వేదనఁ బొరలు వీని
కరుణలే కోరీని కష్టపు నామనసు ॥చెల్ల॥

సడిఁబెట్టి వయసిట్టె చంపినఁ జంపెఁగాక
వడిఁబెట్టి వేఁచే నావయసేఁటికే
కడు జాణఁడైన వేంకటగిరీంద్రుఁడు వాని
వొడలు సోఁకిన నిట్టె వుబ్బెడి నామనసు. ॥చెల్ల॥ 182

కాంభోది

ఇదె మొగంబిదె యద్దమిఁకనేఁటికే మిగులఁ
బదరేవు చెలివద్ద[2] బవళించి నీవు ॥పల్లవి॥

పెట్టినది నాయకుని బిరుదు పెనుఁబెండెంబు
కట్టినది యతనిమెడ కంటమాల
యెట్టు దొంకెదవె చెలి యిందాఁక బంగారు
పట్టెమంచముమీఁదఁ బవళించి నీవు ॥ఇదె॥

పుక్కిటిది నాయకుని పొందైన తమ్ములము
చెక్కిటిది పతినొసలి చిన్నిచెమట
యిక్కువెరిఁగియు బొంకనిఁకనేలె చెలి యతని
పక్కనే యిందాఁకఁ బవళించి నీవు ॥ఇదె॥

1. ని-రే. ౪౦. తగుశేఁటికే. 2. సా-రే. పతివద్ద.

బచ్చెనలు కుచయుగముపై నతని [1] మృగమదము
లచ్చెనలు కొనగోళ్ళలాంచనములు
ఇచ్చకుని దిరువేంకటేశుఁ గూడితివె చెలి [2]
పచ్చలోవరి [3] లోనఁ బవళించి నీవు. ॥ఇది॥ 183

శ్రీరాగం

పిడికిటి తలఁబాల పెండ్లికూఁతురు కొంత
పెడమరలి నవ్వీనె పెండ్లికూఁతురు ॥పల్లవి॥

పేరుకల జవరాలె పెండ్లికూఁతురు పెద్ద
పేరులముత్యాలమెడ [4] పెండ్లికూఁతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లికూఁతురు విభుఁ
బేరు కుచ్చ [5] సిగ్గువడీఁ బెండ్లికూఁతురు ॥పిడి॥

బిరుదు పెండెము వెట్టెఁ బెండ్లికూఁతురు నెర
బిరుదు మగనికంటెఁ బెండ్లికూఁతురు
పిరిదూ (పిరుఁదూ ?) రినప్పుడె పెండ్లికూఁతురు పతిఁ
బెరరేఁచీ నిదివో పెండ్లికూఁతురు ॥పిడి॥

పెట్టెనె [6] పెద్దతురుము పెండ్లికూఁతురు నేఁడె
పెట్టెఁడు చీరలుగట్టెఁ బెండ్లికూఁతురు
గట్టిగ వేంకటపతికౌఁగిటను వడి [7]
వెట్టిన నిధానమైన పెండ్లికూఁతురు. ॥పిడి॥ 184

బౌళి

పెట్టని కోటిందరికిఁ బెండ్లికొడుకు బొమ్మఁ
బెట్టె నసురలకెల్లఁ బెండ్లికొడుకు ॥పల్లవి॥

1. వి-రే. ౨౫. పైకతని. 2. శేశ్వరునిఁ గూడితివి. 3. సా-రే. పచ్చల వోవరి.
4. వి-రే. ౨౩. ముత్యాలపెండ్లి. 5. కుచ్చి. 6. పెట్టెడి. 7. కౌఁగిటను పెట్టిన.

పెల్లగించి భూమెత్తీఁ [1] బెండ్లికొడుకు వాఁడె
పిల్లఁగోవి రాగాల పెండ్లికొడుకు
పెల్లైన యావుల పెండ్లికొడుకు వాఁడె
పిల్లఁదీపుపెన్నుద్ది పెండ్లికొడుకు ॥పెట్టని॥

పెంచెపు శిరసుపాగ పెండ్లికొడుకు గుం
పించిన కోపగించీఁ బెండ్లికొడుకు
పెంచకప్పుడే పెరిగెఁ [2] బెండ్లికొడుకు వల
పించెఁ జక్కనిసిరిఁ బెండ్లికొడుకు ॥పెట్టని॥

పెంటపెరుగులదొంగ పెండ్లికొడుకు భూమిఁ
బెంటి పోతులఁ గూరిచెఁ బెండ్లికొడుకు
గెంటులేని వేంకటగిరిమీఁదను వాఁడె
పెంట వెట్టుకున్నవాఁడు పెండ్లికొడుకు. ॥పెట్టని॥ 185

63-వ రేకు. ముఖారి

పైపై యూరక పదరో యింతి
కోపాన బాసైనఁ గొనీఁ గాని ॥పల్లవి॥

పరివారపుఁ బడఁతులేఁటికే
దొరలనంపేరు తొలరో
సరసపు తమజగడాల నిట్టే
పరుల దూషేరు పచ్చిగనే ॥పైపై॥

చక్కని విభుని సారెకుఁ జెలులు
వెక్కసాలాడక విడరో
దిక్కులకెల్లాను తెలివఁ బాసి తా
నొక్కఁడే విచ్చేయుటొచ్చెమని ॥పైపై॥

1. ని-రే. ౩౨. మెత్తెఁ బెండ్లి. 2. కపుదే పెరిగే పెండ్లి.

శ్రీ వేంకటేశుఁడు చెలువుఁ డొక్కఁడే
యేవంక కేఁగిన నేమౌను
భావించి యురముపైనున్న కొమ్మదా
నేవేవి గడించె నెఱఁగరా[1] ॥పైపై॥ 186

ఆహిరి

గట్టునఁ గోరికలెల్లఁ గొల్లవట్టి నీ[2]
పట్టపుదేవికి నీకుఁ బల్లాండు పల్లాండే ॥పల్లవి॥

పచ్చల సందిదండలు బాహుపురులు మెరయ
నెచ్చెలిపై మేను సోఁక నిలుచుండి
పచ్చవిలుకానితల్లి బంగారుదోసిట నీపైఁ
బచ్చకప్పురము చల్లీఁ బల్లాండు పల్లాండే ॥గట్టు॥

మంతనపు మాఁటలతో మాఁటుగ నిన్ను సొలసి
కొంతపు గోళ్ళ నిగ్గు గుమ్మరింపుచు
చెంతలఁ జెంగలువలు చెలులు చేనందియ్యఁగ
పంతమున నీపై వేసి ప (సీఁబ ?) ల్లాండు పల్లాండే ॥గట్టు॥

అలరుల మేడలోన అలమేలు మంగ నీ[3]
యలయిక దీరఁ బ్రేమ నలరఁ జేసి
కలసి వేంకటేశ నీ కాఁగిలి చేకొనీ నిదే[4]
పలుమారు మీకు మీకుఁ బల్లాండు పల్లాండే. ॥గట్టు॥ 187

మాళవి

తఱచు సూసకపు ముత్యపుఁ దలఁబాలతో
నెఱుల తుఱుము వంచీనే నెలఁత ॥పల్లవి॥

---

1. సా-రే. నెఱఁగదా. 2. ని-రే. ३३. ట్టెని నీ. 3. ఇది పె-రే. పాఠము, సా-రే ని-రే. మంగ నిదే. 4. వి-రే. చేకొనె నిదే.

పచ్చఁ దోరణముఁ బలుకులింటికిని
పచ్చిముత్యాలనే కట్టె బాసికము
ముచ్చటలేనగవుల ముంగిట ముగ్గులువెట్టి
నిచ్చకల్యాణములాడీనే నెలఁత. ॥తఱచు॥

బచ్చెనల మెఱుఁగు గుబ్బల అయిరాణి[1] దెచ్చి
కుచ్చుఁ బులకలబూజ[2] గుండలాయను (?)
దిచ్చరిమరునిఁ దెచ్చి తెరమరఁగెడలించి[3]
హెచ్చిన పెండ్లికూఁతురే నెలఁత ॥తఱచు॥

మరువింటి పేరింటి మంచిలగ్నమునందు
పరువంపుఁ జనుదోయి పరవుమీఁద
తిరువేంకటగిరిదేవునికౌఁగిటఁ గూడి
నిరతంపు సిరులందెనే నెలఁత. ॥తఱచు॥ 188

నారణి దేశాక్షి[4]

ఎందరికి మోహించి యెందు వోతివో నీ
యందపుఁ జేఁతలు నాతో నానతియ్యరాదా ॥పల్లవి॥

పాదమున నంటిన పచ్చకప్పురములోన
వేదుగాఁ దులసితావి విసరీని
యేదెసఁ బవ్వళించితి వెవ్వతె పాదములొత్తె
నాదరముతోడ నాతో నానతియ్యరాదా ॥ఎంద॥

చెలువంపు నొసల నించిన[5] పచ్చి కస్తూరి
తులసి పరిమళము దొలఁకీని
యెలమి నెక్కడకేఁగి యెవ్వతెకు మొక్కితివో
అలవి దేరఁగ[6] నాతో నానతియ్యరాదా ॥ఎంద॥

1. ని-రే. ३-२. లనైరేనిదెచ్చి. 2. బులకలె బూజ. 3. లించె. 4. ని-రే. ३-२. నారాయణి దేశాక్షి. 5. మించిన. 6. దీరఁగ.

ఉరము నీ మాణికాన వొనరిన జవ్వాది
సరిగాఁ దులసితావి చల్లిని
తిరువేంకటేశ పొందితివి నన్నిదె నీ
యరవిరి విధమైన నానతియ్యరాదా. ॥ఎంద॥ 189

శ్రీరాగం

చలిగాలి వేఁడేల చల్లీనె కప్పురపు
మలయజము తానేల మండీనే ॥పల్లవి॥

పాపంపు మనసేల పారీనే నలుగడల
చూపేల నలువంకఁ జూచీనే
తాపంపుమేనేల తడవీనె పూవింటి
తూపేల చిత్తంబు దూరీనే ॥చలి॥

హాయెత్తి చిలుకేల వదరీనె పలుమారు
కోయిలలు దామేల గొణఁగీనే
రాయడికి నలులేల రాసీనె మాతోను
కాయజుఁడు తానేల కసరీనే ॥చలి॥

ఏకాంతముననేల యెదురైతినే తనకు
లోకాధిపతికేల లోనైతినే
చేకొనిదె మన్నించె శేషాద్రివల్లభుఁడు
పైకొనిదె మమ్మేల పాలించెనే. ॥చలి॥ 190

వరాళి

కొలిచి బిందెలఁ బోసుకొనుఁగాక యీ
పులయుఁగోరిక్కలనెడి మాడలే పండె ॥పల్లవి॥

పొలఁతి[1] సిగ్గులపోఁడు వొడిచి చిత్తపుటడవి
తొలుచూపుఁబదనునవె దున్నఁగాను

1. వి-రే. ౯౨. పొలితి.

తలపోఁత విత్తుగా తను చెమటవానలనె
బలువైన[1] తమకమను బంగారు పండె ॥కొలిచి॥

ఇచ్చకపుఁ జిరునగవులింటిలోపలి తోఁట
మచ్చుఁజీఁకట్లె పలుమరుఁ దవ్వఁగా
ఎచ్చుకుందుల సొలపులేతపుజలము వారి
నచ్చుఁగాఁకల పైఁడినక్కులే పండె ॥కొలిచి॥

తగిలి వేంకటవిభుని తనివోని కౌఁగిటను
జగడంపుఁ గూర్మి సరసము చల్లఁగా
నిగనిగని పలుకుఁదేనియలు వేమఱుఁ బారి
నిగుడు విరహాగ్ని మాణికములే పండె. ॥కొలిచి॥ 191

64-వ రేకు. శంకరాభరణం

నాకుఁ జెప్పరె వలపు నలుపో తెలుపో
సూకి పోవఁగరాదు సుయ్యో కొండో ॥పల్లవి॥

పొలఁతి మరునికి వెరవ పులియో యెలువో
వులుకుఁదుమ్మిదమోఁత వురుమో మెరుమో
తిలకింపఁ జందనము తేలో పామో
యెలమిఁ గోవిలకూఁత యేదో పోదో (?) ॥నాకు॥

పొదలిన చలిగాలి పొగయో వగయో
వదలిన కన్నీరు వాఁగో వంతో
వుదరమునఁ బన్నీరు వుడుకో మిడుకో
యెదుటఁ దలవంచుకొను సిగ్గో పిగ్గో ॥నాకు॥

అసమశరు పైపరపుటదనో పదనో
పసగలవానిమోవి పంచదారో తేనో

1. బలుపైన.

అసమగతి వానిరాక అదో పాదో
రసికు వేంకటేశు పొందు రాజ్యమో లక్ష్మి. ॥నాకు॥ 192

వరాళి

చెలఁగి కూరాకుగాఁ జేసేవు నీ
తలమీఁదనుండే తరుణిఁబో నేను ॥పల్లవి॥

పినుకకు పలుమారు పసురువేసీ నంత
వసివాడుకోర్చిన వనితఁ గాను
పస లేఁచి సేవింత పాలించు తొల్లిటి
సిసువయిన[1] నీ పెట్టుఁజెట్టఁబో నేను ॥చెలఁగి॥

చిడుమకు పరుమారు చెక్కునొచ్చి[2] నీవు
వచనము నొక్కేటి వనితఁ గాను
ఎదురెదురనే భూమినెందరు లేరు నీ
నిదురవుచ్చినవారు నేనెవ్వతిని ॥చెలఁగి॥

కందించకు నన్నుఁ గౌఁగిట కాఁకల
అందునిందుసు గడు నలముచును
ఇందిరాపతి వేంకటేశ నీరతుల[3]
పొందు నాకిదె మఱపులకెల్ల నెలవు. ॥చెలఁగి॥ 193

శంకరాభరణం

లేఁతచెమటలనె తెలిసె మాకు నీకు
సేఁతలు మోఁతలునైన యింటిలోని సాము ॥పల్లవి॥

పొదలు నీ నిట్టూరుపులనె తెలిసె మాకు
తుద మీరు వలరాచతొలిసాము
చెదరు నీ నెరులు చూచినవె తెలిసె మాకు
వెదచల్లు కాఁకల విరహపు సాము ॥లేఁత॥

---

1. ని-రే. ౨౪. శిశువనైన. 2. చెక్కులు నొచ్చి. 3. నీ రచనల.

పొలఁతి [1] నీ చూపువంపులనె తెలిసె మాకు
తలపోఁతవగల బిత్తరిసాము
పలుకకుండిన నీ కోపాననె తెలిసె మాకు
అలవోక నగవు నీ అరవిరిసాము ॥లేఁత॥

వొద్దికఁ గస్తూరితావులనె తెలిసె మాకు
గద్దరి నీ రతుల చీఁకటిసాము
ముద్దుల నీ నగవుల మోమునఁ దెలిసె మాకు
నిద్దపు వేంకటపతి నెరపిన సాము. ॥లేఁత॥ 194

శ్రీరాగం

ఎనలేని బీరములెండ [2] మావులు
ఇనుపగుగ్గిళ్ళు నీవేమిసేసేవే [3] ॥పల్లవి॥

పల్లదపుఁ గోరికల బలిమి గలుగఁబట్టి [4]
తల్లడపుఁ దమకము దక్కెఁగాక
వెల్లిగొను మమతపై విసిగేవు యీ
యిల్లులేని ముంగిలి నీవేమి సేసేవే ॥ఎన॥

లేఁత నీచిత్తములోఁ దాలిమి గలుగఁగఁ బట్టి
చేఁతల నీయలుకెల్లఁ జెల్లెఁగాక
పూఁతమాఁటల సొలపుబొంకులనె దూరేవు [5]
యీఁతలేని చల్లులాట యేమిసేసేవే ॥ఎన॥

నెరతనముల నీ నెయ్యము గలుగఁబట్టి
తొరలి వేంకటపతి దొరకెఁగాక
తెరవ నీకితనికిఁ దియ్యపుఁగూటముల
యెరుకలేనిమఱపులేమిసేసేవే. ॥ఎన॥ 195

1. పె-రే. ౨౩. పొలఁతి. 2. ని-రే. ౩౨. ముదే యెండ. 3. సేసేవు. 4. గలుగఁగఁబట్టి. 5. దూరేవు.

ఆహిరి

బయలీఁదించేవే గొల్లపడుచా - నీవె
బయలీఁదించేవు [1] లోపలనె కన్నులను ॥పల్లవి॥

పాలు వోయవుగా గొల్లపడుచా - యీ
పాలకుండలివి లోలోపల [2] మున్నవి
పాలుమాలేవేలే గొల్ల [3] పడుచా - మా
పాలు నీ కేలయ్యు పాలవారివాఁడవు ॥బయ॥

పచ్చితేనె దేవే గొల్లపడుచ - మాకు
పచ్చితేనె లేదు మోవిపంటనే కాని
పచ్చిమాటలేలే గొల్లపడుచ - పూవుఁ
బచ్చితేనెలివివో నీ పలుకుల కొనలు ॥బయ॥

పసిచల్లమ్మే గొల్లపడుచా - నీవె
పసివడి తిరిగేవు బడివాయక
పసిబాలవటె గొల్లపడుచా - కురుఁ
బసల వేంకటగిరిపతి నన్నేలితివి. ॥బయ॥ 196

ధన్నాసి

ఇందా నందును రుచులెట్లుండునో
కందువెరిఁగి మేలుకైకొందువు ॥పల్లవి॥

పదివేలు పళ్యాల పళ్ళిభోగము నీ
వదన నారగింతువప్పాలతో
పొదలిన యింతేసి పొందైన మతితో నీ
సుదతికెమ్మోవినే చొక్కితివిగా [1] ॥ఇందా॥

సరిలేని కల్పభూజముల పూవుల పూజ
సిరులుగా సురలచేఁ జేకొందువు

1. చేవే. 2. లివి లోపల. 3. లేవే గొల్ల. 4. ని-లే. ౨-౨. చొక్కితిగా.

పరిపరివిధముల పరిమళములనెడి
తరుణి పువ్వులతావిఁ దగిలితిగా ॥ఇందా॥

కొత్తయిన కస్తూరితోఁ గోరి తట్టుపుణుఁగు
మెత్తుకొందువు నీవు మేనిండను
ఇత్తరిఁ దిరువేంకటేశ యీ చెలిఁగూడి
హత్తిన చెమటలతో నలరితిగా. ॥ఇందా॥ 197

65-వ రేకు. కాంభోది

కూరిములే కదవమ్మ కోపమయ్యాని కడు
భారమైన పోటుగాదా వచ్చిదేరే పలుకు ॥పల్లవి॥

పున్నమచందురుని తోఁబుట్టుగైన నీ మోము
వెన్నెలలే కదవమ్మ వేఁచఁజొచ్చీని
పన్నిన పగల వెలుపటివారికంటెను
ఎన్నరాని పగగాదా యింటిలోని పోరు ॥కూరి॥

చిత్తజుని జనియించఁ జేసే మొక్కలపు నీ
చిత్తమిదే కదవమ్మ సిగ్గు వాపీని
మిత్తివలెఁ జెలరేఁగి[1] మీఁదఁగాసే యెండకంటే
నెత్తిమీఁదిచిచ్చుగాదా నీడలోని యెండ ॥కూరి॥

కట్టఁగడ చందనపుగాలికి మీరిన నీ
నిట్టూరుపులేకావా నిగ్గుదేరీని
యిట్టె యివె[2] తిరువేంకటేశుఁగూడఁబట్టి నీకు
చుట్టపుఁబగలే మంచిచుట్టములైనవి. ॥కూరి॥ 198

సామంతం

కడు నీకు మోహించుఁగాని చక్కవివిభు
నెడసి నిమిషమైన నెట్టోరిచేవే ॥పల్లవి॥

1. ని-రే. ౨౨. చెరరేఁగి. 2. యిదె.

పసఁడిమంచముమీఁదఁ బవళించి యతనితో
కసరులాడెడియట్టు గాదువో నేఁడు
విసిగించెఁ గదవె యీ విరహానలము నిన్ను
నిసుమంత దడవైన నెట్లోరిచేవే ॥కడు॥

అడుగులొత్తుచు నీ యడుగులు [1] నతనిమై
కడఁగి వొత్తినయట్లు గాదువో నేఁడు
బడలించెఁ గదవె యీ పరితాపమున నిన్ను
నెడయెడ యలుకలనెట్టోరిచేవే ॥కడు॥

ఒరపైన యతనిపైనొరగి యాతనిమతిఁ
గరఁగించునటువలెఁ గాదువో నేఁడు
వెరవక కలసితి వేంకటపతితోడ
నెఱిఁగెఱుంగని చేఁతలెట్టోరిచేవే. ॥కడు॥ 199

శ్రీరాగం

వనితలఁ గరఁగించు వన్నెకాఁడవు యిట్టె
తనివి దీరవేమిటఁ దగునయ్య విట్ఠల ॥పల్లవి॥

పైపైనె యేరమణిగుబ్బలకో యిచ్చితివి నీ
వైపైన కరముల వాఁడిగోళ్ళు
చూపిలిన రతితోడఁ దోయఁ (యె ?) డు చేతులతోడ
యేపుననున్నాఁడవిపుడేమయ్య విట్ఠల ॥వనిత॥

పొందైన యేలలన చూపులకొ యిచ్చితివి నీ
విందైన మురిపెపు (నీ) వేయిగన్నులు
అందపు రెండుగన్నులరవిరి నీ మోమున [2]
చెందమ్మిరేకులఁ బోలుఁ జెల్లునయ్య విట్ఠల ॥వనిత॥

---

1. వి-రే. ౨౨. యడుగున. 2. వి-రే. ౭౩. గన్నుల అరవిరి ; సా-రే. గన్నుల నరవిరి నీమోము.

కింకల నేసతికో చిక్కెను నీచిత్తమెల్లను
అంకెల నన్నునేలితివబ్బురంబుగా
పంకంపుఁ గస్తూరిమేన పండరంగిపతివైన
వేంకటనగముమీఁది వెడమాయ విట్టలా. ॥వనిత॥ 200

ముఖారి - ఏకతాళి [1]

కలసి కాఁకలఁబెట్టి కనుసన్నలనె తిట్టి
చలపట్టి నీకుఁ జెల్లే జాణఁడే యతఁడు. ॥పల్లవి॥

పగటుగుబ్బలురాయ పసిఁడి మట్టెలు మ్రోయ
నగవువెన్నెల గాయ నడచేవు
వగ నిన్ను భ్రమయించ వలపువారిధి ముంచ
జగడాలు వచరించ చతురుఁడే యతఁడు ॥కలసి॥

చూపులనె పగచాట సొబగులఁ గనుగీఁటఁ
దీపు పైపై మీఁటఁ [2] దిరిగేవు
కోపగింతలనేఁప కూరిములు పైఁజాఁప
రాపులు పెరరేఁప రసికుఁడే యతఁడు ॥కలసి॥

సందుల దండలు జార జవ్వాదిచెమట గార
సందములు దైవార నలసేవు
కందువుల నినుఁగూడి కరఁగి సిగ్గులు వీడి
విందై నీ తోడుతనాడే వేంకటేశుఁడితఁడు. ॥కలసి॥ 201

ఆహిరి

ఎంతపని యిది యానతియ్యరాదా యీ
చింతచే [3] నీ మనసు చిముడఁబెట్టేవు ॥పల్లవి॥

1. సా-రే. యతితాళి. 2. ఇది ని-రే. లోని పాఠము ; సా-రే. దీపుల పైపై మీఁద. ని-రే. ౧౧౦. చింతరేని మనసు.

పండువెన్నెల బయటఁ బవళించి వేడుకల
సుండి చెలి యేఁటికో వుసురంటివి
కొండుకవయసు నిడుకోరికల [1] నిట్టూర్పు
బెండలసె యీ చిత్తమేల వేఁచేవు ॥ఎంత॥

తూఁగు మంచముమీఁదఁ దురముఁ బయ్యద జార
నూఁగుచును నేఁటికో వుసురంటివి
కాఁగేటి [2] కుచగిరులు కమ్మఁజెమటలఁ దొప్పఁ
దోఁగగా తమకంబు తొలఁగ డాఁచేవే ॥ఎంత॥

నిద్దంపు వేడుకల నీవు వెంకటవిభుని
వొద్దికై యేఁటికో వుసురంటివి
వొద్ద నీకెపుడాతఁడుండవలె నాతనిని
వద్దనఁగ రాదనుచు వాడఁబారేవు. ॥ఎంత॥ 202

బౌళి

కావరాదా కరుణించి
వావిగాని వావి వాడీఁ దరుణి ॥పల్లవి॥

పచ్చిదేరునగ్గి బగబగ మండేటి
చిచ్చరకోలల చేఁతల
వెచ్చియు వేవని వేదనఁ [3] బొరలుచు
అచ్చపుటాసల నలసీఁ దరుణి ॥కావ॥

నీడలేని మాఁకు నిక్కపుటెండల
తాడులేని కట్టుఁదగులున [4]
గోడలేని పెద్దకోరిక చిత్తారు
వాడుచు లోలోనె వ్రాసీఁ దరుణి ॥కావ॥

1. పా-భే. నీదు కోరికల. 2. పా-భే. కౌఁగిటను కుచ. 3. వ్రా-భే. ౩౭. వేదనలఁ. 4. పా-భే. వ్రా-భే. తగులునా.

పొందు[1] లేని పొందు భోగపుఁ బ్రియముల
కందెడి తనలోని[2] కరఁగుల
కందువెఱిఁగి వేంకటగిరిపతి నిసుఁ
బొందిన[3] తమకానఁ బొరలీఁ దరుణి ॥కావ॥ 203

66-వ రేకు. దేశి[4]

ముదిత చిత్తమునకు మొక్కరమ్మా
తుదలేని పతినిదె తోడితెంచె[5] నిపుడు ॥పల్లవి॥

పొలఁతి గుబ్బలనెడి పొడవు గుబ్బలిమీఁది
మొలకచందురునకు మొక్కరమ్మా
నెలవుగఁ దనపతి నిద్దిరించే యింటిలోన
వెలయు వెన్నెలతీగె వెంటఁదెచ్చె నిపుడు ॥ముదిత॥

వనిత కన్నులనేటి వనజదళములపై
మొన చెంగలువలకు మొక్కరమ్మా
పెనగొన్న తనవిభు పెదపెద కన్నుల
గొనకొన్న పొందులెల్లఁ గొంటవచ్చె నిపుడు ॥ముదిత॥

అంచగమనకుఁ దొడవైన జవ్వాది నీట
ముంచిన మేనితావికి మొక్కరమ్మా
మెంచరాని తిరువేంకటేశుఁ గూడి యాతని
లంచపుఁ గౌఁగిటితావి లంకెఁ బెట్టె నిపుడు. ॥ముదిత॥ 204

ముఖారి

రాఁడుగాక సరుగన రసికుఁడు యిట్టె
నేఁడే మచ్చికలనే నిధులు నిలుపఁడా ॥పల్లవి॥

---

1. ని-రే. పిరందు. 2. లోనె. 3. బొందితమ. 4. ని-రే. ౩౬. అటతాళం.
5. పె-రే ; సా-రే ; ని-రే. అలోను 'తెంచె' ననియే.

ప్రేమపు నీ యధరమే పెట్టరానిజీతము
కోమలి నీ తమ్ములమే కొంగుబత్త్యము
జాము నిన్నుఁ గొలిచిన చక్కని నీ విభుఁడు
యేమరక వలపులయేకరాజ్యమేలఁడా ॥రాఁడు॥

పూఁత నీ గర్వముల చూపులే వారకములు
చేఁత నీ నగవులే పళ్ళెములో కూడు
పూఁతగాని చిత్తమనే వుప్పరిగెనుండినా
బాఁతి పడి నీ గుబ్బలపైఁడి కుండలెత్తఁడా ॥రాఁడు॥

పుయ్యని నీ మేనితావి పువ్వుల చప్పరము
తొయ్యలి నీ కౌఁగిలిది తూఁగుమంచము
కయ్యపుఁ గూటముల వెంకటగిరివిభుఁడు
గయ్యాళి నీ కోరికల గద్దెమీఁద నుండఁడా[1]. ॥రాఁడు॥ 205

ముఖారి

ఇంచరినేలితి విఁకనేలే (మే?) నీ
యందపుఁ బనులకు నంపుదు గాక ॥పల్లవి॥

పొక్కుచు నిదె వలపుల సింహాసన
మెక్కితి వంగన[2] యిఁకనేమే
పుక్కిటి నిట్టూర్పుల ప్రసాదములు
చక్కని చెలులకుఁ జల్లుదు గాక ॥ఇంద॥

పరిమళపు సుదుటఁ బట్టునఁ బట్టము
ఇరవుగఁ గట్టితివిఁకనేమే
తరగని మేని ప్రతాపానలమున
అరుదగు సిగ్గుల నణఁతువు గాక ॥ఇంద॥

1. ని-రే. ౧౨౦. నుండఁగా. 2. సాఁరే. వనిఁతనేమే.

రాఁపుల మోహపురతుల రాజ్యమిది
యేపునఁ జేసితివిఁకనేమే
పైపై వేంకటపతిరూప సిరులు
చేపడె నిన్నిటఁ జెలఁగుదు గాక. ॥ఇంద॥ 206

ముఖారి

వెరవకువే యింత వెరగేలా నీకు
నెఱిఁ గురిసీఁ గొప్పున నీలాలు[1] ॥పల్లవి॥

పగడాలు వాతెరఁ బాయక కురియఁగ
మొగిఁ గురిసీఁ గన్నుల ముత్యాలు
మగువ నీవిభుని ప్రేమపుఁగూటమి గన్నుల
మగుడఁ గురిసీ నింక మాణికాలు ॥వెర॥

పడఁతి నీపుట్టానఁ బచ్చలు గురియఁగా
వడిసీని నీమేన వజ్రాలు
కడఁగి నీరమణుని కాఁకలఁ గూడఁగ[2]
తొడరీ నీగోళ్ళతుదఁ గెంపులు ॥వెర॥

హితవైన తిరువేంకటేశుకౌఁగిట మోహ
రతులఁ బొడమె నవరత్నాలు
ప్రతిలేని లప్పలైన పచ్చి[3]కస్తూరి శయ్య
మితిలేక రాలెనే గోమేధికాలు. ॥వెర॥ 207

ముఖారి - అటతాళం

ఎవ్వరిపై నింతేసి యేల దూరేవే
పువ్వులు నిన్నే తాఁకఁ బొంచెనటవే ॥పల్లవి॥

---

1. ఇది ని-రే. ౧౨. లోనిది. సా-రే. గురిసీ నీలాలు కొప్పునను. 2. ని-రే. ౧౨. కదిసి నీరమణుని కౌఁగిటఁగూడఁగ. 3. సా-రే. పచ్చ.

పండువెన్నెలలు నీపైఁ గాయఁగా నీ
కెండలాయెనంటా నేల తిట్టేవే
నిండిన చందురుఁడు నీకు నాతనికి
కొండుకపాయము రూపు కూడపెట్టె నటవే ॥ఎవ్వ॥

చల్లగాలి నిన్నును జాలిఁబెట్టెనంటా
వెల్లిగ నాకేలేల చట్టే విఱిచేవే
మెల్లనే నీవిభుని మేనితావి యింతేసి
చల్లమని గాలియేమి చాటెనటవే ॥ఎవ్వ॥

కోవిలలు నిన్నుఁ గోపగించెనంటా
యీవల నావలనెల్ల నేల దూరేవే
శ్రీ వేంకటేశుని చెలియ నీకొఁగిట
చేవగాఁ గూడుమని చెప్పెనటవే. ॥ఎవ్వ॥ 208

## సాళంగం

నీవు దురగముమీఁద నేర్పు మెరయ
వేవేలు రూపములు వెదచల్లితపుడు ॥పల్లవి॥

పదిలముగ నిరువంక పసిఁడిపింజల యంప
పొదుల తరకసములొరపులు నెరపఁగ
గదయు శంఖంబుఁ జక్రము ధనుఃఖడ్గములు
పదివేలు సూర్యబింబములైనవపుడు ॥నీవు॥

సొరిది శేషుని పెద్దచుట్టు పెనుఁగేవడము
సిరిదొలఁక నొకచేతఁ జిత్తగించి
దురమునకుఁ దొడవైన ధూమకేతువు చేత
నిరవైన బల్లెమై యేచెనందపుడు ॥నీవు॥

కరకజడతో రమాకాంత జయలక్ష్మియై
తొరలి కౌఁగిట నిన్నుఁ దొడికి పట్టి
వరచె నెను వేంకటస్వామి నేను గెలుపుమని
మెరుఁగు కుచకుంభముల మిసిమితో నపుడు. ॥నీవు॥ 209

67-వ రేకు. కాంభోధి

కాంత నీ నెరుల చీఁకటినతఁడు భ్రమయఁగా
చింత చీఁకట్లు ముంచినది యరుదా ॥పల్లవి॥

పొలఁతి [1] నీ చిఱునవ్వు పువ్వులాతఁడు గోసి
కులికి కన్నుల నొత్తుకొనఁగాను
వలరాయఁడప్పుడు తన వాఁడి పువ్వు (వు ?) టమ్ములను
చలముకొని [2] మిమ్ము ముంచక మానునా ॥కాంత॥

నెలఁత నీపలుకుఁదేనియలాతఁడిటు గ్రోలి
సొలయుచును మైమరచి చొక్కఁగాను
తలఁపఁ గోవిలల యమృతంపుఁ బలుకుల వెల్లి
అలర మీమీఁదఁ గురియక మానునా ॥కాంత॥

పరగు నీ మెఱుఁగు గుబ్బలనెడి (నేటి ?) గిరులపై
తిరువేంకటేశ్వరుఁడు తిరుగఁగాను
పరువంపు వలపు తాపలపెద్దకొండలై
గరిమతో మీకుఁ బెనుగక మానునా. ॥కాంత॥ 210

శ్రీరాగం.

పతిఁ గలసి మేనెల్ల పరవశంబగుకంటె
హితవిరహమున నెదిరి నెఱుఁగుటే మేలు ॥పతి॥

---

1. ని-రే. ఉ॥..బాలిఁతి. 2. దలకొని. మిమ్ము.

పరపీడ గావించి బతుకు బతుకుటకంటె[1]
పరహితము చేయునాపదలె మేలు
సిరుల నడిమికి భయముసేయు ఘనుఁగవకంటె
తరుణి నీ[2]నెన్నడిమిదైన్యమే మేలు. ॥పతి॥

కాంత నితరులకెంచి గరువించుకంటె (?) మతిఁ
జింతఁగుందుచు నలయు సిలుగె[3] మేలు
కుంతలంబుల కిందఁ గుయికుఁ జూపులకంటె
చెంతలను నీతురము చెదరుటే మేలు ॥పతి॥

తొడరి సరివారి వొత్తుటకు నోర్చుటకంటె
గొడవతో వాఁడి గైకొనుటె మేలు
పడఁతి నీ వెంకటప్పనిరతి నలయుకంటె
కెడపి కొనగోళ్ళ సోఁకించుటే మేలు. ॥పతి॥ 211

ముఖారి

వన్నెమాటల వలతువా నీవు నామనసు
కన్నపెట్టఁగఁ గదా కడుబేలనైతి ॥పల్లవి॥

పట్టుకొని నిన్నుఁ గోపముదీర చూపులనె
కట్టివేసినఁగదా[4] గర్వమడఁగు
అట్టునిట్టును నీకు నర్మ్యములనసాదయుసు
బెట్టికా నీచేతఁ బిరిపీకునైతి ॥వన్నె॥

మరిగించి నిన్ను నామనసారఁ గుచగిరుల
నరులఁ దోసినఁ గదా చలమణఁగును
అరిది మోహమున నీ యడుగులకు మడుగులేఁ
బరచికా విరహతాపమునఁ బడవలసె... ॥వన్నె॥

1. ని-రే. ౨౨. బతుకుటంటె. 2. రుణినెన్న. 3. సిరులె. 4. ని-రే. ౩౧. సినఁగాక.

చెనకి నిన్నిట్లు నాచేయారఁ గోరికల
తనివి దీర్చినఁగదా [1] తనులవుదువు
ఘనమూర్తివైన వెంకటగిరీశ్వర నీకు
నొనర లోనైకదా వొడబెరఁగనైతి. ॥వన్నె॥ 212

ముఖారి

కొలనిలోన మును గోపికలు
మొలక నవ్వు (వు?) లతో మ్రొక్కిరి నీకు ॥పల్లవి॥

పిఱుఁదులు దాఁటిన పించెపుకులుకల
తురుములు వీడఁగఁ దొయ్యలులు
అరిదినితంబములందునె దాఁచుక
మురిపెపుఁ గరముల మొక్కిరి నీకు ॥కొలని॥

నిష్టపు మానము నెలఁతలు లోఁగుచు
గద్దరి తొడలనె కట్టుచును
ముద్దుటుంగరంబుల కరములతో
ముద్దులు గునియుచు మొక్కిరి నీకు ॥కొలని॥

పాలిండ్ల పెనుభారంబుల కర
మూలపు మెఱుఁగులు ముంచఁగను
వేలపుఁ బ్రియముల వేంకటేశ నిను
మూలకుఁ బిలుచుచు మొక్కిరి నీకు. ॥కొలని॥ 213

రామక్రియ [2]

మానరె మాయపు మగువలు నేఁ
గాసిఁ గానుచుఁ గనలి శిశువు ॥పల్లవి॥

---

1. శ్రీసంగా. 2. ని-రే. ౫౪. ఆహిరి.

పాలట[1] దొంగిలె బాలుఁడు గో
    పాలుఁ గూడుక పలుమరుసు[2]
    పోలవిమాఁటలు బొంకులు యిది[3]
    యేలె యేలె మీరెలజవ్వనులు ॥మాన॥

సారెకు వెన్నలు చవులట[4] యీ
    మారులు మీకిఁక[5] దొసగులు
    చేరువ గరిమలు చెల్లవు మీరు
    పోరె పోరె వారవుల[6] నెర సతులు ॥మాన॥

కింకలు మీకివి[7] గెలుపులు నెల
    వంకలు మీకివి[8] వన్నెలు
    వెంకటపతి మీ విభుఁడట మీరు
    బొంకక బొంకక పొలఁతులు మనరే ॥మాన॥ 214

ముఖారి

ఎండలు రేయెండలుగా నిరువంకఁ జూచువాఁడు
    కొండలుఁగోట్లునయిన గుణములవాఁడు ॥పల్లవి॥

పాలవెల్లి కొండమీఁదఁ బల్లెగట్టినవాఁడు
    పాలలోని పాపఁడన్న ప్రాణమైనవాఁడు
    పాలఁబుట్టినట్టికూఁతు పంచిపెట్టినవాఁడు
    పాలునేయి ముచ్చిలించి బదికినవాఁడు ॥ఎండ॥

ఆలపోతువాసతోడ నంటినమేనివాఁడు
    ఆలఁగాపరులతోడ నాడినవాఁడు

1. పె-రే. ౨౪. పాలుదొం. 2. సా-రే. ని-రే. మారుసు. 3. సా-రే. కులు మీ - కే.
4. సారెకు మిక్కిలి చనవులు. 5. ని-రే. మీకివి కొసరులు. 6. సా-రే. వారవరి.
7. సా-రే. మీరినగెలు. 8. మీకే వన్నె.

ఆలజాలమైన నీటనలరఁ దేలినవాఁడు
ఆలపోతు కొండమీఁద నసువైనవాఁడు ॥ఎండ॥

పాఁపరేని మేను దన పానుపు సేసినవాఁడు
మోఁపరయి సకలము మోచినవాఁడు
కోపము శాంతములేని కొండలకోనేటివాఁడు
పాపముఁ బుణ్యము లేక బదికినవాఁడు. ॥ఎండ॥ 215

68-వ రేకు. శంకరాభరణం[1]

వేఁటకాఁడనంటా నా[2] వెంటఁ బాయవు వోరి
చీటకపు చెంచెత నాచేతిలాగెరఁగవా ॥పల్లవి॥

పొదలో నేనేసిన పులి నీవేసితినని[3]
పెదపెద్ద యెలుగుఁల బెదరించేవు
కుదురుగుబ్బల నిన్నుఁ గుమ్మదునో వుండేవో మేను[4]
చిదియఁగా మేటిచెంచెత నన్నెఱఁగవా ॥వేఁట॥

చేరువ నామోఁటునఁ జేరిన నామెకముల[5]
నేరుపరినంటా నీవునేసేవు[6]
జీరలుగా కొమ్మ గోరఁ జింతునో వూరకుండేవో
పేరుకల చెంచెత నాబిరుదులెరఁగవా ॥వేఁట॥

చొల్లెపు చుట్టలతోడ[7] చూపులకు నడ్డాలు
చెల్లునంటా వచ్చి చెట్టవట్టేవు
వొల్లననఁగా[8] గూడేవు వుద్దండపు వేంకటేశ
జల్లివింటి చెంచెత నాచలములెరఁగవా ॥వేఁట॥ 216

---

1. ని-రే. ౨౭. వరాళి. 2. నంటా వెంట. 3. సా-రే. పొదలోన నుండేటి పులిని వేశితినంటా. 4. ని-రే. దేవో చిదియ. 5. సా-రే. చేరి నామాఁటునఁ జేరిన మెకముల. 6. ని-రే. నీవయేసేవు. 7. చూపులతోడ. 8. వొల్లనన్నఁగూ.

భైరవి

ఏమీనసకురే యెప్పుడు మీరు
గామిడియై కాలిసన్నఁ గదలీని బిడ్డఁడు ॥పల్లవి॥

పొలసీననకురే పొటిగి యిందరుఁగూఁడి
పులికి తలదీసుకవున్న బాయసు
పయకఁడనకురే బలుమోరతోఁపుఁ గోపి
తలఁకే సిబ్బితిగొని త (నీఁద్ద ?) లరమ్మ బిడ్డఁడు ॥ఏమీ॥

అడిగిననకురే ఆసదీరదనకురే
కడఁగి చలమరియై గాసిఁబెట్టీని
జడయున్నవసకురే జనసుతుఁడీశిశువు
కడు దూరీ గిసలకు గమనించి బిడ్డఁడు ॥ఏమీ॥

బిత్తయన్నాఁడనసురే పృథివిలోఁ బిన్నవాఁడు
సత్తులై వున్నవారి మడియించీని
చిత్తిణివాఁడనకురే శ్రీ వేంకటేశుఁడు
యెత్తుక యీరేడులోకాలేలీని బిడ్డఁడు ॥ఏమీ॥ 217

సామంతం

అడుగడుగుకు నీ వాడ్డఁగాను మా
బదలికంతయుఁ బోయ పండరంగిరాయ ॥పల్లవి॥

పాదికెత్తు మెరుఁగారు బంగారుగుండు
నేదదేర మెడఁగట్టి చిత్తగించితి
యేదెస కానికదెచ్చి యిచ్చిరి నీకెవ్వరో
పావపుగజ్జెలు మోయ పండరంగిరాయ ॥అడు॥

మద్దికాయలు చెవ్వుల మాణిక్యాల పోఁగులు
పెద్దపెద్దముత్యాలు పెలపు మీరఁగా

ముద్దల వెన్నపాలు ముచ్చిలించు సేఁతలవి
బద్దుల పనులై పోయ పండరంగిరాయ ॥అడు॥

వెల్లిగొను వేడుకల వేంకటాద్రిపతివై
తెల్లనికన్నుల నవ్వుతీగె సోగల
గొల్లెతల గుబ్బలపై కూరిమి మెరయఁగా
పల్లకి నీకిప్పుడాయ పండరంగిరాయ. ॥అడు॥ 218

మంగళకౌశిక

అబ్బురంపు శిశువు ఆకుమీఁదిశిశువు
దొబ్బుడు రోలశిశువు త్రుప్వి త్రుప్వి త్రుప్వి ॥పల్లవి॥

పుట్టు శంఖుచక్రములఁ బుట్టిన యాశిశువు
పుట్టక తొల్లే మారుపుట్టువైన శిశువు
వొట్టుక పాలువెన్నలు నోలలాడు శిశువు
తొట్టెలలోని శిశువు త్రుప్వి త్రుప్వి త్రుప్వి ॥అబ్బు॥

నిండిన బండి దన్నిన చిన్నిశిశువు
అండవారి మదమెల్ల నణఁచిన శిశువు
కొండలంతేశసురులఁ గొట్టిన యా శిశువు
దుండగంపు శిశువు త్రుప్వి త్రుప్వి త్రుప్వి ॥అబ్బు॥

వేఁగైన వెంకటగిరి వెలసిన శిశువు
కాఁగిటి యిందిర దొలఁగని శిశువు
ఆఁగి పాలజలధిలో నందమైన పెనుఁబాము
తూఁగుమంచము శిశువు త్రుప్వి త్రుప్వి త్రుప్వి. ॥అబ్బు॥ 219

ముఖారి [1]

పలుకుఁదేనియల నుపారమియ్యవే
అలరువాసనల నీ యధరబింబానకు ॥పల్లవి॥

1. ని-రే. ౧౦౯. శ్రీరాగం.

పుక్కటి లేనగవు పొంగుఁబాలు చూపవే
చక్కని నీవదనంపు చందమామకు
అక్కరో నీవాలుఁగన్నులా[1] రతిగా నెత్తవే
గక్కన నీచెక్కుఁదొలుకరి మెరుపులకు[2] ॥పలుకు॥

కమ్మని నీమేని[3] తావి కానుకగా నియ్యవే
వుమ్మగింత చల్లెడి నీవూరుపులకు
చిమ్ముల[4] నీచెమటలఁ జేయవే మజ్జనము
దిమ్మరి నీమురిపెపు తీగమేనికి ॥పలుకు॥

పతి వేంకటేశుఁగూడి[5] పరవశమియ్యవే
యితవైన నీమంచి హృదయానకు
అతనినే తలఁచఁగ నానతియ్యఁగదవె
తతితోడ నీలోని తలపోఁతలకు. ॥పలుకు॥ 220

భైరవి[6]

ఆన వెట్టుదువు నీవప్పటి[7] నానోరణఁచి వోరి[8]
నీ నిజానకు నాతో నేఁడైన మానరా[9] ॥పల్లవి॥

పచ్చడాన జవ్వాది పరిమళమేడదిరా
పచ్చినేఁతలు చెక్కుఁళ్ళపై నీకేడవిరా
గచ్చుమోవిమీఁదనున్న కసిగాటులేడవిరా
యిచ్చకుఁడ కనుఁగెంపులేడవి గలిగెరా[10] ॥ఆన॥

ముద్దుల[11] చక్కని నీదు మోముకళలేడవిరా
కొద్దిగాని సందొత్తుగోరేడదిరా[12]

1. వాలుఁజూపు అర. 2. తొలుకారు మెరుఁగులకు. 3. మెయి. 4. చెమ్మల. 5. టేశుపై. 6. తం-ప్ర. ౩౦. ధ్రువతాళం. 7. తా-వేం. ౨౩౫; తం-ప్ర. ఆనలు వెట్టేవు సారె అప్పు. 8. 'వోరి' లేదు. 9. తం-ప్ర. ఆనాలు నీకేతోడగురా అదియింకా మానవురా; తా-వెం. ఆనలు నీకు తోడారా నేడింక మానవురా. 10. తా-వెం. గెంపులివి యేడవిర. 11. తం-ప్ర. ముద్దుగారే నీ. 12. కొద్దిగా నొక్కిన సందిగోళ్ళేడవిరా; తా-వేం. కొద్దిగా నూఁదినసంది.

గద్దరీఁడ యీ చిట్టు[1] గందము నీకేడదిరా
తిద్దెను గస్తూరిబొట్టు దిమ్మరి యెవ్వతెరా[2] ॥అన॥

భీతితో నీవాడేటి[3] తబ్బిబ్బుమాటలేడవిరా
రాతిరేడ నుండితి[4] వెరవక చెప్పరా
యేతరీఁడ తిరువేంకటేశ నన్ను నేలితివి[5]
యేతులతో వలపించ నెంత కలికివిరా[6] ॥అన॥ 221

69-వ రేకు. కన్నడగౌళ

కామయాగము చేసెఁ గలికి తన
ప్రేమమే దేవతాప్రీతిగాను ॥పల్లవి॥

కోమలపు రసతతాంబూలరసపానంబు
నలినాక్షి సోమపానంబు గాను
కలకలంబుల మంచి గళరవంబుల మోఁత
తలకొన్న వేదమంత్రములుగాను ॥కామ॥

పడతి తన విరహతాపమునఁ బుట్టిన యగ్ని
అడరి పరికొన్న హోమాగ్నిగాను
ఒడఁబడిక సమరతుల నుదయించిన చెమటఁ
దడియుటే యది యవభృథంబుగాను ॥కామ॥

తనరఁ గుచముల నచులు దంతా (త?) క్షత క్రీడ
నను పైన పశుబంధనంబుగాను
యెనసి శ్రీ తిరువేంకటేశ్వరుని పొందు
ఘనమైన దివ్యభోగంబుగాను. ॥కామ॥ 222

---

1. తా-వేం. చిట్లిన. 2. సా-రే. తిద్దినది గోరు జూటుదిమ్మరి యెవ్వతెరా. (తా-వెం. లో ఈ చరణము ౧-౩ పాదములు తారుమారైనవి.) 3. సా-రే. భీతులేక నీ వాడే. 4. తా-వెం. రాతిరెందు వోతివో. 5. తం-ప్ర. ఈ తరి శ్రీ వేంకటేశ యిట్టె నునుఁ గూడితివి. 6. ఈ తీరు సారె వలపించి యెంత కలికివిరా ; తా-వెం. ఈతరి చొక్కించితివి యెంత....... .

శ్రీరాగం [1]

పట్టనిఁకనోప నాప్రాణంబులు నీ [2]
పట్టు దైవమె యెఱుఁగు బ్రదుకవయ్యా ॥పల్లవి॥

పడితివిన్నాళ్ళు నిర్బంధమున నాచేత
కడమొదలు లేని కాఁకల సొలపుల
బడలెఁ గడు నామేను పట్టనిఁకనోప నీ [3]
పడఁతులను గూడుకొని బ్రదుకవయ్యా ॥పట్ట॥

నొగిలితివి నాచేత నొప్పిమాటలనెంతె [4]
వగలఁ గడు నన్ను విడువఁగనోపక
జగడమిఁక లేదు విరసము మాని సుఖివియై [5]
పగలేక [6] యిఁకనైన బ్రదుకవయ్యా ॥పట్ట॥

ఎంత నొగిలినను నాకేమాయె [7] నీకు నీ
సంతోషమబ్బినను జాలుఁగాక
యింతసేసియు వేంకటేశ కూడితివి నీ [8]
పంతంబు చెల్లెనిఁక బ్రదుకవయ్యా. ॥పట్ట॥ 223

శ్రీరాగం

కవయఁగవలెనంటి కౌఁగలించేవా నీ
వువిదలఁ దలఁచకవుండనోపేవా ॥పల్లవి॥

పారిటాకులు గట్టి పారనోపేవా
యేరులెల్ల దాఁటి కొండలెక్కనోపేవా
యీరీతి వెదురుబియ్యమేరనోపేవా
పేరినతేనెలు తెచ్చి పెట్టనోపేవా ॥కవ॥

1. ని-శే. ౧౮౯. ముఖారి. 2. నాపట్టుదైవమ్మెఱుంగు. 3. పట్టకిఁక నీవు నీ. 4. మాటలవెన్నీ. 5. వెయ్యై. 6. పగలేరెవ్వఁక. 7. ఎంతచేసిన నీకు నేమాయె. 8. సా-శే. ఇంతసేసి తిరువేంకటేశ నను గూడితివి.

యెడమఁ గుడిని వింటనేయనోపేవా
అడవిమెకాల వేఁటలాడనోపేవా
కడఁగి చెంచెత నాతోఁ గలఋండేవా
అడరి నాపొత్తుల నారగించేవా ॥కవ॥

ఉప్పటిమాఁటలు యీడేరించనోపేవా
చెప్పినట్టే కాఁపురము సేయనోపేవా
కప్పురంపుశయ్యపై వేంకటరాయఁడా
యెప్పుడుఁ బాయని చనవియ్యనోపేవా. ॥కవ॥ 224

మాళవి

చూడవమ్మ యశోదమ్మ
వాడల వాడల వరదలివిగో ॥పల్లవి॥

పొంచి పులివాయఁ బెరుగు[1]
మించు మించు మీఁగడలు
వంచి వారలువట్టిన
కంచపుటుట్ల కాఁగులివిగో ॥చూడ॥

పేరీఁ బేరని నేతులు
చూరల వెన్నల జున్నులును
ఆరగించి యట నగఁబాళ్ళు
పారవేసిన బానలివిగో ॥చూడ॥

తెల్లని కనుఁదీగెల సోగల
చల్లలమ్మేటి జవ్వనుల
చెల్లినట్లనే శ్రీవేంకటపతి
కొల్లలాడిన గురుతులివిగో. ॥చూడ॥ 225

1. ౨-రే. ౨౪. బెరుగులు.

ధన్నాశి

బండి విరిచి పిన్నపాపలతో నాడి
 దుండగీఁడు వచ్చె దోబూచి ॥పల్లవి॥

పెరుగు వెన్నలుఁ బ్రియమున వే
 మరు ముచ్చిలించు మాయకాఁడు
 వెరవున్నాఁ (వునఁ ?) దనవిధము దాఁచుకొని
 దొరదొంగ వచ్చె దోబూచి ॥బండి॥

పడుచు గుబ్బెత పరవుపై పోక
 ముడి గొంగు నిద్రముంపునను
 పడియుఁదా (?) వద్దఁ బవళించినట్టి
 తొడుకుదొంగ వచ్చె దోబూచి ॥బండి॥

గొల్లపల్లెలో యిల్లిల్లూ చొచ్చి
 కొల్లలాడిన కోడెకాఁడు
 యెల్లయినా వేంకటేశుఁడు ఇదె
 తొల్లిటిదొంగ వచ్చె దోబూచి. ॥బండి॥ 226

సామంతం

చల్లనై కాయఁగదొ చందమామా నీ
 వెల్ల (ల్లి ?) గాఁ దిరువేంకటేశునెదుర
 మొల్లమిగ నమృతంపు వెల్లి గొల్చుచు లోక
 మెల్ల నినుఁ గొనియాడఁగాను ॥పల్లవి॥

పొందైన హితులు నాప్తులు రసికులును గవులు
 నందమగు సునుమాటలాడ నేర్చిన ఘనులు
 చిందులకు నాడేటి సీమంతినీ మణులు
 చెలఁగి యిరుగడఁ గొలువఁగాను

వందిమాగధులు గై వారింపఁ దనదివ్య
మందిరోపాంత ఘనమార్గమునఁ గోనేటి
ముందటను మంద మందప్రయాణములతో
నిందిరాపతి మెరయఁగాను ॥చల్లనై॥

ఏకాంత సుఖగోష్ఠినింపొంద మానవా
నీకంబులెడఁ గలసి నిలిచి సేవింపఁ గాం
తాకదంబముల (లు ?) హస్తముల కంకణఝణ
త్కారములు నిగుడఁ జామరములిడఁగ
జోకైన మణిగణస్తోమాంకితంబులై
సొంపొందు నాలవట్టములు గరములఁ దాల్చి
యేకాంతులిరువంక నెదిరి కొలువఁగ సకల
లోకేశ్వరుఁడు మెరయఁగాను ॥చల్లనై॥

బంగారుప్రతిమలకు ప్రతులైన దివిజలో
కాంగనలు ఘనవిమానాంగణంబుననుండి
చెంగలువలును మంచిసేవంతిరేకులును
చెలఁగి యిరుగడఁ జల్లఁగాను
మంగళాత్మకములగు మహితవేదాంత వే
దాంగవిద్యలకు ప్రియమంది చేకొనుచుఁ దిరు
వేంగళేశ్వరుఁడు గడు వేడుకలతోడఁ దిరు
వీథులను విహరించఁగాను. ॥చల్లనై॥ 227

## పాడి[1]

మూలమూల నమ్ముఁడుఁజల్ల ఇది
రేలుఁ బగలుఁ గొనరే చల్ల ॥పల్లవి॥

1. ని-రే. ౭౩. శ్రీరాగం - యేకతాళి.

పిక్కటిల్లు చన్నుల గుబ్బెత వొకతి కడుఁ
జక్కనిది చిలికిన చల్ల
అక్కనఁ జెమటగార నమ్మీని[1] యిది
యెక్కడఁ బుట్టదు గొనరే చల్ల ॥మూల॥

వడచల్లు మేని జవ్వని[2] వొకతి కడు
జడియుచుఁ జిలికిన చల్ల
తడఁబడు కమ్మనితావులది మీ[3]
రెడయకిపుడు గొనరే చల్ల ॥మూల॥

అంకులకరముల వొయ్యారొకతి కడు
జంకెనలఁ జిలికిన చల్ల
వేంకటగిరిపతి వేడుకది[4]
యింకానమ్మీఁ[5] గొనరే చల్ల. ॥మూల॥ 228

పాడి

అదిగాక సౌభాగ్యమదిగాక వలపు
అదిగాక సుఖమింక నందరికిఁ గలదా ॥పల్లవి॥

ప్రాణవల్లభునిఁ బెడఁబాసి మరుబాణముల
ప్రాణబాధల నెగులుపడుటేఁటి వలపే
ప్రాణేశ్వరుఁడు దన్నుఁ బాయఁజూచిన యపుడు
ప్రాణంబు మేనిలోఁ బాయంగవలదా ॥అది॥

ఒద్దికై ప్రియునితోనొడఁగూడి యుండినపు
డిద్దరై విహరించుటిది యేఁటివలపే
పొద్దువోకలకుఁ దమపొలయలుకకూటముల
బుద్ధిలోఁ బరవశము పొందంగవలదా ॥అది॥

1. చెమట జారనమ్మెడిది. 2. చూపు జవ్వని. 3. సా-రే. లది యిప్పుడెడయకిపుడు, (ఇందంతటను 'చల్లా' అనియే రూపము). 4. ని-తే. పతి వేడుకది యిది. 5. నమ్మెడఁగొన.

చిత్తంబులోపలను శ్రీవేంకటేశ్వరువి
హత్తించి వాఁడు దానయివుండవలదా
కొత్తయిన యిటువంటి కొదలేని సంగతుల
తత్తరము మున్నాడి తగులంగవలదా. ॥అది॥ 229

భూపాళం

ఎట్టు సేయనైన నేర్చు నిందునందు నీతఁడు
నెట్టుకొన్న విద్యలెల్ల నేర్చుఁగాన యీతఁడు ॥పల్లవి॥

పలుదెరఁగుల దొంతులైన పాలపెరుగుకుండలెల్లఁ
దొలఁగ దించి పాలుద్రాగి దొంతివేర్చె నీతఁడు
తొలఁగఁదోసి జగములెల్లఁ దొల్లిటట్ల బహువిధముల
నెలవుకొలిపి దొంతివేర్చ నేర్చుఁగాన యీతఁడు ॥ఎట్టు॥

పాలమీఁగడెల్లఁ దిగిచి పలుదెరఁగులఁ దోడనాడు
బాలులైనవారికెల్లఁ బంచిపెట్టె నీతఁడు
మేలిమైన పాలజలధి మీఁగడఖిలదేవతలకు
నోలిఁబంచిపెట్టినట్టి యోగిగాన యీతఁడు ॥ఎట్టు॥

తలుపుదెరచి కన్నె మేలుకొలిపి విభుఁడు గానివాని
నెలమిఁ గలపినట్టి వేంకటేశుఁడమ్మ యీతఁడు
తలఁపులోని నాగకన్నెఁ దెలిపి పరపురుషునిఁ గూడి
కలయఁ జేయనేర్చినట్టి ఘనుఁడు గాన యీతఁడు. ॥ఎట్టు॥ 230

కాంభోది

వెలినుండి లోనుండి వెలితిగాకుండి
వెలి లోను పలుమారు వెదకేవె గాలి ॥పల్లవి॥

పండువెన్నెలలకును బ్రాణమగు గాలి
నిండుఁగొలఁకులలోన నెలకొన్న గాలి

బొండుమల్లెలతావిఁ బొదవైన గాలి
యెండమావులఁ బోలితేలయ్యీ గాలి ॥వెలి॥

కొమ్మావిచవికెలోఁ గొలువుండు గాలి
తమ్మికుడుకులఁ దేనె దాగేటి గాలి
యిమ్మయిన చలువలకిరవైన గాలి
కుమ్మరింపుచు వేఁడి గురిసేవె గాలి ॥వెలి॥

తిరువేంకటాద్రిపైఁ దిరమైన గాలి
సురతాంతముల జనులఁ జొక్కించు గాలి
తొరలి పయ్యదలలోఁ దూరేటి గాలి
విరహాతురులనింత వేఁచకువె గాలి. ॥వెలి॥ 231

సామంతం

రెప్పవేసి లోకమెల్ల రేయిఁ బగలుఁ జేయనేర్చుఁ
చెప్పరాని చేఁతలెల్ల చెప్పిచూపనేర్చునే ॥పల్లవి॥

పాలలోను దచ్చి వెన్న పలుదెరఁగులఁ దివియనేర్చు
రాలువేసి నీరుమీఁదఁ దేలఁజేయ నేర్చును
గాలిపుంటి సంటి (?) లోనఁ గాఁపురంబు సేయనేర్చు
ఆలికట్టుఁ జీరలోన నాలిఁబడయనేర్చును ॥రెప్ప॥

ముద్దులాఁడికొడుకుచేత ముజ్జగములు దిప్పనేర్చు
చద్దికంట వేఁడికంటఁ జక్కఁజూడ నేర్చును
గద్దెరాతి కొండవింట గసికయై చెలఁగనేర్చు
సుద్దులెల్ల మందులనఁగ సొంపుమిగులనేర్చును ॥రెప్ప॥

పాఁపరేని కొండమీఁదఁ బందివేఁటలాడ నేర్చు
గోపసతుల మానమెల్ల కొల్లలాడనేర్చును
యేపు మీరినట్టి వేంకటేశుఁడనెడివాఁడు పిన్న
పాపఁడై యశోదయెదుట పరువులిడఁగ నేర్చును. ॥రెప్ప॥ 232

బౌళి

ఏమి సోద్యమిది యెంతయును వెరగాయ
ఈ మగువ విభుఁ గలయుటెట్లనో యనుచు ॥పల్లవి॥

పొలసి నునుఁజెమటలుబ్బుచు నణంగుచునున్న
చెలియభావము చూచి చెప్ప వెరపాయ
కలికి వలరాజు బింకపుశరము వాఁడిగా
పలుమరునుఁబదనిడిన భావమో యనుచు ॥ఏమి॥

చలముకొని వేఁడి వెదచల్లు చూపులతోడి
నెలఁతఁ గని కట్టెదుర నిలువ వెరపాయ
చెలఁగి లోపలనున్న చిత్తజానలమెల్ల
వెలికి వెళ్ళుచు వెల్లివిరిసెనో యనుచు ॥ఏమి॥

తిరువేంకటేశుఁ బొందిన యింతిచనుదోయి
కురునఖాంకములు గనుఁగొనఁగ వెరపాయ
తరుణినేఁపిన విధుఁడు దైవయోగమువలన
అరుదయిన శకలంబులాయనో యనుచు. ॥ఏమి॥ 233

71-వ రేకు. కాంభోది

ఏల రాఁడమ్మ యింతిరో వాఁ
డేల రాఁడమ్మ నన్నేలినవాఁడు ॥పల్లవి॥

పచ్చని పులుగుల బండిమీఁద నుండు
పచ్చవింటి పిన్నబాలుని తండ్రి
పచ్చనిచాయలఁ బాయని బంగారు
పచ్చడము గట్టి (న) బాగైనవాఁడు ॥ఏల॥

తెల్లని పులుగుపైఁ దిరుగ మరిగినట్టి
తెల్లని సతిపాలి దేవరతండ్రి

తెల్లని పరపుపైఁ దెలిపొరలువెట్టు
తెల్లని కన్నుల తెలివైనవాఁడు ॥ఏల॥

కొండవింటివాని గుత్తగొనిన యట్టి
కొండుక పాయపుఁ గూఁతురుతండ్రి
కొండలరాయఁడు కోనేటి తిమ్మయ్య
కొండ తలనెత్తి గుఱుతైనవాఁడు. ॥ఏల॥ 234

శ్రీరాగం

చంపరాని పగ (మ ?)[1] నంబు చల్లగాలి వేఁడి చిగురు
టంపకోల దాఁకి దేహమప్పుడెట్లనోర్చెనే ॥పల్లవి॥

పువ్వుటమ్ము దాఁకి చెలికిఁ బొక్కె మేను విభునిచూపు
లివ్వలవలఁ గాఁడినప్పుడెట్లనోర్చెనే
జవ్వనంపుఁ గుచభరము (మున?) జడిసె నడుము కొప్పు వేఁగు
రవ్వదోఁప నడపుచేతి రాయిడెట్లనోర్చెనే ॥చంప॥

తప్పకెపుడు నతనిఁజూచి తనివివోని తరుణి నేఁ
డిప్పుడింత డడవు వాసి యెట్లనోర్చెనే
నొప్పికించుకోర్వలేక నొసలఁబట్టు వెట్టుకాంత
దప్పిదేరునట్టి విరహతాపమెట్లనోర్చెనే ॥చంప॥

ఇంచుకంత కప్పురమున (నెట్టఁ ?) (జారు తనువుమీఁద
నెంచరాని మదనరేఖలెట్లనోర్చెనే
మించి వెంకటాద్రివిభుఁడు మీఁదమీఁదనొరసి కూ (డ
వం ?) చరాని కంటసరులు వనిత యెట్లనోర్చెనే. ॥చంప॥ 235

1. రేకు దెబ్బదిన్నది. అక్షరము స్పష్టముగాదు.

ఆహిరి

ఆపదలె సంపదలకాధారమై తోఁచె
పైపైనె తమకంబె పరిణామమాయ ॥పల్లవి॥

పురిగొన్న మదనాగ్ని పుటము దాఁకినవలన
తరుణిదేహంబు కుందణమువలెనాయ
సురుగక వియోగాగ్ని చొచ్చి వెలువడెఁ గాన
మరుజన్మమై మహామహిమఁ బొగడొందె ॥ఆప॥

పొలుపైన యిరు (విరు?) లచేఁ బూవుగట్టిన వలన
సొలయకే మేను జాజుల పొట్లమాయ
నెలకొన్న గొజ్జంగనీటఁ దడియఁగఁబట్టి
కలకంటిమేను పులు గడగినట్లాయ ॥ఆప॥

అందుపైఁ దిరువేంకటాద్రీశు నిజకృపా
నందంబు తనకు బ్రహ్మానందమాయ
పొందైన వేడుకలు పొదిగొన్న చెలువంబు
నందమయి సౌభాగ్యమగ్గలంబాయ. ॥ఆప॥ 236

సాళంగనాట

తనువెల్లఁ గోమలము తలఁపు వెగ్గలమాయ
వనితభాగ్యము గంటివా తరుణి ॥పల్లవి॥

హోఁకలంతేసి ముత్యముల కంటసరులవి
వేఁకపు గుబ్బలమీఁద వేఁగుఁగాక మానునా
కాఁకల నడుము చిక్కెఁగదె గోరుచుట్టుపై
రోఁకటిపోటాయసమ్మరో తరుణి ॥తను॥

ముమ్మడించినట్టి పెద్దముగపుల మొలనూలు
యిమ్మైన పిరుఁదుమీఁద నింతభారమేఁటికే

బొమ్మరపోయెడి నవ్వులఁ బూఁటకూటిమీఁదఁ
చమ్మ వుమియఁగాదా తరుణి ॥తను॥

సరసరూపవిలాసముల నింతికి నెందు
తిరువేంకటాచలాధిపుఁడెట్ల నిచ్చెనే
అరిదిబంగారునకు నపురూపమగుమణి
దొరకినట్లాయఁ గాదో తరుణి. ॥తను॥ 237

ముఖారి

ఎవ్వరు గలరీతనికిఁక నేమిటికిని వెరవకు మన
నెవ్వరుగలరాత్మరక్ష యేప్రొద్దునుఁ జేయను ॥పల్లవి॥

పసిబాలకు బండివిరిగి పడి మేనెల్ల నొచ్చెను
కసుగందుకు నీరుపాముకాటున మై గందెను
నసికొట్లఁగోడెచేత నరుమాయను శిశువింతయు
వసముగాని చను ద్రావినవలనఁ బాపఁడు వాడెను ॥ఎవ్వరు॥

పెనుమాఁకులపైపాటున బెదరి వెరచెఁ బిన్నవాఁడు
ఘనమగు సుడిగాలి దాఁకి కనుమూయనోపఁడు
అనువున వెంకటగిరిపై నన్నిసంకటములుఁ బాసి
మునిజనముల(హృదయ?)గేహముననుండెడి దేవుఁడు.॥ఎ॥238

ముఖారి

ఎంత నేరఁడీదైవమిందరికి
భ్రాంతి గడుఁ బుట్టించి పరము మరపించె ॥పల్లవి॥

ప్రాయమనియెడి మహాబహురూపమిది యొకటి
కాయములఁ గరఁగించీఁ గళలనెక్కించి
సోయగంబగు కన్నుచూపులనియెడు మహా
మాయములఁ బొరలించి మనసు నాటించె ॥ఎంత॥

చక్కఁదనమనెడి వేషంబొకటి మేనిపై
నెక్కించి యది గోర్కెనెలవుగాఁజేసి
తక్కువలు నెక్కువలు తమకములు నొల్లములు
మక్కువలు గలిగించి మల్లువెనఁగించె ॥ఎంత॥

ఇట్టి మోహము వేంకటేశ్వరుఁడు దనమీఁదఁ
బెట్టించుకొనె నయినఁ బ్రేమగల ఫలము
నెట్టుకొని తానతని నిజమెఱిఁగి మేలు చే
పట్టెనై నను జన్మపరుఁడైన ఫలము. ॥ఎంత॥ 239

72-వ రేకు. భైరవి

పుడమిలోన మగలు గలుగు పొలఁతులకును దిరుగఁబాసె
అడవివారినుండనియ్యఁడమ్మ నీ కొమారుఁడు ॥పల్లవి॥

భారమైన కుచభరంబుపై చెరంగు జారనొకతె
జారుఁజూపులాఁడి మంచిసొగంపు పెయఁగున
కోరా చల్లయనుచు మెరుఁగుగుచములదర మెట్టినడవ
గోరుదీసి పారితెంచె కొమ్మ నీ కుమారుఁడు ॥పుడమి॥

నెరులు దొంగలించినట్టి నీలవేణి యొకతె పెద్ద
తురుము దురిమి చల్లకడవతో విలాసముమరఁగా
చెరఁగుదూల వాఁడిగోళ్ళ చేయివీచి పిలిచి గోప[1]
తరుణిఁ గొంగువట్టి తీసె తల్లి నీ కుమారుఁడు ॥పుడమి॥

కంచుమట్టియల రవంబు గజబజింపఁ బచము దా
టించి గబ్బిసడపు నడచు మించుగుబ్బలాఁడిని
ఇంచుకంతవాఁడు వేంకటేశుఁడంటఁబట్టి కౌఁగి
లించి మోవి గంటిసేసె నిపుడు నీకుమారుఁడు. ॥పుడమి॥ 240

1. ని-రే. ౹౩. నడచు గోప.

శంకరాభరణం

కొలమున మొదలనె[1] గొల్లవారము యీ
చలమునఁ బగ నిన్ను సాధించ నేరుతుమా ॥పల్లవి॥

బూతులఁ దిట్టుచు బొలపులఁ జూచేవు మేని
నేతులకంపుల నేము నీ కేలరా
యేతులు చేఁపుచు మమ్ము నెలయించేవు యేర
మాతోనే యింతేసి నేము మాటలు నేరుతుమా ॥కొల॥

కన్నుల సద్దలింపుచు గయ్యాళించేవు వోరి
నిన్ను మెప్పించఁగలేము నేమేలరా
వెన్నలుఁ బాలునమ్మేటి వెఱ్ఱివారము యీ
కన్నెర మిట్ల[2] గిలిగించఁగ నేరుతుమా ॥కొల॥

చేరి నన్నుఁ బోసపవి చేయివట్టేవు యేమీ
నేరనివారము నీకు నేమేలరా
గారవపు తిరువేంకటగిరివిభుఁడ[3] యీ
కూరిమినిట్టే నిన్నుఁ గూడఁగ నేరుతుమా. ॥కొల॥ 241

శ్రీరాగం

ఊరకుంటే[4] నన్ను నుండనియ్యవు ఇంత
పేరుకుచ్చి తిట్ట నన్నుఁ బ్రియమా నీకు ॥పల్లవి॥

బుజముపైఁ జేయివేసి బుజ్జగించేవు ఇంత
నిజమా నామీఁద నీకరుణ
భజన మెరయ నన్నుఁ బచ్చి సేసేవు ఇంత
గజరుఁజేఁతలకోపఁగలనా యిఁకను ॥ఊర॥

---

1. వి-రే. ౩. మొదలే. 2. ౯౩, ౩. మీంట్ల. 3. కటవిభుఁడ. 4. వి-రే. ౩౮. ౧౦౯. కుందేనంటే.

కాలుమీఁదఁ గాలువేసి కరఁగించేవు యింత
మేలా నాతోడి సమేళములు[1]
వాలుఁజూపుల నాకు వాఁడిపెట్టేవు యింత
యేలికవై యిటు సేయనేలా యిపుడు ॥ఊర॥

చక్కఁదనమిది నాది చట్టిసేసేవు నా
చెక్కుల రేకలు వ్రాయఁ జిత్తగించేవు
చక్కని వేంకటగిరిస్వామి నీవు యిట్టే
చక్కఁగ నన్నింత సేయఁ దగునా యిఁకను. ॥ఊర॥ 242

నాఁట

నల్లనిమేని నగవుఁ జూపులవాఁడు
తెల్లనికన్నుల దేవుఁడు ॥పల్లవి॥

బిరుసైన దనుజుల పీఁచమణఁచినట్టి
తిరుపుఁగైదువతోడి దేవుఁడు
పరిఁబడ్డ జగమెల్లఁ జక్కఁజాయకుఁ దెచ్చి
తెరువు చూపినట్టి దేవుఁడు ॥నల్లని॥

నీటఁ గలసినట్టి నిండిన చదువులు
తేటపరచినట్టి దేవుఁడు
పాటిమాలినట్టి ప్రాణుల పరితపు
తీఁట వాపినట్టి దేవుఁడు ॥నల్లని॥

గుఱుతు వెట్టఁగరాని గుణముల నెలకొన్న
తిరువేంకటాద్రిపై దేవుఁడు
తిరముగ ధ్రువునికి దివ్యపదంబిచ్చి
తెరచి రాజన్నట్టి దేవుఁడు. ॥నల్లని॥ 243

1. తోడి మేళములు.

భైరవి

అతనుచే నెట్టయిన నౌదుఁగాక యీ
గతిమాలి సొలసే కాయము నాకేఁటికే ॥పల్లవి॥

దానసేసి యైనఁ గొంత పట్టలేను చిత్తము
దోసము మాటాడఁ దనతో నాకును
ఆసలాఁపలేక చేరి యంటిఁ[1] గాక యింత
సేసిన యాతనిమోము చెల్లఁదో నేఁజూతునా ॥అతను॥

దగ్గరి నావద్దఁ దనతపణిఁ ఎలఁచినంత
సిగ్గువడవలెను నాచిత్తమునందే
నిగ్గుదేరేకాఁకతోడ నిలువలేఁ గాక యింత
బగ్గన నాదేహమిది పారవేయ సర్లకా ॥అతను॥

దేవుఁడంటాఁ దనమీఁద తెగి సొలపుమాటల
మోవనాడలేక యింతమొక్కితిఁ గాని
శ్రీవేంకటేశుఁడింత చిత్తిణివిద్యల నాతఁ
దేవంకకేఁగినను మాయింటికి విచ్చేసెఁ గా. ॥అతను॥ 244

శంకరాభరణం

ఉయ్యాలా బాయనూఁచెదరు కడు
నొయ్య నొయ్య నొయ్యనుచు ॥పల్లవి॥

బాలయవ్వనలు పసిఁడిపుయ్యాల
బాలునివద్దఁ బాడేరు
లాలి లాలి లాలి లాలెమ్మ యెల్ల
లాలి లాలి లాలి లాలనుచు ॥ఉయ్యా॥

1. ఇది పె-రే; వి-రే. ౩౯. పాఠము; సా-రే. చెలియంటేఁగాక...

తమ్మిరేకుఁ గనుఁదమ్ముల నవ్వుల
పమ్మఁజూపులఁ బాడేరు
కొమ్మలు మట్టెల గునుకులి[1] నడవుల
ధిమ్మి ధిమ్మి ధిమ్మనుచు[2] ॥ఉయ్యా॥

చల్లఁజూపుల జవరాండ్లు రే
పల్లెబాలునిఁ బాడేరు
బల్లిదు వేంకటపతిఁజేరి యందెలు
ఘల్లు ఘల్లు ఘల్లనుచు. ॥ఉయ్యా॥ 245

73-వ రేకు. శంకరాభరణం

సారెకు నంటకురే జడనందురు
యేరుఁడాతఁడుస్నతప్పు దేహియట ॥పల్లవి॥

బాయిటఁ బెట్టకురే పక్షులు పారెడిపొద్దు
వోయమ్మ బాలులకు నొప్పదందురు
మాయపుఁబులుగొకటి మచ్చికసేబాలుని
చేయిచ్చి యెక్కించుకొనఁ జేరీనట ॥సారె॥

పంచలఁ దిప్పకురే పాములు వెళ్ళేటి పొద్దు
కొంచెపుబాలులఁ బైకొనునందురు
మించిన పామొకటి మెరసి యీ బాలుని
దించక యెక్కించుకొనఁ దరిగీనట ॥సారె॥

అలమి పట్టకురే అంటఁ గాకుండెడివారు
తొలరమ్మ బాలులకు దోసమందురు
కలికి యీ తిరువేంకటపతిఁ గదిసిన
చెలఁగి వేగమే చీరచిక్కీనట. ॥సారె॥ 246

1. వి-రే. ౫౨. మట్టెలుగులుకుల. 2. దిమ్మి దిమ్మి దిమ్మనుచు.

శ్రీరాగం

కొప్పుతావి సారెసారె కుప్పళించవలసి
అప్పటి నీమాయమొగమయ్యేవాతనికి ॥పల్లవి॥

భారపు నీగుబ్బల సంపద చూపవలసి
వోరగా నొరసుమీఁద నొరగేవు
తోరపు నీకన్నుల యేతులె చూపవలసి
సారెకు చూపులఁ బగచాటేవాతవిని ॥కొప్పు॥

తట్టెడి నీమట్టెలమోఁతలు చూపవలసి
పట్టఁబట్టఁగానే వుప్పరిగెక్కేవు
వట్టి నీకోపాన చెలువము చూపవలసి
పెట్టినహారముల గుంపెనలఁ దీసేవు ॥కొప్పు॥

తొయ్యలి నీమేని మృదువు చూపవలసి
కయ్యపు వేంకటపతిఁ గాఁగిలించేవు
చయ్యననే నీ సరసము చూపవలసి
చయ్యాటములనె యిట్టె జంపులనేచేవు ॥కొప్పు॥ 247

ఆహిరి

కాల (లి ?) కడఁ దెగెఁ జెలియగర్వంపుఁ దాలిములు
కాలగతి యిఁకనెంత గాఁగలదొ మీఁద ॥పల్లవి॥

బలువుఁ దురుమరజాతి పగలుచీఁకట్లాయె
పొలయుఁగన్నీట నిప్పులు గురిసెను
చలితాపమున శశియు సవితుండుఁ గవఁబొడచె
ఇల మదనదైవికంబెట్టుగాఁ గలదొ ॥కాల॥

చెడుగు నిట్టూరుపుల చిచ్చు గాలియుఁ గూడె
వెడగుఁ జెమటల[1] జలధి వెల్లివిరిసె
కడుఁబులకలనె శిఖిలి కన్నచోటనె పొడమె
నుడిసి చెలిసిగ్గెల్ల చూరఁబోఁగలదో ॥కాల॥
భామకుచములమీఁదఁ బ్రతిచందురులు వొడచె
చీమ దొంతర లతలఁ జిగిరించెను
వామాక్షి వేంకటేశ్వరుకౌఁగిటను గలసె
ప్రేమమిఁక నిదియెంత పెద్దగాఁగలదో. ॥కాల॥ 248

శ్రీరాగం

ఇచ్చకాలు రమణికి నెంత[2] చేసేవు నీ
ముచ్చిమిసేఁతలివ్నియు మూసేటి కొరకా[3] ॥పల్లవి॥
బెట్టుగఁ బెద్దతురుము పెట్టేననుచు నింతి
తట్టుపుణుఁగునెరుల తలదువ్వేవు
గట్టిగ నెవ్వతెఁ గూడో కౌఁగిటఁదెచ్చిన నీ
తట్టుపుణుఁగుల తావి దాఁచేటికొరకా[4] ॥ఇచ్చ॥
గబ్బివై[5] నీపదకము గట్టేననుచుఁ జెలి
గుబ్బల మించుఁజెరఁగుకొంగు దీసేవు
వుబ్బున నెక్కడనో వుండి నీవిదె వచ్చిన
దెబ్బలవాట్ల తప్పు దీరేటికొరకా ॥ఇచ్చ॥
ఇప్పుడిట్లనే విడెమిచ్చేననుచు నీవు
కప్పురము ఘనముగఁ గడునిచ్చేవు
అప్పుడె శ్రీ తిరువేంకటాద్రీశ యీ యింతి
చొప్పుదప్పు రతిఁగూడి చొక్కించుకొరకా. ॥ఇచ్చ॥ 249

---

1. ఇది ని-రే. ౨౧. పా; సా-రే. పెడఁజెమటల .2. ని-రే. ౪౪. నెంతేఁజేసే. 3. కొరకే (ఇట్లేముందు చరణములందును). 4. సా-రే; పె-రే. ౨౫. కొరక. (ముందెల్ల నిట్లే). 5. ని-రే. గబ్బివే.

ఆహిరి

వద్దు మమ్మింత నెవ్వగల నలయించ నిటు
పొద్దువొద్దునకు నోపుదుమా వోరి ॥పల్లవి॥

బీరమున నిన్ను[1] వలపించుకొన నేమంత
వారమా వట్టిగరువములు గాక
నేరుపే కలిగినను నీచేఁతలకు నింత
మారుచును క్రాఁకఁగందుదుమా వోరి ॥వద్దు॥

కన్నులనె వలపు చియకఁగఁ జూడ నేమంత
కున్నారమా నీవుడుటు గాక
వన్నెలను[2] నిన్ను నేవలపింతునైన నీ
వున్నవిధమిటు చూడనోర్తుమా వోరి ॥వద్దు॥

నీ నేరములు దక్కె నీకు నిన్నుఁబాయఁగల
నైన నేనిట్టవుదు నటరా
కోనేటిరాయ తక్కుల్లుమాని మచ్చికల
నూని నాకౌఁగిటనె వుండరా వోరి. ॥వద్దు॥ 250

శ్రీరాగం

మామసునేతు మాగతవానసి[1]
కాముకవిద్యాకల చలరే ॥పల్లవి॥

ఖిల్లవధూకుచపీడన కుతుకో
త్ఫుల్లకరాంబుజ భూషణ
పల్లవ గోపక పరివృత శరజన
వల్లభ రతిపరవశ చలరే ॥మామ॥

1. ని-రే-ళళ, నన్ను. 2. వెన్నెలను. 3. ఊహింపిన పాఠమిది; స్వా-రే-, పె-రే-, మామనురేత్వం మాగదవానసి; ని-రే. ౧౮. మామనురేతుమాగద.

గోపీజన కుచకుంకుమ పంక వి
లేపన మిళిత లలితదేహ
తాపకరణ సంతత బహువినయా [1]
లాప రూపమేళన చలరే ॥మామ॥

పరవసితామణి పరతంత్రత్వా
త్పరుష నఖాంకిత పతిరసికిమ్ [2]
కురవకభూరుహ [3] కుంజగృహంతే
తిరువేంకటనగాధిప చలరే. ॥మామ॥ 251

74-వ రేకు. శుద్ధదేశి

కానరటె పెంచరటె కటకటా బిడ్డలను [4]
నేను మీవలెనే కంటి నెయ్యమైన బిడ్డని ॥పల్లవి॥

బాయిటఁ బారవేసిన పాలు వెన్నలును
చేయివెట్టకుందురా చిన్నిబిడ్డలు
మీయిండ్లు జతనాలు మీరునేసికొనక
పాయక దూరేరేలే ప్రతిలేని బిడ్డని ॥కాన॥

మూసిన కాఁగుల నేయీ ముంగిటి పెరుగులూ
ఆసపడకుందురా ఆడేబిడ్డలు
వోసరించి మోసపోక వుండలేక మీరు
నేసేరింతేసి దూరు చెప్పరాని బిడ్డని ॥కాన॥

చొక్కమైన కొప్పెరలజున్నులు జిన్నలును
చిక్కిన విడుతురా చిన్నిబిడ్డలు
మిక్కిలి పూజలు నేసి మెచ్చించఁ దగదా
యెక్కువైన తిరువేంకటేశుఁడైన బిడ్డని. ॥కాన॥ 252

1. ని-రే. ౧౮. వినయవిలాప. 2. పరవనితాదిప పరతంత్రత్వం పరుషతలాంబుజపై రసికిం. 3. కురవనిచారుహ. 4. ని-రే. ౩౬. బిడ్డల నేను.

కాంభోది

పేగుల జంద్యాలు వేసి పెంచపునమలిపురి
పొగగాఁ జుట్టిన నాబాఁపనయ్య వీఁడివో ॥పల్లవి॥

బిత్తలై పరువులిడి పిన్నబోడితలతోడ
కొత్తబొమ్మచారియై గోచిగట్టెను
నెత్తురుదానముసేసి నిండిన జడలతోడ
బిత్తుఁడైన చక్కని నాబాఁపనయ్య వీఁడివో ॥పేగు॥

కఱవిద్యబాఁపనిచేఁ గఱచె సేరుపులెల్ల
గుఱుతుబాఁపనిఁ గనెఁ గొడుకుఁగాను
తఱితోడ సందెపొద్దు దప్పనీక జలధిలోఁ
బఱపుగాఁ బండిన నాబాఁపనయ్య వీఁడివో ॥పేగు॥

పచ్చియిఱ్ఱి తోలుచొచ్చి బడలి చొరనిచోటు
చొచ్చి తెచ్చె వేదాలు చూడరమ్మా
మచ్చిక వేంకటగిరి మరిగి నాకొఁగిట
పచ్చనిదోవతి నాబాపనయ్య వీఁడివో. ॥పేగు॥ 253

సామంతం

ఏకాలమేది దనకెట్ల సుఖమైయుండు
నాకాలవశతఁ దానట్లుండవలసె ॥పల్లవి॥

బలువియోగాగ్ని దలఁపంగ నెట్టిదొకాని
చలిగాలి యెండనుచు జాలిఁ బడవలసె
వలరాజుకోపమెటువంటిదో పడఁతులకు
తలిరాకు చేఁదనుచుఁ దలపోయవలసె ॥ఏకా॥

ఘావంబు తలపోఁత బలిమెట్టిదోకాని
నోవి దోఁపనిచోట నొచ్చెననవలసె

ఈ విరహపరితాపమిఁకనెట్టిదో కాని
కోవిలల కూఁతలకుఁ గోపించవలసె ॥ఏకా॥
తిరువేంకటేశుకృప తియ్యమెట్టిదో కాని
చిరునవ్వు మోవిపైఁ జెరలాడవలసె
సురతసౌభాగ్యముల సొంపులెట్టివో కాని
మురిపెంపుఁ గనుచూపుముయ్యఁగావలసె. ॥ఏకా॥ 254

శంకరాభరణం

అప్పఁడు మజ్జనమాడీసంగనఁ గూడి
కుప్పలుఁ దెప్పలుగాఁ గుమ్మరించరో ॥పల్లవి॥
బంగారుకొప్పెరల పన్నీరు నించి
రంగైన పచ్చకప్పురపు ధూళొత్తి
చెంగటఁ గస్తూరిధూళి చికిలి గావించి
పొంగారుఁదట్టుపుణుఁగు పోయరో గిన్నెలను ॥అప్ప॥
పటికంపుఁ గాఁగుల పరిమళాలెల్లా
ఘటియించి కుంకుమతోఁ గడు మేదించి
అటునిటు గొజ్జంగనీరందంద నించి
కుటిలకుంతలులు[1] పైఁగుమ్మరించరో ॥అప్ప॥
బలుపింగాణులఁ గదంబము గంధమును
కలపము గావించి గంబూరముతో
వెలయ మజ్జనమాడీ వేంకటాద్రివిభుఁడు
చెలఁగి యింతులు చేరి సేస చల్లరో. ॥అప్ప॥ 255

ఘూపాళం

కలిమి నిందరిని దగ్గరుకొరకే - వీఁడె
సులభుఁడై తిరిగీని చూడరమ్మా ॥పల్లవి॥

1. పె-రే. ౨౫. కుంతలుపై.

భంగపెట్టి గొల్లవారి పాలువెన్నలు
దొంగిలించు కొరకే తోవలనెల్లా
చెంగలించి చేతులెత్తి చెలఁగుచును - వీఁడె
దొంగి దొంగి తిరిగీని తోలరమ్మా ॥కలిమి॥

గుట్టుదీర రేపల్లెకొమ్మలనెల్లా
రట్టుసేయుకొరకే రచ్చలనెల్ల
గట్టిగాఁ జాటెడి మొలగంటలతోడ - వీఁడె
చుట్టపుబాలునివలెఁ జూడరమ్మా ॥కలిమి॥

చెప్పరాని తనమాయచేత నిందరినిఁ
గప్పెడికొరకే వేంకటవిభుఁడు
కప్పెడి నల్లనియలకలనుదురు - వీఁడె
గుప్పెడి ముద్దులు యెత్తుకొనరమ్మా. ॥కలిమి॥ 256

ఆహిరి

వలతునందువు నాకు వడినెప్పుడును నేఁ [1]
డెలమి నొకచో భావ [2] మెట్లుండె నీకు ॥పల్లవి॥

బరపైన మదనతాపంబునకు వెరవకిటు
పురవేదనలను [3] నేఁబొరలఁగాను
సరసమున నీవచట సతులకౌఁగిటనుండి
యిరవుకొననపుడు [4] మనసెట్టుండె నీకు ॥వలతు॥

వదలిన తురుముతోడ వాడువదనముతోడ
వాదిగినేనిటు చింతనుండఁగాను
సదమదముగాఁగ నొకసతిని గౌఁగిటి రతులఁ [5]
గదియంగఁ జిత్తమేగతి నుండె నీకు ॥వలతు॥

---

1. ని-రే. ౬౩. నెపుడును - యెల. 2. చోఁబాదమెట్టు. 3. దన నలను. 4. కొని నపుడు. 5. సతికౌఁగిటను రతుల.

జమలి మొలనూళ్ళతో జవ్వాదిమేనితో [1]
నమరి యీరీతి నేనలరఁగాను
కొమరొందఁ గూడితివి కోనేటిరాయ నీ
తమకమెందాఁక [2] నెంతటినుండి నీకు. ॥వలతు॥ 257

75-వ రేకు. ముఖారి

చెప్పరాదీయింతి సిరులు - దీని
వొప్పులిన్నియుఁ జూడ వొరపులోకాని ॥పల్లవి॥

ముదితజఘనముమీఁది మొలనూలిగంటలవి
కదలు రవమెట్లుండెఁ గంటిరే చెలులు
మదనుఁడుండెడి హేమమందిరము దిరిగిరాఁ
గదిసి మ్రోసెడి పారిఘంటలో కాని ॥చెప్ప॥

కొమ్మపయ్యెదలోని కుచమూలరుచి వెలికిఁ
జిమ్మటది యెట్లుండెఁ జెప్పరే చెలులు
యిమ్మైన మరుధనములెల్ల రాసులు వోసి
కమ్మకొని చెంగావి గప్పిరో కాని ॥చెప్ప॥

నెలతకంఠమునందు నీలమణిహారములు
అలరుచెట్లుండు [3] కొనియాడరే చెలులు
లలితాంగి ప్రాణవల్లభుఁడు వెంకటవిభుఁడు
నెలకొన్న కౌఁగిటనె నిలిచెనో కాని. ॥చెప్ప॥ 258

ఆహిరి

మాననీఁడు పుంటినోవి మరఁది వీఁడే
మానముపైఁ జేయి చాఁచీ మందవారిమరఁది ॥పల్లవి॥

1. పూఁతతో. 2. సా-రే. మిందాఁక. 3. ని-రే. ౧౧౪. పెట్లుండెఁగాని.

మంచమెక్కి వావిచూచీ మఱఁది వీఁడే
మంచినీటి చెలమల[1] మఱఁది
మంచు గుంచానఁ గొలిచే[2] మఱఁది వీఁడే
పించెపు శిరసు పొగ పిన్ననాఁటి మఱఁది ॥మాన॥

మంద మిరియాలు చల్లే మఱఁది వీఁడే
మందు సూరీ మాటలనే మఱఁది
మందుమాయ సేఁతల మఱఁది వీఁడే
కుందణపు వన్నెదట్టికొంగు జారే మఱఁది ॥మాన॥

మక్కళించే వలపుల మఱఁది వీఁడే
మక్కువ నాకౌఁగిట మఱఁది
మక్కువలఁ గరఁగించే మఱఁది వీఁడే
చిక్కె వేంకటాద్రిమీఁది చిన్ననాఁటి మఱఁది. ॥మాన॥ 259

సామంతం

చెలువపు సేఁతల శిన్నెకా[3] పెద్ద
వలపువేదనల వాడీనయ్యో ॥పల్లవి॥
మొగమునకెగరెడి మొనవాఁడి గుబ్బల
చిగురుఁబెదవులాఁడి శిన్నెకా
నిగనిగ మెరిచేటి నీలిమేనివాని
సొగసు చూచి వాని సొలశీనయ్యో ॥చెలు॥

మొగ్గల మొలకల మురిపెపుఁ గన్నుల
శిగ్గుల చిరునవ్వు శిన్నెకా
ఉగ్గున రేపల్లె వుసురు గొనేటివాని
దగ్గరి తమకానఁ దడవీనయో ॥చెలు॥

1. ని-రే. ౬౩. చెలమెల. 2. మంచుమాయసేఁతల. 3. ని-రే. ౧౦. సిన్నెక్క.
(ఇక్లేముందును).

చంకల బంగారు చల్లిన మెఱుఁగుల
చింకబెదరులాఁడి శిన్నెకా
వెంకటపతిఁ గూడి వేడుక తోడుత
సుంకుల సోగల సొలశీనయ్యో. ॥చెలు॥ 260

శ్రీరాగం

మరుని నగరిదండ మాయిల్లెఱఁగవా
విరుల తావులు వెల్లవిరిసేటి చోటు ॥పల్లవి॥

మఱఁగు మూఁక చింతల [1] మాయిల్లెఱఁగవా
గుఱుతైన బంగారుకొండల [2] సంది
మఱపుఁ దెలివి యిక్క మాయిల్లెఱఁగవా
వెఱవక మదనుఁడు వేఁటాడేచోటు ॥మరు॥

మదనుని [3] వెదసంత మాయిల్లెఱఁగవా
చెదరియు [4] జెదరని చిమ్మఁ [5] జీఁకటి
మదిలోన నీవుండేటి మాయిల్లెఱఁగవా
కొదలేక మమతలు [6] కొలువుండేచోటు ॥మరు॥

మరులుమ్మెతల [7] తోఁట మాయిల్లెఱఁగవా
తిరువేంకటగిరిదేవుఁడ నీవు
మరుముద్రల వాకిలి [8] మాయిల్లెఱఁగవా
నిరతము నీ సిరులు నించేటిచోటు. ॥మరు॥ 261

ఆహిరి

ఎందాఁకా జాగిది [9] యేలే - తన
అందములచటనె [10] అయ్యీఁగాక ॥పల్లవి॥

---

1. ని-రే. ౧౦౫. చింతల్లంమా. 2. కొండల్ల. 3. మదనున్ని. 4. చెదరియ్యు. 5. ని-రే. ౧౧౫. చిమ్మఁ. 6. ౧౦౫. మదనుఁడు. 7. తల్ల. 8. వాకిల్లి. 9. ని-రే. ౧౦. జారిది. 10. సా-ఠీ. అచ్చటనె.

మృగమదమితఁడు మెత్తినిదె మై[1]
ధగధగమనఁగాఁ దనకేలే
మగువకుచముల చెమట[2] నంటిన యా[3]
పొగరుఁబరిమళమె పూసీఁ గాక ॥ఎందా॥

బెడిదపుఁ దురుమిదె పెట్టీనీతఁడు
తడవుగ నలరులు తనకేలే
పడఁతి శిరసునసు పైపైఁ జెరిగిన[4]
జడివాన విరులు జారీఁ గాక ॥ఎందా॥

చిమ్ముచు వీడెము నేసీనీతఁడు
తమ్ములముమియఁడు తనకేలే
కొమ్మ వీడెమిఁక[5] కోనేటప్పఁడు
తమ్మివదనమున దాఁచీఁ గాక. ॥ఎందా॥ 262

శ్రీరాగం

బిగ్గెఁ గాఁగలించుకోవే పిరితీయక
నిగ్గుల యాతనిమేను నేఁడే నొచ్చీనా ॥పల్లవి॥

మందరమెత్తినవాఁడు మల్లుల మొత్తినవాఁడు
అందపు నీ గుబ్బల వేఁగాన[6] లేఁడా
గొందినున్న కుచములు కొనవాండ్లైతేను
చెందిన యాతనిమేను చిల్లులయ్యీనా ॥బిగ్గె॥

భూమెల్ల మోఁచినవాఁడు పొడవు దాఁచినవాఁడు
భామ[7] నీ మొలనూలు భారమనీనా
వోమక యాతనితోడి వుపరిసురతానకు
యేమని వేఁడుకొనిన యేల లోఁగేవే. ॥బిగ్గె॥

1. ని-రే. ౧౦. త్తినూరకె. 2. చెమ్మటల. 3. ని-రే. ౬౩. నంటినయ్యా. 4. ౧౦. పైరాలెడు. 5. విడియమిదె. 6. ని-రే. ౯, ౧౧౩. గానఁగలే. 7. ని-రే. ౯, ౧౧౩. భామిని నీ.

వెంకటనగమువాఁడు వెన్నెలమొగమువాఁడు
కింకల నీ చేఁతలకుఁ గిందుపడీనా [1]
పంకజవదన నీకుఁ బాయలేక చెనకిన
కుంకుమగుబ్బల చెనకులకోపఁడా. ॥బిగ్గ॥ 263

76-వ రేకు. దేశాక్షి

అవ్వలిమాటలే హితవవుఁగాక
రవ్వలై నీకింక నింద రాఁదీరునా ॥పల్లవి॥

పందలించి పథురలో మగువల మాటలే
విందుగాక చెవులకు విందులుగాను
మందల మగువల మా మాటలు చెవులకు గో
విందుఁడా మాసుద్దులిఁక వినఁదీరునా ॥అవ్వ॥

వాసనగాఁ బువ్వులింటివారితోడి పొందులే
సేసి నీవు మమ్ము నీవు చెనకే వింక
దోసాలు గావుగద మాతోడి పొందులివి శ్రీని
వాసుఁడా మా చేఁతలను వడదీరునా ॥అవ్వ॥

మాయలు మందులుసేసే మానినుల పొందులే
రేయుఁబగలును నీకు రేసులుగాక
పాయక కూడితి నన్ను బాపురే వేంకటగిరి
రాయఁడా మాకౌఁగిటి రట్టుకోపుదా. ॥అవ్వ॥ 264

శంకరాభరణం

ఇంతి భువనమోహినియైన ఫలము
కాంతునిఁ దలఁచి వగలఁ జిక్కెనిపుడు ॥పల్లవి॥

1. అంకెల నినుఁగూడుట అరుదా నేఁడు (సా-రే. లో ఈ పాఠమే కాఁబోలు మొదలు వ్రాసి గీచివేసి పైపాఠము చెక్కినట్లున్నది).

మెఱుఁగుఁదకన్నులు గండుమీలైన ఫలము
తొలఁకురెప్పల నీరు దొరకె నేఁడు [1]
లలనమై నవపుష్పలతయైన ఫలము
వలపు చెమట నీట వడిఁ దోఁగె నిపుడు ॥ఇంతి॥

మెఱుఁగారు నెరులు తుమ్మెదలైన ఫలము
నెఱిఁ దమ్మిమోముపై నెలకొన్నవి
పఱచు జక్కవలు గుబ్బలైన ఫలము
తొఱలి తాపపురవితోఁ గూడె నిపుడు ॥ఇంతి॥

పలు (బలు ?) వన్నెమోవి బింబమైన ఫలము
చిలుక వోట్లచేతఁ జెలువొందెను
కలికి వేంకటపతిఁ గలసిన ఫలము
నొలసినాడనె [2] నిత్యసుఖమబ్బె నిపుడు. ॥ఇంతి॥ 265

ఆహిరి

ముచ్చటకెవ్వరు లేరు మోహమిది బలుదూఱు
యెచ్చట నెవ్వరులేరు యేఁటికే నాపేరు ॥పల్లవి॥

మంచముపై నుండరాదు మలఁగుపైఁ బొద్దువోదు
నించిన వుయ్యాలలోనా నిద్దుర రాదు
అంచెలఁ గన్నుల నీరు ఆఁపరాదాతనిఁ బాసి
యించుకంత నిలువలే నెట్లు ధరియింతునే ॥ముచ్చ॥

పవ్వళించేటిల్లు చూచి ప్రాణము నిలుపరాదు
దివ్వెచూచి తాలిమైనఁ [3] దిప్పఁగరాదు
దువ్వటపుఁబయ్యదపైఁ దోఁగిన తట్టు పుణుఁగు
పువ్వటమ్ము బాసటమై పొక్కేనేమి సేతునే [4] ॥ముచ్చ॥

1. ని-రే. ౭౫, ౮౫. దొలఁకెనిందు. 2. సొలసి యాడనె. 3. ఇది ని-రే. ౧౦౨. లో. సా-రే. తాలిమై దిప్ప. 4. ని-రే. సేతుమే.

చింతతో ధరించరాదు చెల్లఁబో మేనైనఁ బోదు
ఇంతటఁ జెలులకైన యెఱుక లేదు
ఇంతలోనె వేంకటేశుఁడింతి మఱఁగుననుండి
యెంతసేసెఁ గలికి వీఁడేమని చెప్పుదునే. ॥ముచ్చ॥ 266

మేఁచబౌళి

శిన్నెక తేవే శెలువుని తా
వెన్నలు సవిగొను వెన్నుని తా ॥పల్లవి॥

మూటల్ మాటల్ మూరల్ బారల్
పాటల్ సదివే బాపలు తా
వేటల్ వీపుల్ వేలుపు గుడుపుల్
తేటలు మరిగిన దేవుని తా ॥శిన్నెక॥

వాకుల్ చీకుల్ వాదుల్ పోదుల్
పోకపు తొల్లిటి సుద్దుల్ తా
పోకులు లోకుల్ పొగడఁగ మనిపెడి
కేకిగరుల తల కిష్టుని తా ॥శిన్నెక॥

బగ్గుల్ నగ్గుల్ బావుల్ సొరె (ర ?) గా
దగ్గర వెరపగు తపసుల తా
సిగ్గుల్ వాపెడి శ్రీ వెంకటపతి
నగ్గపు సొమ్ములయాతని తా ॥శిన్నెక॥ 267

ముఖారి

భావమెరఁగని పడుచా వోసి
పోవే పోవే పోవే పడుచా ॥పల్లవి॥

మొరఁగు మరఁగు వింత కరఁగుఁదేనెల
పరచుమాటల పడుచా

చురుకు మెరుపు వాలుఁజూపుల కన్నుల
కెరలఁ బొడిచి గిలిగించేవే పడుచా ॥భావ॥

కెలపు మలపుఁ బయిఁడి గిలుకుల మట్టెల
బలుపుమోఁతల పడుచా
అలపు సొలపు ముద్దులొలుకు నవ్వుల
జలుకువలపు మీఁదఁ జల్లేవే పడుచా ॥భావ॥

వెదకి వెదకి తిరువేంకటేశ్వరుఁ
బదరి కూడిన పడుచా
కదలు గుబ్బల కలికిచేఁతల
పుదుటు నడపులనె వొరగేవే పడుచా. ॥భావ॥ 268

శంకరాభరణం

దిమ్మరివలె నిటులఁ దిరుగకువే
చిమ్ముల వలపు నీపైఁ జిలికించీఁ గృష్ణుఁడు ॥పల్లవి॥

మెల్లనే వుద్దాలు మెట్టి మీరిన తురుము వెట్టి
తెల్లని ముత్యాలు గట్టి తిరుగకువే
చల్లలమ్మేనంటా నీవు చక్కని గొల్లెతవు
వల్లెవేసీఁ జూపులనే వన్నెకాఁడు కృష్ణుఁడు ॥దిమ్మ॥

మట్టెలనే గిలుకొట్టి మణులపెండెమువెట్టి
దిట్టనడపుల వీధిఁ దిరుగకువే
జట్టిగొనుచూపుల జంకెన గొల్లెతవు
పెట్టెడుఁ జిక్కుల నిన్ను బిత్తరీఁడు కృష్ణుఁడు ॥దిమ్మ॥

చెక్కులదాఁకాఁ గస్తూరి చెలఁగి నొసలఁ బెట్టి
దిక్కులు చూచుచునంత తిరుగకువే

గక్కన శ్రీ వేంకటాద్రి[1] ఘనుఁడు కౌఁగిటను
చొక్కులఁ బెట్టెడి నిన్ను చూరకాఁడు కృష్ణుఁడు. ॥దిష్ట॥ 269

77-వ రేకు. వరాళి

మోవుల చిగురుల చిమ్ముల వేదము
ఆవుల మందలలోని ఆవేదము ॥పల్లవి॥

పంచముపైఁ జదివేది మరవకుమీ
కొంచెపు లేఁబలుకుల కొనవేదము
పించెపు శిరసుతోడఁ బిన్ననాఁడే చదివిన
తుంచి తుంచిన మాటల[2] తొలువేదము ॥మోవు॥

చల్లలమ్మె గొల్లెతల చక్కనిజంకెనలకు
గొల్లపల్లెలోన దొరకొన్న వేదము
తల్లిబిడ్డలనక యందరినొక్కవావిగా
పిల్లఁగోవి నేరిపిన పెనువేదము ॥మోవు॥

పంకజభవాదుల బడిబడిఁ జదివించే
లంకెలు చెలఁగిన[3] మేలపువేదము
వెంకటనగముమీఁద వెలయ నిందిరఁగూడి
కొంకక చదివిన చొక్కుల వేదము. ॥మోవు॥ 270

వరాళి

నిండిన[4] వేడుకలెల్ల నీకె గాక
అండనె తాపము చల్ల[5] నమరెగా నాకు ॥పల్లవి॥

మగువకన్నుల మొక్క మట్టెల పాదపుఁ దొక్క
నిగుడు వాతెరనొక్క నీకె కాక

1. ని-రే. ౯౦. శ్రీ వేంకటఘను. 2. ని-రే. ౬౭. మాఁటతొలు. 3. చెలఁగించే.
4. తా-పె. ౧౧౪. నింపైన. 5. సా-రే. చల్లె.

అగడునెరుల చిక్కు అరచేతిపై చెక్కు
వగల గుక్కను [1] మిక్కు వన్నెగా నాకు ॥నిండిన॥

తొయ్యలిఁ గూడినరట్టు తుదచెమటలబొట్టు
నెయ్యపుమాటల గుట్టు నీకె కాక
పయ్యద జారినకట్టు భారంపు నొసలిపట్టు
కయ్యపుటలుక తిట్టు గలిగెఁగా నాకు [2] ॥నిండిన॥

మొగలిపువ్వులతావి ముంచినకన్నులకావి
నిగనిగ నగుమోవి నీకె కాక
సగము జారిన నీవి చనవుల నీదేవి
నగుట వేంకటేశ నేఁడబ్బెఁగా నాకు [3]. ॥నిండిన॥ 271

## శ్రీరాగం

ఆలవట్టములు [4] వట్టేరవధరించఁ గదో [5] పెద్ద
పాలిండ్ల బరవున భామ [6] బడలితివి ॥పల్లవి॥

మజ్జనమవధరింతు మగువ విచ్చేయవో
గొజ్జంగ కస్తూరినీటఁ గుంకుమనీట
గజ్జల గరుడునిపై కలికి విభునిఁగూడి
ముజ్జగములఁ దిరిగి మొగినలసితివి ॥ఆల॥

బోనము వెట్టినారిదె [7] పొలఁతి విచ్చేయవో
ఐనకూరలెల్లఁ జల్లనారీనిదే
తేనెలూరెడి కెమ్మోవితీపులు నీ విభునకుఁ
గానుకగా నిచ్చియిచ్చి కడునలసితివి ॥ఆల॥

చప్పరమంచముపైకి సరుగ విచ్చేయవో
అప్పుఁడు వేంకటరాయఁడలరీ వాఁడే

1. కుక్కరు మిక్కు. 2. ని-రే. ౧౧. నీకు. 3. నీకు; ని-రే. ౮౧. నాకునూ.
4. ని-రే. ౯. వట్టము. 5. రించఁగ పెద్ద. 6. భరవున బడలితివి. 7. వడ్డినదిదె.

కొప్పెరగుబ్బలమీఁది కొనగోరిరచనల
కప్పురము మెత్తిమెత్తి కడునలసితివి. ॥ఆల॥ 272

హిందోళవసంతం

జగడపుఁ జనవుల జాజర
సగినల మంచపు జాజర ॥పల్లవి॥

మొల్లలు దురుముల ముడిచిన బరువున
మొల్లపు సరసపు మురిపెమున
జల్లనఁ బుప్పొడి జారఁగఁ బతిపై
చల్లేరతివలు జాజర ॥జగ॥

భారపుఁగుచముల పైపైఁ గడు సిం
గారము సెరపేటి గందవొడి
చేరువ పతిపై చిందఁగఁ బడఁతులు
సారెకుఁ జల్లేరు జాజర ॥జగ॥

బింకపుఁ గూటమి పెనఁగేటి చెమటల
పంకపుఁ బూఁతల పరిమళము
వేంకటపతిపై వెలఁదుల నించేరు [1]
సంకుమదంబుల జాజర. ॥జగ॥ 273

ముఖారి

పొద్దువోకలివి నీకు భువిలో నెన్నఁగ నీ
సుద్దులు చెప్పెదమన్న చూడఁజూడఁ గొత్తలు ॥పల్లవి॥

మోఁతనీటిలోని యీఁత మూఁపునఁ బుట్టిన [2] మేఁత
మూఁతిమీఁది కత్తికోఁత మొనగోరివాఁత [3]

1. వి-రే. ౯. వెలఁదులప్పుళించేరు. 2. వి-రే. ౮౮. బెట్టిన; తా-వెం. ౧౫౫. మోఁత. 3. వి-రే. వ్రాఁత.

జాఁతిలేని దారవోఁత పాపముచూడనిచేఁత
నాఁతిమీఁది తలపోఁత నాఁగేటిగీఁత ||పొద్దు||

వలపు చల్లినలాగు వాజిసెక్కినజాగు
వలసి నొల్లముతైన పలవనిజాగు
తెలిసితిమిదె నేఁడు తిరువేంకటేశ్వర
తలఁపు ప్రాణులమీఁదఁ దగయుటేలాగు[1]. ||పొద్దు|| 274

శ్రీరాగం

నేనెందు వోయె తా (యేఁ దా ?) నెందు వోయీ
రానీవే రానీవే రానీవే ||పల్లవి||

మీసైన నాఁటి తన మిడుకెల్ల దిగవలె
కానీవే కానీవే కానీవే[2] ||నేనెం||

తలచూపేనాఁటి తలఁపెల్ల దిగవలె
తలఁచనీ తలఁచనీ తలఁచనీవే ||నేనెం||

కిరియైన నాఁటి కిటుకెల్ల దిగవలె
తిరుగనీ తిరుగనీ తిరుగనీవే ||నేనెం||

హరియైన నాఁటి అదటెల్ల దిగవలె
జరగనీ జరగనీ జరగనీవే ||నేనెం||

వడుగైన నాఁటి వస విడువఁగ వలె
తడవకు తడవకు తడవకువే ||నేనెం||

కలుషించే నాఁటి కడమెల్ల దిగవలె
అలుగనీ అలుగనీ అలుగనీవే ||నేనెం||

సతిఁ బాసేనాఁటి చలమెల్ల దిగవలె
తతిగానీ తతిగానీ తతిగానీవే ||నేనెం||

1. దగిలేటి లాగు. 2. ని-రే. రాః. కానీవే కానీవే కానీవే.

ముసలైన నాఁటి ముసుపెల్ల[1] దిగవలె
విసుగనీ విసుగనీ విసుగనీవే ॥నేనెం॥

మానైన నాఁటి మదమెల్ల దిగవలె
పోనీవే పోనీవే పోనీవే ॥నేనెం॥

కలికైన నాఁటి గజరెల్ల దిగవలె
చెలఁగనీ చెలఁగనీ చెలఁగనీవే ॥నేనెం॥

వేడుకతో నాఁటి[2] వెంకటపతి నన్ను
గూడనీ కూడనీ కూడనీవే. ॥నేనెం॥ 275

78-వ రేకు. భూపాళం

ఎందరు వలె నీకింకాను - యీ
యిందరు చాలర యింకాను ॥పల్లవి॥

మోహపు సతితో ముచ్చటఁ గలసిన
దేహము మనసునిదియ కాదా
సాహసమున నది చాలక మదిలో
యీహలఁ దిరిగే వింకాను ॥ఎంద॥

కసరుల మురిపెపు గయ్యాళిసతులతో (గయ్యాళులతో ?)
అసురుసురులతో నలసితివి
కొసరుచు నాతోఁ గూటమిసేసే
ఎసరెత్తకుమీ యింకాను ॥ఎంద॥

కాఁకల నటనలఁ గరగింపుచు నను
దేఁకువఁ గూడితి దియ్యరివై
వేఁకపు వలపుల వేంకటేశ నీ
యేఁకట దీరదు యింకాను. ॥ఎంద॥ 276

1. వి-రే. లా౭. ముళిపెల్ల. 2. వేడుకనాఁటి.

### ఆహిరి

ఇట్టే నాముదిఁ గోపమెచ్చరించేవు
వట్టి వలపే నాపై వారించవలెనా ॥పల్లవి॥

మోహపు సంకుటుంగరముల వెలిగోర నా
దేహముపై నునురేక దియ్యఁజూచేవు
సాహసివిరా వోరి వెచ్చపు నీవలపులోని
దాహమెల్లా నాతోనే యింతటఁ జూపవలెనా. ॥ఇట్టే॥

తళుకుబంగారంచుల దట్టి చీరకొంగు [1]
లలర నీమేను నాపై నప్పళించేవు
వలదు వోరి వెచ్చపువలపు నీదెల్లాను
పలుమారునిట్ల నాపైఁ బూయవల (లె ?) నా ॥ఇట్టే॥

సన్నపుమణుల కుప్పెసవరము [2] కొప్పు నా
కన్నులు దాఁకఁగ నాపైఁ గడు వీఁగేవు
కన్నుల కలికి వేంకటరాయ నీకౌఁగిటి
వన్నెలెల్ల నాపై నిటువలెఁ జేయవలెనా. ॥ఇట్టే॥ 277

### శ్రీరాగం [3]

ఉండవద్దా యిటువంటి వొడికాలను [4] చను
గొండలపై నుదయించెఁ గొండుకచందురుఁడు ॥పల్లవి॥

మింటిమీఁది చందురుఁడు మేదినిపై కలువల
నంటు సేసెనట యేఁటి నాటకముతే
కంటిచూపు [5] కలువల కలకకోరిచెఁ బైఁడి
వంటిమేని జవరాలి వదన చందురుఁడు ॥ఉండ॥

---

1. ని-రే. ౪౦. కొంగువెలి అలర. 2. పె-రే. ౨౫. సరము. 3. ని-రే. ౨౪, ౨౭. ముఖారి. 4. వొద్దికలను. 5. ని-రే. కంటిదోయి.

జలధిలో జనియించి చందురుఁడె పగలాయ
జలజములకు నేఁటి శాంతములే
మెలుఁతమోమై నేఁడు మెత్తనికరతలము
జలజానఁ బవళించెఁ జక్కని చందురుఁడు ॥ఉండ॥

చింకచందురుఁడు కందుఁజీఁకటి మైచీఁకటే
యింకఁజేసి పారఁదోలీనేఁటిపొందులే
వెంకటేశుని కౌఁగిట వెలఁదిమోమై నేఁడు
వంక నెరిచీఁకటి వలఁచె జంమురుఁడు. ॥ఉండ॥ 278

## దేవగాంధారి

ఎంతటివాఁడవు నిన్ను నేమందును యిట్టె
సంతమైతివింతితోడ చాలదా నీకు ॥పల్లవి॥

మాణికపుటుంగరాల మగువ దా వాయించేటి
వీణలోనే చల్లీఁ దనవిరహమెల్లను
ఏణనయన నింతేసి యెలయించినట్టి నీ
జాణతనమె యింత చాలదా నీకు ॥ఎంత॥

గిలుకుఁగంకణముల కీరవాణి కిన్నెరలో
కులికీనిదె పై [1] కోపమెల్లాను
సొలపుఁజూపులనిట్టె సుదతినింతేసి నీ
చలము సాదించితివి చాలదా నీకు ॥ఎంత॥

కుంకుమగుబ్బలతోడి కోమలిచెక్కుచెమట
వంకనే వచ్చి [2] నీపై వలపెల్లను
వెంకటగిరిరమణ వేడుక నీలలితాంగి
సంకెదేరఁ గూడితివి చాలదా నీకు. ॥ఎంత॥ 279

1. పె-రే. ౨౫. నీపయిఁగో. 2. పె-రే. వంచీ.

## శ్రీరాగం

పువ్వుగట్టినట్టి మేనఁ బుక్కిలించీఁ జెమట నీ
జవ్వనపు మదమె పో చలపట్టీని ॥పల్లవి॥

మొలకనవ్వు చిగురుమోవి మోపనీక[1] నీ
పలుకుఁగోవిలలె పో పగచాటీని
తిలకపుమోమునకుఁ దేంట్లరానీక నీ
యలకల చెదరె పో యదలించీని ॥పువ్వు॥

చనవున నీముఖచందురుని వంక[2] నీ
చనుజక్కవలె పో చాడిచెప్పీని
మనసు చేఁకట్ల నీమదనతాపపుఁ జింత
కనుఁగవలె[3] పో గాదెఁబోసీని ॥పువ్వు॥

దట్టపుఁదమకపు మైదావానలానకు
నిట్టూరుపులె పో నీడవెట్టీని
గట్టుతోనుండిన కూరిమిపంపులే పో నీ
పట్టపు వెంకటపతిఁ బట్టి తెచ్చీని. ॥పువ్వు॥ 280

## భూపాళం

ఇన్నిచేఁతలును జేసెనిందుకొరకే - వీఁడు
కన్నులనె పొద్దువుచ్చీఁ గదవె నీకొరకే ॥పల్లవి॥

మీనమాయఁ జెమటల మేను ముంచుకొరకే
తానే కమఠమునాయ దాఁగుకొరకే
ఆనుకొని కిటియాయ నదలించుకొరకే
మానఁడు కంబముచాటు మారుమోముకొరకే ॥ఇన్ని॥

---

1. ఇది పె-రే. ౨౫. పా; సా-రే, ని-రే. ౫౭. మోఁపనీఁక. 2. ని-రే. వంత.
3. ని-రే. గలువలె.

కాలుచాఁచె నేలమీఁద గమనించుకొరకే
జాలిఁబెట్టి చేఁతలనే చంపుకొరకే
యేలికాయ విరహులనేఁపెడికొరకే
శైలమెత్తె నీకుచములెత్తే[1] కొరకే ॥ఇన్ని॥

కలవెల్ల సిరసించెఁ గదవె నీకొరకే
కలికియాయెను నీసంగతికొరకే
వలపుల వేంకటేశ్వరుఁడు లోకమున
చెలువముతో మెరసెను నీకొరకే. ॥ఇన్ని॥ 281

79-వ రేకు. కేదారగౌళ

రమ్మనవే వాని రమ్మనవే - యీ
తమ్మికనుఁగొనల తళుకులవాని ॥పల్లవి॥

మెలుపున నేను మేడమీఁద యీ
చిలుకఁ బేరుకొని పిలువఁగను
అలపున వీథిఁ దానరుగుచును తనుఁ
బిలిచితినంటాఁ బలికినవాని ॥రమ్మ॥

కేరడమైన కిన్నెరలో యీ
నారణి ముట్టుచు నలుగడను[2]
చేరువల తాఁజెలఁగుచును యిటు
పేరుకొనుచు నను బిలిచినవాని ॥రమ్మ॥

పరవశమై నేఁ బానుపున యీ
గిరికుచముల నొడ్డగిలఁగాను
తిరువేంకటఘనగిరిపతి ననుచును[3] యీ
సిరులుగ నననిటు చెనకినవాని. ॥రమ్మ॥ 282

---

1. వి-రే. ౫౦. ఎత్తుకొరకే. 2. వి-రే. ౫౭. నలరఁగను. 3. గిరి యనుచును.

ముఖారి - అటతాళం

చేయరాని చేఁతలెల్లఁ జేసితివి యింత
పాయరాని సతిమీఁది భయము నీకెట్టిదో ॥పల్లవి॥

ముత్తేల[1] పెండెమిది ముదితది ఆ[2]
గుత్తపుఁ బాదమునకుఁ గొలఁదైనది
బిత్తరపు ముంజేతనే పెట్టితివి యీ
మత్తగజగమనపై మన్నన నీకెట్టిదో ॥చేయ॥

కుందణంపు మట్టెలివి కోఁకులివి మోఁత
లందెలతో జగడించనందమైనవి
యిందు నీకు సుంగరాలై యేచినవి యీ[3]
యిందుముఖి మీఁదిమోహమెంత[4] నీకునెట్టిదో ॥చేయ॥

గట్టివలిపెపు చంద్రకావి యిది యింతి
కట్టి విడిచిన నేఁటికమ్మఁదావిది
కట్టి కాసించితివి వేంకటరాయా యీ
బెట్టైన చెలిమీఁదిప్రేమము నీకెట్టిదో. ॥చేయ॥ 283

ముఖారి

సెల్లునంటా నేమైనా సేఁపువచ్చేవు నే
నొల్లనిన్ను సక్కసాయ[5] నుండేవో వుండవో ॥పల్లవి॥

మేసవారి పిన్నదాని మేకు సేసి యింటిలోనఁ
దోసుకొంటివెఱఁగవా దుండగీఁడ
ఆసలఁ బెట్టేవు నన్ను నట్లనే యింతేసి
వేసాలఁబోక కొంగు వీడేవో[6] వీడవో ॥సెల్లు॥

1. ని-రే. ౧౫. ముత్యాల. 2. ఆ-ఆ-ఆ-ఆ. 3. యీ-యీ. 4. మిఁకనీ. 5. ని-రే. ౩౬. సక్కఁజాయ. 6. ఇది పె-రే. ౨౩; సా-రే. విడవో; ని-రే. ౩౬. విడిసేవో.

పాయపు వలపులనే[1] పైఁడివంటి గొల్లెతల
సాయమంపి తొలఁగవా సటకాఁడ
మాయలఁ బెట్టుచు నీవు మంచునీరు కుంచాలఁ
బోయుచు నన్నేఁపక పోయేవో పోవో ॥నెల్లు॥

గాఁటమైన గుబ్బల చక్కనిదాని నమ్మనంటా
ఆఁటదాని బాసగొనేవడవిలోనే
నాఁటకపు వెంకటేశ నన్నుఁ గూడితివి యిట్టె
మాఁటలెందూనాడక మానేవో మానవో. ॥నెల్లు॥ 284

ఆహిరి

ఇన్నియుఁ జేసితివిఁకనేలా నీ
చిన్నినగవు మానెర నీచేఁత ॥పల్లవి॥

మఱవకురా నీమాటలు ని
న్నెఱుఁగుదు నిన్నియు నిఁకనేలా
మొఱఁగకురా నీమోహము నా
చెఱఁగు మానెనిదె చెల్లె నీచేఁత ॥ఇన్ని॥

చిందకురా నీ చెలువములు ఇపు
డిందరునున్నారిఁకనేలా
కందకురా నీ కాఁకలను యిటు
కిందుపడితినిదె గెలిచె నీచేఁత ॥ఇన్ని॥

నొంపకురా నే నొగులఁగా ని
యింపులు నెరపేవిఁకనేలా
జంపుల వేంకటశైలపతీ నా
కెంపుమోవి (కి) దక్కెర నీచేఁత. ॥ఇన్ని॥ 285

---

1. వల్లపులన్నే.

బౌళి - ఏకతాళి

ఎవ్వరు గలరమ్మ యింక నాకు
నెవ్వగలలోఁ జిత్తము నెలకొన్నదిపుడు ॥పల్లవి॥

మనసుకోరిక దీని మానిపెదనంటినా
వొనగూడి మనసు నావొద్దలేదు
పెనఁగి తమకము వా[1] పెదనంటినా మేన
అనయమునెరవు దానై[2] యున్నదిపుడు ॥ఎవ్వరు॥

చింత తాలిముల ముంచెదనంటినా మేన
సంతాపములు సేయఁ జలపట్టెను
అంతరంగము నాదియంటినా నెలవున
సంతతమునాతఁడే జట్టిగొనె నిపుడు ॥ఎవ్వరు॥

సింగారపుమేను నాచేతికి లోనంటినా
అంగవించి పరవశమై యున్నది
యింగితమెరిఁగి వెంకటేశుఁడు నాకంటినా
కంగి నన్నుఁ గారించి కలసెనిపుడు. ॥ఎవ్వరు॥ 286

వరాళి

వెలయు నీకల్యాణవేదిగా మతినుండి
కలికి జవ్వనపు యాగము సేసెనతఁడు ॥పల్లవి॥

మలయు నీ నాభిహోమపు గుండమునను[3]
నెలకొన్న విరహాగ్ని నిండాఁ బోసి
పొలయు నీ నిట్టూరుపుల విసరుచును
వొలుకుఁ జెమటల నాహుతి వోసె నతఁడు ॥వెలయు॥

1. ని-రే. ౯౨. మునాపె. 2. పె-రే. ౨౫. తానైనయున్న. 3. ని-రే. ౭౬. మున.

కదిసి నీనెన్నడిమి గగనమునందు
పొదలిన యారనే పొగ నిండఁగా
మదిరాక్షి నీమంచి మానపుఁ బశువు
నదనెరిఁగి వేలిచె నతివ నీకతఁడు ॥వెలయు॥

కాటుకకన్నుల నిన్నుఁ గడునలయించి
బూటకముల చిటిపొటి సిగ్గుల
గాఁటపుఁగరుణ వేంకటగిరివిభుఁడు
కోటిహోమము సేసెఁ గూడి నిన్నతఁడు. ॥వెలయు॥ 287

## శ్రీరాగం [1]

అంజలిరంజలిరయం తే
కిం జనయసి మమ ఖేదం వచనైః ॥పల్లవి॥

మాం కిం భజసే మయా కింతే
త్వం కోవా మే తవ కాఽహం
కిం కార్యమితో గేహే మమ తే
శంకాం వినా కిం సమాగతోసి ॥అంజలి॥

నను వినయోక్తేర్న యోగ్యోఽహం
పునః పునస్త్వం పూజ్యోసి
దినదిన కలహవిధినా తే కిం
మనసిజజనక రమారమణ ॥అంజలి॥

దైవం బలవత్తరం భువనే
నైవ రోచతే నర్మ మయి
ఏవమేవ భవదిష్టం కురుకురు
శ్రీ వేంకటాద్రి శ్రీనివాస. ॥అంజలి॥ 288

1. ని-రే. ౪౫. రాగము పేర్కొనలేదు.

సామంతం

విరహాన నినుఁబాసి వేఁగేను
తరుణి నేను నిన్నుఁ దప్పఁ దోయఁగలనా ॥పల్లవి॥

మున్ను నీవు రేపల్లెను ముచ్చిలించుకొన్న పాలు
వెన్నలునారగించి విఱ్ఱవీఁగేవు
సన్నపు నడిమితోడ జవ్వనాన నలయుచు
నున్నదాన నీతోడ నోపుదునా పెనఁగ ॥విర॥

నేరుపునఁ బాలజలనిధిలో నమృతమెల్ల
నారగించి లావున[1] నన్నుప్పళించేవు
బీరమునఁ జిగురాకుఁబెదవితోఁ గనుచూపుఁ
గూరిమి నేనుండి నిన్నుఁ గుచ్చి పట్టఁగలనా ॥విర॥

గుద్దలించి దనుజుని గోరఁ జెనకిన నిన్ను
అద్దలించి చెనక నీయంతదాననా
గద్దరివి[2] తిరువేంకటగిరివిభుఁడ నీ
నిద్దపుఁ గస్తూరిమేను నేనాఁగఁగలనా. ॥విర॥ 289

ముఖారి

ఎక్కుడిదిఁకఁ బరిణామము యీమదనానలమునఁ బ్రియ
మెక్కుడు దోఁపఁగ ధైర్యంబింతయుఁ దీరెడిని ॥పల్లవి॥

మనసునఁ దలఁచిన తలఁపులు మాటల వెడలఁగ నాడిన
గొనకొని కన్నుల నీళ్ళు గుత్తుకవట్టెడిని
కనుఁగన చూచినచూపులు కౌఁగిటఁ జేర్పఁగఁబోయిన
పనివడి హృదయంబంతయుఁ బరవశమయ్యెడిని ॥ఎక్కుడి॥

1. ని-రే. ౧౮౯. లావుల. 2. ఇది ని-రే. పాఠము; సా-రే. గద్దరి తిరువేం; పె-రే. ౨౩. గద్దరి శ్రీ తిరువేం.

తనువున నాటినమాటలు తప్పక మతిఁ జింతించిన
అనువుగనది పరితాపంబై పెరరేఁపెడిని
వెనకదినంబుల కూటమి వేడుకలసి తలపోసిన
పెనగొని పూఁటకుఁబూటకు ప్రేమము పెరిగెడిని ॥ఎక్కడి॥

తిరువేంకటగిరినాథుని దేవోత్తముఁ గూడిన మది
మెరగొని దేహవికారములెరవై తోఁపెడిని
పరమాత్మునికరుణారస పానము సేసిన జిహ్వకు
అరుదుగ నితరపదార్థములన్నియు రోసెడిని ॥ఎక్కడి॥ 290

శ్రీరాగం [1]

తానట [2] ప్రాణేశుండట తమకము తమకముఁగూడఁగ
వేనలి జారినఁ దలఁకని వేడుకలెట్టివాకో ॥పల్లవి॥

మీఁటినఁ బగిలెడిగుబ్బలమీఁద నలందిన గంధపు
వేటులతళుకులు పయ్యెద వెలుపలఁ బొలయఁగను
నాఁటిన మదనునిశరముల నలఁకువనొయ్యన తోఁపఁగ
మాటకు మాఁటాడదు చెలిమర్మంబెట్టిదొకో ॥తానట॥

మించిన తొడల మెఱుంగుల మెలుఁతుక గట్టిన పుట్టము
చించుక వెడలిన సిగ్గులు సిగ్గులు దొలఁకఁగను
వంచినరెప్పల కన్నుల వడియు జలంబులు చెక్కుల
నించినఁ బలుకనిభావపు నెవ్వగలెట్టివొకో ॥తానట॥

కమ్మనితావుల చెమటల గాలికి నొయ్యన మెచ్చుచు [3]
సొమ్ములఁ దేలెడి మరపుల సొక్కులఁ దేలుచును
దిమ్మరికోనేటప్పని తిరువేంకటపతిఁ గూడిన
కొమ్మకు మీఁదటియాసల కోరికలెట్టివొకో. ॥తానట॥ 291

1. తా-వెం. ౧౪౩. ముఖారి. 2. తాను ప్రాణే. 3. మెచ్చును.

నాదనామక్రియ

మలసిన తుమ్మిద మగవాఁడు
నిలిచి నాకు వెరవ నీకేలయ్యా ॥పల్లవి॥

మగువలు సురతపు మఱపునఁ గుచములఁ
దగిలిన రేకలతరిఁ జెలఁగి
పగటున సిగ్గులు పడదురుగాకిటు
నిగిడిన సిగ్గులు నీకేలయ్యా ॥మలసి॥

వనితలు రతిపరవశమున మురిపెపు
కనుఁగవచూపులఁ గరఁగుచును
ఊనుగుల చూపులు చూతురుగాకిటు
యెనసినెనయములు యిఁకనేలయ్యా ॥మలసి॥

లోలో మముబోంట్లు వనితలు వగఁ
దూలుచు జడమౌదురు గాక
తేలించితి రతి తిరువేంకటపతి
నాలికాఁడ నీనగవేలయ్యా ॥మలసి॥ 292

దేశాక్షి

ఏడనున్నదో యీతరుణి
చూడక చూచిన చూపులలోన ॥పల్లవి॥

మేఁతలు మరిగిన మీల పిల్లలకు
నీఁతలు నేరిపి యీతరుణి
కాఁతాళించిన కన్నుల నీళ్ళ
చేఁతల నిండిన చెరువులలోన ॥ఏడ॥

ముత్తెపునవ్వుల మురిపెపుఁబువ్వుల
యెత్తులె కట్టి యీతరుణి

లత్తికమోవికి లంచముగా పై
మెత్తిన దంతపు మెరుఁగులలోన ॥ఏడ॥

పసని చీఁకట్ల పలుమరుఁ దవ్వి
యిసుక పాఁతరలె యీతరుణి
కసిగాట్ల వేంకటపతి కౌఁగిట
రసములొలుక నేరములెన్నుచును. ॥ఏడ॥ 293

81-వ రేకు. లలిత

తెప్పగా మఱ్ఱాకుమీఁదఁ దేలాడువాఁడు
ఎప్పుడు లోకములెల్ల నేలేటివాఁడు ॥పల్లవి॥

మోఁతనీటి మడుగులో యీఁతగరచినవాఁడు
పాఁతగిలే నూతికిందఁ బాయనివాఁడు
మూఁతి దోసిపట్టి మంటిముద్ద పెల్లగించువాఁడు
రోఁతయైన పేగులపేరులఁ గలవాఁడు ॥తెప్ప॥

కోడికూఁతనోరివాని కుఱ్ఱతమ్ముఁడైనవాఁడు
బూడిది వూసినవాని బుద్ధులవాఁడు
మాడవన్నె లేటివెంట మాయలఁ చగిలినవాఁడు
చూడల నావులఁ గాచి దొరయైనవాఁడు ॥తెప్ప॥

ఆకసానఁ బారేపూరి అతివల మానములు
కాకు సేయువాఁడు తురగముపై వాఁడు
ఏకమై వేంకటగిరి నిందిరారమణిఁ గూడి
యేకాలముఁ బాయని యెనలేనివాఁడు. ॥తెప్ప॥ 294

సామంతం

పెద్దపిన్నవరుసఁ బెరుగవలసి తా
నిద్దరైన యాతఁడీతఁడు ॥పల్లవి॥

మెఱఁగురెక్కల పెద్దమేని పులుగునెక్కి
యిరులుకొనెడి యాతఁడీతఁడు
ఎరమంటలెగయంగ నేచిన పురముల
నెరియించిన యాతఁడీతఁడు ॥పెద్ద॥

చల్లని చూపుల సతికి వలచి పోయి
యిల్లిటమున్నవాఁడీతఁడు
తెల్లనీటిపై దిక్కులు వెలుఁగఁగ
నిల్లుగట్టిన యాతఁడీతఁడు ॥పెద్ద॥

చూచిన చూపుల సుఖదుఃఖములఁజేయ
నేచిన పెనుదైవమీతఁడు
ఆచందముల వేంకటాద్రిపై నెలకొని
యీచోటనున్నవాఁడీతఁడు. ॥పెద్ద॥ 295

ముఖారి

కంటిమి నీలాగులెల్లఁ గన్నుల యాఁకలి దీర
బంది (?) తనమేల మాతోఁ బంతమింత చాలదా ॥పల్లవి॥

మింటిమీఁది కంటిచూపు వంటలేని కూడు నీకు
గుంటిమీఁది తోడఁబుట్టు గొల్లవారికలిమి
ఒంటిగాక లోకమెల్లనొక్కపైన మేను మంచి
జుంటితోడఁ బుట్టినాలు సుకమింత చాలదా ॥కంటి॥

నాలుగు మోములబిడ్డ నవ్వుల సంసారము
వేలుమోపరానియిల్లు వింతవింతచెలువు
కాలిగోరఁ బుట్టినట్టి గద్దరికూఁతురు మంచి
పాలమీఁదిపడుక నీ బ్రదుకింత చాలదా ॥కంటి॥

ఎల్లనాఁడు నురముమీఁద నెండగాయు కావిరాయి
గుల్లకూఁతతోడినోరు కొనగోరుబలిమి

చెల్లురా నీకింతవట్టు శ్రీ వేంకటేశ్వరుఁడ
మల్లువారితోడి పోరు మానవింత చాలదా. ॥కంటి॥ 296

## ముఖారి [1]

కడగంటనే [2] కెంపు గడురఁగాను
పడఁతి మురిపెపునటనఁ బాయ [3] దేమియును ॥పల్లవి॥

మగువ ముత్తియపుఁ గమ్మల వెన్నెలలుఁ [4] జిన్ని
నగవువెన్నెలలు సున్నతిఁ బొలయఁగాను
జగడించి విభుని విరసంబులనె సొలయఁగా
మొగమునసుఁ గోపంబు మొలవదేమియును ॥కడ॥

రమణికుచకుంభభారమును మొలనూళ్ళ భా
రమును సెన్నడిమి సన్నము దెలుపఁగా
ప్రమదంపు విభునిఁ బెడఁబాసి చెనకుచు లోని
తమకంపు సంభ్రమము తరగదేమియును ॥కడ॥

ముదిత మై సింగారములుఁ జక్కఁదనములును
పదివేలు విధములై పరఁగఁగాను
కదిసి వేంకటవిభుని కమ్మఁగౌఁగిటి రతులఁ
జెదరు నలకల [5] సిరులు చెదరవేమియును. ॥కడ॥ 297

## బౌళి

బహుకర్మభోగంపు [6] పనులెల్ల నిట్లనే
యిహసుఖంబిందరికి నెట్లనో కాని ॥పల్లవి॥

మెలఁత విభుఁ బాసియును మితిలేని వేదనల
నలరి యాతనిఁగూడు నధిరతుల నలసె

---

1. ని-రే. ౧౧౦. శంకరాభరణం. 2. కడగన్నులనె. 3. నటన పాయ. 4. లలఁజిన్ని. 5. సా-రే. చెదరనలకల. 6. పె-రే. ౨౬. బోరంపు.

అలిగినను గూడినను కలిగె నలపులు దనకు
నెలమిఁ దనసుఖములిఁక నెప్పుడో కాని ॥బహు॥

ఉడుగని వియోగాగ్ని నూర్పు గడు వేఁడాయ
కడు రతులతో నూర్పు గాఁగి వేఁడాయ
కడఁగిననుతాపంబె కప్పె మైె తాపంబె (?)
యెడలేని తమి యింక నెప్పుడో కాని ॥బహు॥

తిరువేంకటాచలాధిపునిఁ బాసినయపుడు
తరుణి యాతనినిపుడు తగఁ గూడినపుడు
పరవశము దఱచాయ పైపైనె ఘనమాయ
యిరవైన యెరుకలిఁక నెప్పుడో కాని ॥బహు॥ 298

ముఖారి [1]

కుంకుమచెమటలంటా గొణగేవు మరు
దొంకెన తామరల నెత్తురుచారలమ్మా ॥పల్లవి॥

కోవిదునిమీఁద నేల కోపగించేవతని కె
మ్మోవి కప్పు మరునియమ్ములతాఁకులే
తావుల వింతలకుఁ గాఁతాళించేవతనిపై
భావజువింటి పూవు [2] బారిఁ బడెనమ్మా ॥కుంకు॥

నొసలి కస్తూరంటా నొగిలేవాతనిపై [3]
కసటుఁగాఁకల కందుగందము చూచి
యెసగ గందవొడంటా యెఱ్ఱఁబారేవాతనిపై
పసని మదసుదాడి బలుదుమ్ములమ్మా ॥కుంకు॥

ఆఁటదాని గోరితాఁకులనేవాతనిపై [4]
నాఁటినచందురుని సన్నపు [5] రేకలే

---

1. ని-రే. ౧. కాంబోది. 2. పూవుల. 3. వాతనిమీఁద. 4. తనమీఁద.
5. వెన్నెలరేకలే.

గాటపుఁగాఁగిటను వేంకటపతి నీకు దక్కె-
యేఁటికి నాతనినింకా[1] నెగ్గులెన్నేవమ్మా. ॥కుంకు॥ 299

82-వ రేకు. శ్రీరాగం

ప్రతిలేని పూజ దలఁపఁగఁ గోటిమణుఁగులై
అతివపరవశము బ్రహ్మానందమాయ ॥పల్లవి॥

మానినీమణి మనసు మంచియాసనమాయ
నానందబాష్పజలమర్ఘ్యాదులాయ
మీనాక్షికనుదోయి మించుదీపములాయ
నాననసుధారసంబభిషేకమాయ ॥ప్రతి॥

మగువ చిరునవ్వులే మంచిక్రొవ్విరులాయ
తగుమేనితావి చందనమలఁదుటాయ
నిగనిగని తనుకాంతి నీరాజనంబాయ
జగడంపుటలుకలుపచారంబులాయ ॥ప్రతి॥

ననుపైన పొందులే నైవేద్యతతులాయ
తనివోని వేడుకలు తాంబూలమాయ
వనిత తిరువేంకటేశ్వరుని కౌఁగిటఁజేయు
వినయవివరంబులరవిరిమొక్కులాయ. ॥ప్రతి॥ 300

ఆహిరి

మోహంపురతిముదము ముద్దుఁజూపుల మదము
దేహంపు సొబగెల్లఁ దెలిపెఁ[2] సదమదము ॥పల్లవి॥

మించుమట్టెల గిలుకు మెరుఁగుగుబ్బల కులుకు
పంచుఁజూపుల చిలుకు వసివాడుఁబలుకు

1. తనిమీఁద. 2. ౧-రే. ౧౦౩. దెలిసె.

పంచుఁ జెమటల తళుకు మనసులోపలి యళుకు
అంచుటధరపుబెళుకు అలమేఁటి జళుకు[1] ॥మోహం॥

కరమూలములఁ గరఁగు[2] కదలుఁబయ్యెద చెరఁగు
సిరులచెలువపుమెరఁగు చెక్కుపై మరఁగు
గరగరికె తతువెరుఁగు ఘాతలంటిన తెరఁగు[3]
గరిమెతో చెలియునికి[4] కప్పురపుటరఁగు ॥మోహం॥

కలికితనముల పోగు కమ్మఁదావులవేఁగు
వలపుతమకముల పరవశము పెనుజాగు
కలకంటిబాగు[5] వేంకటపతికిఁ జెలరేఁగు
చెలియ[6] సమరతుల మించిన వింత జాగు. ॥మోహం॥ 301

పాడి

ముద్దులు మోమున ముంచఁగను
నిద్దపుఁ గూరిమి నించీని ॥పల్లవి॥

మొల చిరుఘంటలు మువ్వలు గజ్జలు
ఘలఘలమనఁగాఁ గదలఁగను
ఎలనవ్వులతో నీతఁడు వచ్చి
జలజపుచేతులు చాఁచీని ॥ముద్దు॥

అచ్చపుఁ గుచ్చుముత్యాల హారములు
పచ్చల చంద్రాభరణములు
తచ్చిన చేతుల తానె దైవమని
అచ్చట నిచ్చట నాడీని ॥ముద్దు॥

---

1. ధరపు నవ్వులలమేటియళుకు. 2. లకరఁగు. 3. గరగరికెలకు తెరఁగు ఘాతలంటిన పెఱఁగు. 4. ఇది ని-రే. పాఠము; సా-రే, పెఁరే. ౨౬. చెలి వెరగు కప్పు. 5. ఒంటి యొసఁగె. 6. చెలఁగి సమ.

బాలుఁడు కృష్ణుఁడు పరమపురుషుఁడు
నేలకు నింగికి నెరిఁ బొడవై
పాలించి (చాల ?) వేంకటాచలపతి దానై
మేలిమి సేఁతల మించీని. ॥ముద్దు॥ 302

## రామక్రియ

చూడరమ్మ యిటువంటి సుదతులు లేరెందు
యేడనైన నిటువంటి యింతులు వుట్టుదురా ॥పల్లవి॥

ముదితనడపులలోని మురిపెమే వెయినేసు
కొదమగుబ్బలతీరు కోటివేలు నేసు
సుదతిబిత్తరిచూపు సొన్నాటంకాలే నేసు
అదరబింబముతీరు ఆరువేలు నేసు ॥చూడ॥

సన్నపు నడుము [1] లోని సైకమే లక్షనేసు
పన్నుగాఁ బిరుఁదువన్నె పదివేలు నేసు
యెన్నిక మెఱుఁగుఁదొడలెంతధనమైనఁ జేసు
సున్నఁగా దువ్వినకొప్పు నూరువేలు సేసునే ॥చూడ॥

అంగనభాగ్యమెట్టిదో అతిమోహమై తిరు
వెంగళరాయనికృప వేవేలు నేసునే
బంగారుచవికెలోఁ బడఁతిఁ గూడిన సొంపు
రంగుగాఁ జెలియరూపు రాజ్యమెల్లఁ జేసునే. ॥చూడ॥ 303

## ఆహిరి

జవ్వనంపుమదమున జడిసేటి తరుణి
పువ్వుల పానుపుమీఁదఁ బొరలీఁ జూడరే ॥పల్లవి॥

1. పె-రే. ౨౬. నడపులోని.

ముత్తెలకంకణాల మురిసేటి కరము
చిత్తగించు చెలి నేఁడు చెక్కుఁ బెట్టుకొనఁగ
కొత్తసెత్తావి విరుల కొమరైన తురుము
వత్తుల నెరులతోడ వదలీఁ జూడరే ॥జవ్వ॥

పయ్యెదవెలి మించు పగపైన గుబ్బలు
ముయ్యరాని [1] పెనుతాపమునఁ గాఁగీని
వొయ్యారపు రచనలతో వారపైన చూపులు
వొయ్యనె కన్నులనీట వులికీఁ జూడరే ॥జవ్వ॥

కప్పురపుతావితోడ కరఁగేటి తనువు
వొప్పైన కస్తూరిచేత నొరపైనది
యిప్పుడిట్టె తిరువేంకటేశుఁగూడి యా యింతి
చెప్పరాని వేడుకలఁ జెలఁగీఁ జూడరే. ॥జవ్వ॥ 304

కన్నడగౌళ

ఏలా యీ యనుమానములింతి మనంబునఁ బాయని
తాలిమి తప్పఁ దెరువున డాఁగెఁగదోయమ్మా ॥పల్లవి॥

మాయపుమంటలు చల్లెడు మందమారుతము
పాయము దిరుగఁబారెడు పండుఁజందురుఁడు
కాయము తల్లడపరపెడు గండుగోయిలలు
యేయెడనోర్వదు చెలిలాగేలాగోయమ్మా ॥ఏలా॥

ఇంటఁ బుట్టిన యాతఁడే యింటఁ బుట్టిన యమ్ముల
యింటఁ బలుమరునేయఁగ నేమందునోయమ్మా
వింటఁ బాసిన శరముల వెంటఁ దగిలెడు నారిని
యంటిన మదనానలమిఁక నారుపరాదమ్మా ॥ఏలా॥

---

1. పె-రే. ౨౬. ముయ్యగాని.

కొండలరాయఁడు చెలిచనుఁగొండల నించినగురుతులు
కొండుకచందురులైనవి కొత్తగదోయమ్మ
ఎండిన విరహంబింతయు నేఁడిదె యమృతంబాయను
పండిన తమకము మేలై ఫలియించెనోయమ్మా. ॥ఏలా॥ 305

83-వ రేకు. రామక్రియ

కమలానన సౌభాగ్యము కలికితనంబులు సొబగులు
ప్రమదంబులు[1] నింతంతని పలుకంగా రాదు ॥పల్లవి॥

మించిన చొక్కులు మీరినయాసలు
పంచేంద్రియముల భాగ్యములు
యెంచిన తలఁపులు యెడపని వలపులు
పంచబాణుని పరిణత (తు ?) లూ ॥కమలా॥

కనుఁగవ జలములు కమ్మనిచెమటలు
అనయముఁ జెలులకు నాడికలు
తనువున మఱపులు తప్పని వెఱపులు
వినుకలి కనుకలి వేడుకలు ॥కమలా॥

మోవి మెరుంగుయి[2] ముద్దుల నగవులు
శ్రీ వేంకటపతిచిత్తములు
తావుల పూఁతలు దర్పకు వ్రాఁతలు
ఆవిభుఁ గూడిన యలసములు. ॥కమలా॥ 306

పాడి[3]

విభుని వినయములు వినవమ్మా నిను
నభయంబడిగీ నయ్యో తాను ॥పల్లవి॥

---

1. పె-రే. ౨౫. ప్రమదంబున ; 2. మెఱుంగులు ; 3. వి-రే. ౮౬. పురుషవిరహం ;

రహస్యమున శ్రీరమణుఁడు పంపిన
విహారణలేకలు [1] వినవమ్మా
అహిపతిశయనంబతితాపంబై
బహువేదనకగపడెనట తాను ॥విభుని॥

ఆదిమపతి నీయడుగులకెరగిన
వేదాంతరచన వినవమ్మా
నీదయగానక నిమిషమె యుగమై
ఖేదంబున నలఁగీనట తాను ॥విభుని॥

కింకరుఁడట నీ కినుకసేఁతలకు [2]
వేంకటపతిగతి వినవమ్మా
సంకెలేక [3] నీచనవున జగములు
కొంకకిపుడె చేకొనెనట తాను. ॥విభుని॥ 307

ముఖారి

ఎఱఁగవితని చంద మిట్టివాఁడనుచు వింతి
తెఱవల నీమీఁదఁ దేనోప్పఁ జుమ్మీ ॥పల్లవి॥

రంగుమీరిన మంచిరత్నాలు దాచిన నీ
వుంగరాలచేతఁ బాదమొత్తకువమ్మా
అంగన వుట్టెనుఁ బాదమంటి శిలను దొల్లి
కంగి నీకుఁ బ్రతిమోన గడించీఁ జుమ్మీ ॥ఎఱఁగ॥

కొమ్మ నీదు వాలారుగోళ్ళ నితనికిని
యిమ్ములఁ దొడలు సోఁకనియ్యకు [4] వమ్మా
దొమ్ముల [5] సిరుల గోరఁ దొడనింతిఁ బుట్టించె
కమ్మర నీకు [6] నిట్టె కలిగించీఁ జుమ్మీ ॥ఎఱఁగ॥

---

1. లేఖలు. 2. కినుక చూపులకు ; 3. సంకెదేరె : 4. ని-రే. ౩౬. నీకువమ్మా : 5. కొమ్ముల సిరు. 6. నీకునునిట్టె.

నొక్కుచుఁ జెమటల పానుపున వేంకటపతి
సుక్కైన నీచనుఁగొండలొత్తకువమ్మా
పక్కనను గొండవేసి పానుపుజలధి దచ్చె
చక్కని తరుణి నిట్టె సడిఁబెట్టీఁ జుమ్మీ. ॥ఎఱఁగ॥ 308

## భైరవి

కూరిమెరిఁగి కైకోవు - నీ
బీరముతే నెరపేవు ॥పల్లవి॥

రంతులె సేసిటు రావు - యెంతైనాఁ జనవీవు
చెంతలె కడుఁ దలఁచేవు - ఇంతలోనె[1] రవయ్యేవు ॥కూరి॥

పొలయుచు సూరకె పోవు - గిలిగింపుచుఁ దిరిగేవు
చెలఁగుచు పడి మురిసేవు - నిలరా యించుక[2] నీవు ॥కూరి॥

పొంకుచు నూరకె పోవు - తెంకికి నెవ్వతెఁ దేవు
వేంకటపతి నవ్వేవు - పొంకమైతివిఁకఁ బోవు. ॥కూరి॥ 309

## పాడి

సత్యభామ సరసపు నగవు
నిత్యము హరిమదినే నెలవాయ ॥పల్లవి॥

రుకుమిణిదేవికి రూపయవ్వనికి
సకల విభవముల సౌఖ్యతలు
చికురాంబరమునఁ జెదరిన యలకలు[3]
వికచాబ్జముఖము వెయివేలాయ ॥సత్య॥

తొడవుల శ్రీసతి తొలుమెఱుఁగులపై
నడపుల మురిపెపు నగుమోము

1. ని-రే. ౫౨. ఇంతనె యెరవ. 2. నిలరాయాంచక (?). 3. ఇది పె-రే. ౨౬. పాఠము; సా-రే. ఆలకలు.

తడయక వారిధి దచ్చిన హరికిని
బడలిక వాపను పరమంబాయ ॥సత్య॥

అనుదినమును నీ యలమేలుమంగ
కనుఁగవ జంకెన గర్వములు
దినదినంబులును తిరువేంకటపతి
చనవుల సొబగుల సంపదలాయ. ॥సత్య॥ 310

శ్రీరాగం

ఎట్టు[1] సైఁతువె వలపు యింతి పరులు
రట్టుసేయఁగ మిగుల రాఁపునె కొంత ॥పల్లవి॥

రాక విభుఁడేఁపేటి రాజసంబొకకొంత
చీకాకు పడఁజేయు చింత వొకకొంత
పైకొన్న చిత్తంబు పట్టరానిది గొంత
మేకులకుఁ జెలులాడు మేలమొకకొంత ॥ఎట్టు॥

పలుమారు నలయించు పరవశంబొకకొంత
పొలయలుకలను బొడము బూకలొకకొంత
కలికి కన్నులఁ బొలయు కాఁతాళమొకకొంత
కొలఁదిమీరిన మంచికోపమొకకొంత ॥ఎట్టు॥

గరగరిక వేడుకల కలపుకోలొకకొంత
వరుసఁ గోమలమైన వయసులొకకొంత
తిరువేంకటాద్రీశు దివ్యమహిమలు గొంత
సరిలేని పొందికల చనవులొకకొంత. ॥ఎట్టు॥ 311

పాడి

రావే కోడల రట్టడి కోడల
పోవే పోవే అత్తయ్యా, పొందులునీతోఁ జాలును ॥పల్లవి॥

1. పె-రే. ౨౬. ఎటు

రంకెలు వేయుచు రాజులెదుట నీవు
కొంకు గొసరు లేని కోడల
పంకజముఖి నీవు పలుదొడ్డవారిండ్ల
అంకెలఁ దిరిగేవు అత్తయ్యా ॥రావే॥

ఈడాడ నలుగురు నేగురు మొగలతో
కూడి సిగ్గులేని కోడల
వాడకుఁ బదుగురి వలపించుకొని నీవు
ఆడాడఁ దిరిగేవు అత్తయ్యా ॥రావే॥

బొడ్డునఁ బుట్టిన పూఁవనికే నిన్ను
గొడ్డేరు తెస్తినే కోడల
సుడ్డముపయిసున్న కోనేటిరాయని
నడ్డగించుకొంటివ త్తయ్యా. ॥రావే॥ 312

84-వ రేకు. సామంతం

ఎచ్చరించెద్ధ ననిన యీజగంబనఁగాసు
సచ్చరిత్రుఁడ నీకు సరకా వోరి ॥పల్లవి॥

రుచుల నారాయణ పరో జ్యోతి యని
పచరించి నిను శ్రుతులు పలుకఁగాసు
వచియింపరాని యిటువంటి నీ యెదుట నా
కుచకుంభములకాంతి కొలుపునా వోరి ॥ఎచ్చ॥

రమణ నారాయణ పరబ్రహ్మమని
ప్రమదమున నిను శ్రుతులు పలుకఁగాను
తమకమున నను నీవు తగిలితివి యీసుఖము
నిమిషమాసుఖము గానేర్చునా వోరి ॥ఎచ్చ॥

అరయ నారాయణ పరాత్పరంబని నిన్ను
సరసవిద్యలు శ్రుతులు చాటఁగాను
సిరుల నను గూడితివి శ్రీ వేంకటేశ నీ
కరుణకిటు నేనోర్వఁగలనా వోరి. ॥ఎన్న॥ 313

భైరవి

వేంకటాద్రివిభునిఁబాసి విరహియైన రమణిఁ జూచి
రంకెలు వేయనేఁటికమ్మ రాజసమునను ॥పల్లవి॥

విసప (పు ?) కోర సోఁకినపుడె వేఁడిలేని చందమామ
మిసిమిగలుగు వేఁడిచూపు మింట నులయునే
నొసలికంటికాఁకనణఁగి నొగిలినపుడె తోడుగలేక
కుసుమశరము మదనుఁడతివకొరకు దాఁచెనే ॥వేంక॥

చిగురుమేఁతకొండ్లెల్ల చెలఁగి మావికొమ్మలెక్కి
పగవమీఁదఁగూఁతరేఁచి మరునిఁగూడిరే
తగవరైన దశరథేంద్రుతనయు శాపమొసఁగినపుడె
తెగువమీఁదఁగూఁతరేఁచ తెరఁగులెరఁగరా ॥వేంక॥

నెయ్యమలర మంచివిరులశయ్య వేంకటాద్రివిభుఁడు
లియ్యమైనచెలికిఁ జనవులియ్యఁ దొణఁగెనే
కుయ్యవెరచెఁ గోవిలలును కుంకెఁ జందమామకళలు
తియ్యవింటివాఁడు వెనకతియ్యఁదొడఁగెనే ॥వేంక॥ 314

శంకరాభరణం

జవ్వాది మెత్తినది తన
జవ్వనమే జన్నెవట్టినది ॥పల్లవి॥

ముద్దుల మాఁటలది చెక్కు-
టద్దముల కాంతినలరినది
గద్దరిచూపులది తన
వొద్ది చెలియమీఁద నొరగున్నది ॥జవ్వా॥

పుత్తడిఁ బోలినది తన
చిత్తము నీసొమ్ముచేసినది
గుత్తపు గుబ్బలది అల
చిత్తజుని లెక్క-సేయనిది ॥జవ్వా॥

ఎమ్మెలు యెఱఁగనిది తన
కెమ్మోవిఁ జిరునవ్వు గెరలున్నది
కమ్మకొనఁగ వెంకటరాయా నీ
కమ్మనికౌఁగిటఁ గలశున్నది. ॥జవ్వా॥ 315

ఆహిరి

తిట్టినఁ దిట్టినదే తప్పా
బెట్టమ్మా గుంపెన నీచేత ॥పల్లవి॥

వెనక మరలి నవ్వినదే తప్పా
వినమమ్మా [1] నీ విభుఁడౌట
చెనకఁగ జంకించినదే తప్పా
అనవమ్మా నీ వాతనిఁ గినిసి ॥తిట్టిన॥

ఎదుట నిలిచి తురుమిడుటే తప్పా
వదలిన పయ్యెద వాలఁగను
అదన నలసి వుసురనుటే తప్పా
వుదుటుఁదమకమునసుండఁగలేక ॥తిట్టిన॥

1. వి-రే. ౭. వినవమ్మా.

కేలన[1] యిటు మొక్కెనదే తప్పా
రాజు దాఁకి వేంకటపతికి
వోలి నేనతనిపై నొరగుటె తప్పా
మేలములాడుచు[2] మెరయఁగనతఁడు. ॥తిట్టిన॥ 316

రామక్రియ

దంతచ్ఛదముద్రా మదనాస్త్రల
తాంతశాంతికృతిరహో భవతి ॥పల్లవి॥

వనితాకుచయోర్వరనఖరేఖా
ర్జన[3] శశిచిహ్నం సఫలమిదం
ఘనకచణాం మయి ఘటయ చంద్ర ఇ
త్యనునయకారణమహో భవతి ॥దంత॥

సతీమణీ విలసత్కరమూలే
చతురలాంఛనం సఫలమిదం
వ్రతతిభయహృతే వరదాస్య[4] కలన
మతిఘాతాకృతిరహో భవతి ॥దంత॥

తరుణీ తనుగంధ విలేపన వి
స్తర సౌభాగ్యం సఫలమిదం
పరిరంభసుఖే తిరువేంకటగిరి
హరేః పూజనమహో భవతి. ॥దంత॥ 317

శ్రీరాగం

ఇంతి కన్నీరొలుకనిట్లఁ జదివె
కొంతంపు కనుఁగొనల కోపమును జదివె ॥పల్లవి॥

1. ని-రే. ౩౫. కెలనన. 2. మేలమాడుచును. 3. ని-రే. ౬౫. రేఖాజన. 4. వరదుస్య. ఈ సంకీర్తన ని-రే. ౪, ౬౫. పె-రే. ౨౭. లోను ఇట్లే కలదు.

వెలఁది విసుకలినే వినెకి విని తోడనే
తలపోఁతనదివో చింతనసేసెను
తలకొన్న నేంవ్రాఁతలనె పొయవుగ వ్రాసె
తొయితఁ బావపువేలి ధూళక్షిరములు ॥ఇంతి॥

పడఁతి విసుకలినే పలకవ్రాయను వ్రాసె
తడవి నీ చెయివ (వు ?) చిత్తపుఁ బలకనే
కడుఁదెలివికిని దాసి[1] కలవెల్ల మఱచి తన
వెడఁగుఁ జెక్కు[2] చేతితో వెదకీనిదివో ॥ఇంతి॥

పయ్య గంటపువ్రాలు వ్రాసెఁ గొనగోరనే
కుసుఁబసల నీవు చెక్కులు గిల్లఁగా
తిరువేంకటాచలాధిపుఁడ నీతోఁగూడి
సరిలేని శబ్దశాస్త్రములెల్లఁ జదివె. ॥ఇంతి॥ 318

85-వ రేకు. సామంతం[3]

పడఁతి నినుఁదలచి పో పయికఁడతఁడు, నీ
వెడసినను బ్రాణంబులెరవులాతనికి ॥పల్లవి॥

వెదచల్లు నీ మోమువెన్నెలలంఁ దలఁచిపో
పొచలు వెన్నెలబయటఁ బొలయఁడతఁడు
ముదిత నీ నెయ్య ముసుమును దలఁచిపో యతఁడు
కొదమతేంట్లఁ (టుల ?) గనిన గుండె జల్లనును ॥పడఁతి॥

లలితాంగి నీదేహలత దలఁచి పో యువుడు[4]
చెలఁగి వనమునకు విచ్చేయఁడతఁడు
వెలఁది నీమోవికావిరి దలఁచి పో యతఁడు
తలిరాకు గని గుండె తల్లడంబొను ॥పడఁతి॥

---

1. ని-రే. ౧౪. వ్రాశె; ౩౦. వ్రాశె. 2. ౧౪. గుఁజెకు. 3. ని-రే. ౯. ౧౦౩. కాంబోది. 4. పా-రే. యతఁడు.

(మెఱఁత నీయూర్పుదెమ్మెర దలఁచి యాతనికి
మలయానిలము చూచి మరపాసు మేను)[1]

కోమలిరో నీయిల్లుకూటము బలఁచి పో
ప్రేమమితరములపైఁ బెట్టఁడతఁడు
దీమసపు వెంకటాధిపుఁడుగన యాతనికి
సామాన్యసరసతలు సరకుగావరయ. ॥పడఁతి॥ 319

## ముఖారి

ఏలే[2] పడుసా యేదేసె గుడుసా
చాలునేఁపకువే జవ్వనంపు గడుసా ॥పల్లవి॥

వద్దేలే కసరు వలవని కిసరు
పొద్దువొద్దులకుఁ జూపుల యసురు
పెద్దైన వలపుల పిసరు లోన
న్నద్దేవు నేనై తిననురుసురు ॥ఏలే॥

వచ్చెనేననవే నా వలపు చేకొనవే
మచ్చుచల్లక నామాట వినవే
ఇచ్చేననవే[3] నీహృదయమింతటనైన
రిచ్చవడిన నాకూరిమి గనుఁగొనవే ॥ఏలే॥

రావే సంగడికి రతుల యంగడికి
శ్రీ వేంకటేశుఁడ[4] నా చెంగటికిని
పోవే కౌఁగిటికి నిధులలోఁగిటికి
మోపివే వెరవక మోహపుటాఁకటికి. ॥ఏలే॥ 320

1. ని-రే. ౯. లోనిది ఈ చరణపు ఉత్తరార్థపాఠమిది. 2. ని-రే. ౧౫, ౩౯. యాలేలే. 3. ని-రే. ౩౯. ఇచ్చేనేననవే. 4. ని-రే. ౧౫, ౩౯. వేంకటపతినా.

### తెలుఁగుఁ గాంబోది

చక్కఁదనములనే వేసాలఁబొయ్యేవు నీ
యెక్కువతె యింతసేసె నెక్కడ చొచ్చేవే ॥పల్లవి॥

వెన్నెలలకునె యింత వెరచేవు నీమోము
వెన్నెలచే నెట్టు వేఁగించేవే
సన్నపుఁ దేంట్లకిట్టె జడిసేవు నెలఁత నీ
యిన్ని నెరిఁదుమ్మెదలకెట్ల[1] లోఁగేవే ॥చక్క॥

చిలుకలకునే యింత చిమిడేవు నీ చిలుక
పలుకుల నెక్కడికిఁ బారఁదోలేవే
చలిగాలికినె యింత జడిసేవు నెలఁత య
గ్గలపుటూర్పుగాలికెక్కడ[2] నొదిగేవే ॥చక్క॥

మదనుఁడనినను వేమారు గలఁగేవు నీ
మదనగురునికెట్టు మనసిచ్చేవే
ఇదె వేంకటేశుఁడు నిన్నెనసి కౌఁగిటఁగూడె
పొదలుఁదావులకెట్టు పొంగుచుఁ జొక్కేవే. ॥చక్క॥ 321

### వరాళి

చూపులనే సొలసేవు చూడరాదా మమ్ముఁ
గాఁపురము సేయనీక కారించేవా ॥పల్లవి॥

వదినెంటాఁ బిలిచేవు వద్దు సుమ్మీ యెవ్వరోయి
వదినెలు నీకు[1] వాడవారి మరఁది
యెదురైతే మొక్కేవు యేఁటికోయి యింతేసి
పుదుటులు మాని[2] చక్కనుండనేరవా ॥చూపు॥

---

1. ని-రే. ౩౯. కేలలో. 2. ౧౫, ౩౯. నీ-వాలికేటిగాలికెక్కడ. 3. ని-రే. ౨౦, ౧౧౩. వదినెలు వాడ. 4. పుదుటులు చక్క.

అత్తనంటాఁ బిలిచేవు అక్కడ నిక్కడ నీకు
అత్తలెవ్వరోయి వూరఁ బొత్తులల్లుఁడా
వత్తునంటాఁ జెప్పంపేవు వడదాఁకి కూకులును
వత్తులునై పోదుఁగాని వచ్చి చూడరావా[1] ॥చూపు॥

చీర వెలిగా నవ్వేవు చెల్లఁబో యెక్కడనైన
మానుజాతి వారికైన మానములేదా
తీరు నీకు నింతేసి తిరువేంకటేశుఁడ
కూరిమి యెరిఁగి నన్నుఁ గూడితివౌరా. ॥చూపు॥ 322

కొండమలహరి

కొండలోఁ[2] గోవిల గుయ్యి గుండె వగిలె నీ
యంతకు రాఁగాఁ బ్రాణమంతలో బ్రదికెరా ॥పల్లవి॥

వలచి నిన్ను వెదకి వడి నే రాఁగాను
పులివలె మగఁడుండెఁ బోనియ్యక
ఉలఁచి నాకంతలోనే తల నొవ్వఁగాను
చిమకుఁ బులకలెత్తి సిగ్గుమాలె వలపు ॥కొండ॥

ఏమరించి యింటివారినెడసి నే రాఁగాను[3]
గామైన బిడ్డయేడ్చెఁ గదలనీక
తామసించి యుండలేక తల్లడించఁగాను
చీమలు మైవాఁకినట్టు చిమ్మిరేఁగె వలపు ॥కొండ॥

వుండలేక యిప్పుడు నీ వొద్దికి నే రాఁగాను[4]
కొండవలె మరఁదుండెఁ గోపగించుక
బొండుమల్లెపరపుపైఁ బొరలేటి యిట్టి[5] నన్ను
కొండలరాయఁడ నిన్నుఁ గూడించె నావలపు. ॥కొండ॥ 323

---

1. చూడవేరవా. 2. వి-రే. ఇ-ఆ. కొండలఁ. 3. రాఁగా గామైన. 4. రాఁగా కొండ. 5. బొరలే యీ నన్ను.

భూపాళం

రాయడికాఁడు గదమ్మ [1] రంతు సేసీని
పాయపుసతులసే గోపాల గోవిందుఁడు ॥పల్లవి॥

వట్టిమాయలఁ బెట్టవలదన్న మానఁడు
బెట్టుగ రేపల్లె గోపికలనెల్ల
యెట్టు వేగింతురమ్మ [2] యెల్లవారలును
రట్టడియైనట్టి రాచగోవిందుఁడు ॥రాయ॥

లేని పగలు చాటి లేమలనిందరిని
కాని కానిమ్మనుచుఁ గరఁగించీని
మాని మాని కమ్మర మగుడ మమ్మేఁచీని
రానిలే చూచుఁగాని రాచగోవిందుఁడు ॥రాయ॥

పొద్దు వొద్దునకెంతే బూమెలు [3] సేయుచును
వొద్దికై నాతోఁడ వొనగూడీని
అద్దో యింకా మానఁడాసలఁ బెట్టెడిని [4]
గద్దరి శ్రీ తిరువేంకటపు గోవిందుఁడు. ॥రాయ॥ 324

86-వ రేకు. ఆహిరి

జట్టిగొనెర నిన్ను జవరాలు
చిట్టంటు చేఁతల [5] జెలఁగితివపుడు ॥పల్లవి॥

వాలుకచూపులు వాడఁగ నాటక [6]
సాలలోన నిను జవరాలు
చాలుగ మురియుచు సరుగనఁ జీవుకన
కాలఁ జిమ్మినను కలఁగితివపుడు ॥జట్టి॥

1. ని-రే. రారా. గదవే. 2. గింతుమమ్మ. 3. బూమెలే. 4. సలుసేసీని.
5. ని-రే. రారా. టుఁజేఁతల. 6. నాఁటిక.

కొలువుగొనుచు మించుల మొలనూళ్ళ
    సొలపుల మురిపెపు జవరాలు
    గలగల గజ్జెలు గదలఁగ నునుఁదొడ
    బలిమిఁ గదలిచిన బ్రమసితివపుడు ॥జట్టి॥

కొంపగు తల [1] చంచుల (?) మునివేళ్ళ
    సంపద నడపుల జవరాలు
    యింపులు నెరపుచు నిటు నినుఁ గదిసిన [2]
    కంపించితి వేంకటగిరిరమణ. ॥జట్టి॥ 325

సామంతం

అద్దిర చిమ్ముల మాటలప్పటి నీకు
    పెద్దరికాలనె [3] మురిపెములే చిమ్మేవు ॥పల్లవి॥

వద్దన్న మానవు నేనెవ్వతెరా నీకు నీ
    నిద్దురచూపులు నాపై నివాళించేవు
    బద్దులెల్లనేడ నగపడెరా నీకు యీ
    ముద్దులమాటలాడుచు మోమే వంచేవు ॥అద్దిర॥

డెందములో నేనిఁక నేఁటికిరా నీకు నీ
    యందిపాటుచేఁతల నన్నలయించేవు
    కిందిచూపులేడ దొరకెరా నీకు నీ
    చెందమ్మిచేతుల నాచెఱఁగువట్టేవు ॥అద్దిర॥

బింకములెవ్వతె నేరిపెరా నీకు నీ
    కుంకుమపూఁతలే [4] చెరఁగునఁ గప్పేవు
    యింక నిన్నియునేల యిదె నీకు తిరు
    వేంకటేశ నాకౌఁగిట వేడుకఁ గూడితివి. ॥అద్దిర॥ 326

1. తళచంచుల. 2. చు నిధె వేంకటపతి. 3. ఇది ని-రే; సా-రే. పెద్దరికేలనె.
4. పూఁతల.

రామక్రియ

పంతమాడి పిలిచినఁ బలుక దెవ్వరితోడ
ఇంతవలచిన వలపెందునైనఁ గలదా ॥పల్లవి॥

వెక్కసపు గుబ్బలపై వేసిన కప్పురమెల్ల
నొక్కమాటే నీరాయనోయమ్మా
మిక్కుటమైన దీని మేనిమీఁది వెక్కచూచి
వక్కలాయ గుండె బుట్టి వలపెందుఁగలదా ॥పంత॥

గుప్పెడి నిట్టూరుపుల కోమలిహారములెల్ల
వుప్పరాలెగయఁ జొచ్చెనోయమ్మా
వుప్పతిల్లుఁ జెమటల [1] నోలలాడఁగానె మేను
నిప్పువలెనున్నదిట్టి నెయ్యమెందుఁ గలదా ॥పంత॥

కొయ్యతనమునని ట్టె కోనేటిరాయనిఁగూడి
వుయ్యాలమంచముమీఁదనోయమ్మా
పయ్యెదచెరఁగు జారఁ బచ్చిసేఁతలిన్నియును
ముయ్యఁజూచీ నిటువంటి మోహమెందుఁ గలదా [2]. ॥పంత॥ 327

ధవళి [3]

ఎపుడు నాయెడ నేకు నిదివలెనా
కపటాలు నిజములు కలిగినాతఁడవు ॥పల్లవి॥

వెల్లిగా నీవూర్పు వేదముట వేఁడి
చల్లని శ్రుతికి నుష్ణము గలదా
పెల్లుగ నిరువంకఁ బిరువీకులై వేఁడి
చల్ల నిదైనా వెచ్చనిది గావలదా ॥ఎపుడు॥

1. వి-రే. ఉదా. ల్లుఁ గోరికల. 2. ఈ చరణము వ్రాయుటకు చోటువిడువఁబడినది. వి-రే. లో. 3. వి-రే. ౩౦. గుజ్జరి.

నగు నీమాటలే పురాణంబులట బొంకు
    వగిలేని చదువులింతయు బొంకులా
తెగి యిరువంకలఁ దీదీపులై నీ
    పొగరుల [1] మాటలెప్పుడును నిక్కము [2] లా ॥ఎపుడు॥

చలివేఁడిచూపుల జాణవట యిట్టె
    బలసి నాపైఁ బరపఁగవలెనా
కలికివై తిరువేంకటవిభుఁడ నన్నుఁ
    గలయక యలయించి కలసితివిపుడు. ॥ఎపుడు॥ 328

శ్రీరాగం – రచ్చెతాళం

కనలకువే మతి కలఁగిని యీ
    వనజోదరుఁడిదె వచ్చీవిపుడు ॥పల్లవి॥

వడిఁ గుచభరమున వ్రాలెడి వేగము
    నడవకువే సన్నపు నడుము
చిడుముడి నన్నుఁజేసిన [3] గోవిందుఁడు
    తడయఁడు [4] నిన్నుఁ దగిలీనిపుడు ॥కనల॥

కొప్పువేఁగునని కుదిసిన మెడ గడు
    తిప్పకువే కందెడి సరులు
దప్పి వొదలఁ బరితాపము నీమై [5]
    కప్పిన శ్రీహరి గదిసీఁ గాని ॥కనల॥

పొరలుచు నిట్టూర్పులనుసురనియెదు
    వెరవకుమెన్నఁడు [6] వేదనల
కరఁగి నీవు వెంకటపతికౌఁగిట
    మెరసితివిటు [7] కడు మించిన రతుల. ॥కనల॥ 329

---

1. సా-రే. పొసురుల. 2. నిక్కెము. 3. ని-రే. ౫౭. ముడివే విమఁజే; రా-౨. నినునేఁజే. 4. తడసఁడు. 5. నీవే కప్పిన శ్రీహరిఁ గది. 6. వకువే వడు. 7. తివి కడు.

ఆహిరి

అలికె సంపెఁగతావికణఁగి [1] నట్టు
తొలఁగీ నుదుట జారి తుమ్మెదల పిల్లలు ॥పల్లవి॥

వెలఁదియారను [2] పాము వెంటఁబెట్టుకొని రాఁగా
తలఁకి చంద్రుఁడు వోయి దాఁగినట్టు
పలువన్నె మెఱుఁగుల పయ్యెదలోనె దాఁగె
చలివేఁడి మెఱుఁగుల చందమామపిల్లలు ॥అలికె॥

కోవిలపలుకుదాడి కోపగించి వెంటరాఁగా
తావుల చిగురువోయి [3] దాఁగినట్టు
మోవి సూదివాటులై [4] మొనసి కానవచ్చెను
మావుల చిగురులోని మాణికాలపిల్లలు ॥అలికె॥

ఘోరమైన విరహతాపపు సూరియుండు [5] రాఁగా
తారితారి చకోరాలు దాఁగినట్టు
కూరిమి వెంకటపతిఁ గూడిన తమకమున
గోరగించీనిదివో చకోరముల పిల్లలు. ॥అలికె॥ 330

87-వ రేకు. ముఖారి

చాలుఁ జాలు నీ జాజర నన్ను
జాలిఁ బరచె [6] నీ జాజర ॥పల్లవి॥

పలవు వేదనల వాడేను యీ
తలనొప్పులచేఁ దలఁకేను
పులకలమేనితోఁ బొరలేను కడుఁ
జలిగొని చల్లకు జాజర ॥చాలు॥

1. ని-రే. ౧౧౩. తావి అణఁగి. 2. తా-వెం. యూరని పాము. 3. రుదోయి. 4. ని-రే. వాట్లమొ. 5. సూర్యుండు. 6. పె-రే ౨౩. జరచె

ఒల్లసి నిసుఁగని వుడికేసు నీ
చిల్లరచేఁతలఁ జిమిడేసు
కల్లగందవాడిఁ గాఁగేసు పైఁ
జల్లకు చల్లకు జాజర ॥చాలు॥

తివిరి వేంకటాధిప నేసు నీ
కవుఁగిటికబ్బితిఁ గడు నేను
రవరవ చెమటఁ గరఁగి నేఁడు యిదె
చవులాయసు నీ జాజర. ॥చాలు॥ 331

## శ్రీరాగం

విరహంపుఁ గోమలికి వెలయంగఁ గలవెల్ల
అరుదుగాఁ బండి పొల్లయిన ఫలమాయె ॥పల్లవి॥

వేమారుఁ జెలికి నరవిందశయ్యలె పరవ
బాముచెడి యిందునే బడలెఁ గాని
తామెరై [1] డెందమీ తలిరుదేహములోన
లేమకిది గలిగియును లేని ఫలమాయె ॥విరహ॥

వెలఁదిమై సురటులనె [2] విసరఁగా లలితాంగి
నలమి అదియే తాపమయ్యెఁగాని
పెలుచైన నిట్టూర్పు పెనుగాలి లోలోన
కలిగియును తమవారుగాని ఫలమాయె ॥విరహ॥

కాంత కనుదోయి నుసుఁగలువలై కలువలనె
అంతకంతకు వగల నలసెఁ గాని
యింతలోఁ దిరువేంకటేశుఁ గూడియుఁ జెలికి
చెంతనే కనుదోయి చెంగలువలాయె. ॥విరహ॥ 332

---

1 వి-రే. ౩౭. తామెరె. 2. సురట్ల విసర,

ఆహిరి

మోవిపై వీడెపు కెంపు ముచ్చటాడఁగ
చేవచ్చి చిగురుపైఁ జిమ్మిరేఁగీనే ॥పల్లవి॥

వాసనగుబ్బలమీఁద వల్లెవాటుగా జార
వేసిన పయ్యెదకొంగు వెంటఁ దూలఁగ
తీసిన ఘాతల ముద్దుఁదీగె చందురులమీఁదఁ
గాసేటి వెన్నెలవలెఁ గానవచ్చీనే ॥మోవి॥

వేఁకపు నెరులకొప్పు వెక్కసపు విరులతో[1]
తేఁటువమీరఁగఁ గడు[2] దీపించఁగా
చీఁకటిలోపల మించు చిన్నిచిన్ని వెన్నెలల
తోఁకచుక్కలై[3] చూడఁ దొంగలించీనే ॥మోవి॥

పాదముల దాటించు పసిఁడి మట్టెల మోఁత
మోదపు కంకణరవముల మీరఁగా
గాదిలి నీ కాఁగిటి[4] వేంకటపతిమీఁదిపాటు
వేదముల మీరినట్లు వెదచల్లీనే. ॥మోవి॥ 333

మాళవిగౌళ

చాఁచిన చలముల సటకాఁడ యిట్టె
వేఁచితివిపుడు నీవే కావోరి ॥పల్లవి॥

విరులు గోయఁగ నన్ను వేడుకతోఁ జూచి
విరులెంత ప్రియమో యీ వెలఁదికని
మరుని తియ్యని వింటి మాయపుఁ గ్రొవ్వాఁడి
విరులేయించితివి నీవేకావోరి ॥చాఁచిన॥

---

1. పె-రే. ౨౩. విరులతో. 2. మీరఁగడు. 3. ని-రే. ౭౫. చుక్కలే. 4. 'కాఁగిట' అనియే అన్నిరేకులందును రూపము.

జలము గేళాకూళిఁ జల్లులాడఁగఁ జూచి
జలమెంత ప్రియమొ యీ సతికినని
చెలఁగి కాఁక [1] చెమట చెలమ నాపై నేఁడు
వెలయఁ జేసితివి నీవే కావోరి ॥చాఁచిన॥

తొడవులిడుచు నేను తొంగలించఁగఁ జూచి
తొడవులే ప్రియము యీ తొయ్యలికని
కడుఁదొడవులే వేంకటరాయ కొనగోర
విడువకిచ్చితివి నీవే కావోరి. ॥చాఁచిన॥ 334

దేశాక్షి

ఎప్పుడు వచ్చునో యంటా నెదురు చూచీఁ బతికి
దప్పిదేరు మోముతోడ దాఁచలేదు ప్రియము ॥పల్లవి॥

వేఁటవోయినమగఁడు వీధి రాఁగాఁ గిన్నెర
మీఁటుచుఁదా నిక్కిచూచి మేడపైనుండి
గాఁటపు గుబ్బలకొంగు గప్పదు జారిన నింత
ఆఁటది పలచెనేని ఆఁపరాదు ప్రియము ॥ఎప్పుడు॥

ఇంతి చూడఁగానె విభుఁడేతుల [2] గుఱ్ఱము దోలి
చెంతనున్న సతులెల్ల చేతఁజూపఁగా
అంతలోనె యాకె తనువంతయుఁ బులకించె
పంతపుసతులకైనఁ బట్టరాదు ప్రియము ॥ఎప్పుడు॥

తేఁకువ మెరసి రాఁగా తిరువేంకటేశుఁ జూచి
వేఁకపుఁదురుముతోడ విఱ్ఱవీఁగని
కాఁకతోడఁ జిత్తమెల్లఁ గరఁగి నీరై మించె
యేఁకట నెవ్వరికైన నెంతగాదు ప్రియము. ॥ఎప్పుడు॥ 335

1. ని-రే. ౬౯. నీ కాఁక. 2. ని-రే. ౪౭. దేతువ.

సామంతం

ఎవ్వరికిఁ జెల్లునమ్మ యింతేసి పనులు
నొవ్వని నొప్పులతోడ నొగిలీఁ జెలియ ॥పల్లవి॥

ఏఁగెడి తురుముతోడ వేఁకపు సొమ్ములతోడ
కాఁగిన దేహముమీఁది కస్తూరితోడ
ఆఁగిన యాసలతోడ సతిరాజసముతోడ
వేఁగెడిఁ బ్రాణేశుఁబాసి విరహాసఁ జెలియ ॥ఎవ్వరి॥

విప్పని రెప్పలతోడ వేఁడిచెమటల[1] తోడ
పుప్పొడి దాఁకినమేని పొక్కులతోడ
కప్పక కప్పిన మంచి కలికిపయ్యెదతోడ
కప్పురపుటూర్పులఁ గరఁగీఁ జెలియ ॥ఎవ్వరి॥

భావపువింతలతోడ పచ్చిసింగారముతోడ
ఆవులు వారెడిమేని అలపులతోడ[2]
శ్రీవేంకటేశ్వరుఁగూడి సిగ్గులగర్వముతోడ
ఆవలిమోమై మాఁటలాడీఁ జెలియ. ॥ఎవ్వరి॥ 336

8-వ రేకు. కాంబోది - ఎకతాళి

భారపుటూర్పులతోఁ బవళించీని వీఁడె
కూరిమిసతులు మేలుకొలుపరమ్మా ॥పల్లవి॥

వేగినంతకునితఁడు వెలఁదులతోడి రతి
భోగించి వచ్చి నిద్రవోయీని
సోగకనురెప్పలు మూసుక యిప్పుడెంతేసి
జాగరపుఁ బతితోడ చరచరమ్మా ॥భార॥

1. చెమటలోడ. 2 అలపుతోడ.

వొప్పైన సతులతో వుదరములోపల[1]
యిప్పుడు నితఁడు సుఖియించీని
చప్పుదేరు తనమోముఁదమ్మితోడనిదె వీఁడె
వుప్పవడముగఁ బాదాలొత్తరమ్మా ॥ధార॥

మెరుగన మేలుకొని సరసపుఁ గౌఁగిట
గరగరికెల[2] నన్నుఁ గలసీని
అరవిరి నురమున అలయుచును వీఁడె
తిరువేంకటపతిఁ దెలుపరమ్మా. ॥ధార॥ 337

కన్నడగౌళ

తరుణికనుఁగవ మోవు తగఁ జూడరే
వరునిఁ దనమతి నొలసి వడిఁ జూచినట్లు ॥పల్లవి॥

వెలఁది ముక్కునను వెడలు వేఁడి నిట్టూరుపుల
చెలువమెటువలెనుండెఁ జెప్పఁగదరే
చలముకొను నలులకును సంపంగిపెనుగాలి
కలకంటిమేనికిని కాపిడినయట్లు ॥తరుణి॥

పడతిపైఁ సునుఁజెమట పన్నీటితావితో
బడిబడినె యెట్లుండె భావింపరే
అడరు విరహానలంబప్పటప్పటికార్చ
కడువేగముదకముడుగక చల్లినట్లు ॥తరుణి॥

ఇంతినెన్నుదుటిపై నిపుడు చెదరిన కురులు
వింతలై యెట్లుండె వివరించరే
సంతమై వేంకటేశ్వరుఁడు చెలినేఁపు శశి
పంతముడుపఁగఁ దమము పరె(రి?) విడిచినట్లు. ॥తరుణి॥ 338

1. వి-రే. ౧౧౦. లోకాల. 2 గరగరికెల.

రామక్రియ

తమకమును వలపోఁతయును గలదెందాఁక
అమరఁ జెలువము దనకు నందాఁకఁ దరుణి ॥పల్లవి॥

విరసంపు[1] మరునిపై వెరపు మతికెందాఁక
అరయఁ దనయాపదయు నందాఁక
సిరిదొలఁకు జవ్వనపు సిగ్గు సికెందాఁక
అరవిరి విలాసంబునందాఁకఁ దరుణి ॥తమక॥

ఎనయు ముదములును దనయేతులును నెందాఁక
అనుఁగుఁగోరికలు దనకందాఁక
కనుఁగొనల నవ్వులును కాఁకలును నెందాఁక
అనవరతసుఖము దనకందాఁకఁ దరుణి ॥తమక॥

తలఁపు వేంకటవిభుని తగులు గలదెందాఁక
అలుఁదెలువులు మతులునందాఁక
కలయునాతని చనవు కరుణగలదెందాఁక
అలవోక పరిణతులునందాఁకఁ దరుణి. ॥తమక॥ 339

సామంతం

బొంకకురే చతురుఁడప్పుడె వచ్చీనా
సుంకు దేరిఁ[2] జూపు మంచి సుద్దో మద్దో[3] ॥పల్లవి॥

వన్నెలాఁడి చెలి నీవు వచ్చుదాఁకా యిట్టె
వున్నదానఁ బ్రాణములునుచుకొని
వున్నతుఁడా[4] తఁడు మమ్ము నొలిసీనా[5] యేటె
కన్నుల నవ్వేవు చెలి కాయో పండో ॥బొంక॥

1. ని-రే. ౧౦౧. విరసపు. 2. సా-రే. సుంకుదేరిచూపు. 3. ౘ.రే. ౯౨. సుదో మద్యో. 4. వున్నవాఁడాతఁడు. 5. నొలిచీనా.

చక్కనమ్మ నీమాఁట చల్లుదాఁకా యీ
చెక్కుమీఁది చేతితోను చింతించేను
నెక్కమునాతనికింక నేనేలే[1] నీవు
నొక్కకువే నాచెక్కు నుయ్యో కొండో ||బొంక||

కప్పురగంధి యింత దగ్గరకువే నీ
వప్పుడే కౌఁగిట నన్ను నలమేవు
అప్పుఁడు వేంకటవిభుఁడలరించె నిదె
యిప్పుడె యీతనికృప యీఁతో మోఁతో. ||బొంక|| 340

వసంతవరాళి

నిలు నిలు దగ్గరకు నీ యాన[2] నీకు
వలచితినని మావారెల్ల నగరా ||పల్లవి||

వద్దు వద్దు కొండలలోవారికి మాకింతేసి
పెద్దపెద్ద ముత్యాలపేరులిన్నేసి
అద్దము చూచిదె నాకు నంతకంటె సిగ్గయ్యీని
గద్దరి మాచెంచువారు గని నన్ను నగరా ||నిలు||

వాయఁజాలు బంగారు సరుపణు[3] యుంగరాలు
నీలపుఁగంట సరులు నీకే వుండనీ
మూలనుండేవారు గాక ముత్యాలచెరఁగుల
చేలగట్టుకొన్న నన్ను చెంచెతలు నగరా ||నిలు||

రాకురాకు యీడకు[4] నీ రమణుల పాదమాన
నాకు నీకు నింతేసి ననుపేఁటికి
దీకొని కూడితి నన్ను తిరువేంకటేశ యీ
కాకరిచేఁతలకు లోకమువారు నగరా. ||నిలు|| 341

---

1. పె-రే. ౨౭. నేనేల. 2. ని-రే. ౩౧. రకు నీకు నీ. 3. పె-రే. ౨౭. సరపణు.
4. ని-రే. రాకు నీకు నీరమ.

మలహరి

నిద్దిరించీ పాల (చీ: బాల ?) జలనిధివలెనే
వొద్దిక శ్రీ రమణునికి వొత్తరే పాదములు ॥పల్లవి॥

వేగుదాఁకాఁ జిత్తగించి విద్యలెల్ల నాదరించి
బాగుగాఁ గృపారసము పంచి పంచి
యేగతిఁ బవ్వళించెనో యెట్ల భోగించెనో
యోగీంద్రవరదుని వూఁచరే వుయ్యాలను ॥నిద్ది॥

వాలుఁగన్నుల రెప్పల పడదాఁకి తనుతావి
చాలుకొన్నవూర్పులు చల్లి చల్లి
నీలవర్ణపుగుణము నెరపుచు నొకయింత
కాలము గన్నులఁ దిప్పిక (ప్పేఁగ?) ప్పరే దోమతెర ॥నిద్ది॥

సరుగన యోగనిద్ర చాలించి లోకమెల్లఁ
గరుణించఁ దలఁచి వేంకటగిరిపై
అరుదుగ సకలలోకారాధ్యుఁడయి మించి (చీ ?)
విరివి నాలవట్టాలు విసరరే సతులు. ॥నిద్ది॥ 342

89-వ రేకు. శ్రీరాగం

అటు గొంతకాలంబులనుభవించఁగఁ గలిగె
యిటు గొంతకాలంబు యివి[1] చూడవలసె ॥పల్లవి॥

వెన్నెలలుఁ జీఁకట్లు వెలఁది సుఖదుఃఖములు
కన్నుదెరచి మూయుటలు గతులు నవగతులు
పన్ననలు వొల్లములు మగువ పగలును రేయి
తన్నుఁదానె సమకూడుఁ దనుఁదానె తొలఁగు ॥అటు॥

1. వి.రే. ౫౬, యిది.

కింద మీఁదై వచ్చుఁ గెనుకయును వాలిములు
ముందు వెనకగుఁ దెలియ మోదఖేదములు
పొందికయు పాయుటయు వొలఁతి[1] సౌభాగ్యములు
ఇందరికి సరిగాఁగ నెదురెదురునుండు ॥అటు॥

మరచినను తలఁచినను మనసు తనపైనుండు
పెరుఁగునది తిరువేంకటేశ్వరుండు
తెరవనిదె కరుణించె దేవుఁడే[2] నాయకుఁడు
తరితీపుసేయుఁ[3] గాని తలఁపులోనుండు. ॥అటు॥ 343

ఆహిరి

అప్పమైన సియరే యమ్మలాలా నేఁ
డప్పుఁడా[4] ర గించినదె యమ్మలాలా ॥పల్లవి॥

వాడుదేరి వదనము వడదాఁక[5] నిందాఁక
నాడివచ్చెఁ[6] జూడరే యమ్మలాల
నీడకేఁగనెరఁగఁడు నిక్కపు బాలునివలె
ఆడనీడ[7] దిరిగాడీనమ్మలాల ॥అప్ప॥

వెడ్డు వెట్టీనాటలకు విచ్చేసేనని నన్ను
నడ్డములాడకురే యమ్మలాల
దొడ్డివారియిండ్లెల్లాఁ దూరి తూరి పారాడీ
నడ్డములు నిడుపులు నమ్మలాల ॥అప్ప॥

వేఁకువజాముననుండి వెయిమారులారగించు
నాఁకటికోరువలేఁడమ్మలాల
తేఁకువ వేంకటగిరిదేవుఁడైన బాలుఁడిదె
ఆఁకతాడువట్టి తీసీనమ్మలాలా. ॥అప్ప॥ 344

---

1. పొలఁతి. 2. దేవుఁడీ. 3. సా-రే. శేసు. 4. ని-రే. ౧౧. డప్పుదా. 5. దాఁకె. 6. వచ్చీఁ. 7. నీడాఁ బారాడీ.

నారణి

పంతపు బిగువులఁ బదరేవు నీ
వంతలు [1] మానుప వసమా వోరి ||పల్లవి||

వేఁకపుఁ జుంజుముల వెలఁదుల యలకల
చీఁకటి దవ్వుచుఁ జెలఁగేవు
ఆఁకటి చూపులనలసి మలయు నీ
కాఁకలు మానుపఁగలనా వోరి ||పంత||

సన్నపు నగవుల సతుల కపోలపు
వెన్నెలచే నిటు వెదకేవు
వన్నెలతనువున వాడుచు నొయ్యన
తన్నేవు నేనితరమా వోరి ||పంత||

వడఁతుల కుచముల పరిమళపుఁ జెమట
తడిపయ్యెదలను దాఁగేవు
కడుఁ గౌఁగిట వెంకటగిరివర నను
పుడికెదవంతహోవుదునా వోరి. ||పంత|| 345

ఆహిరి

వచ్చిదేరే వలపు బయలువెరపు
నచ్చుగోరి నాటు కిన్నరి తంత్రి మీటు ||పల్లవి||

వెలయఁ జల్లనిగాలి విధుకెదిర్చిన జాలి
తలఁప పూధూళి చిత్తజు వయ్యాళి
కలయ వెన్నెల వెయఁగు కాలకూటపు నలుఁగు
వయికుఁ దేనెలచిందు బడబాగ్నివిందు ||వచ్చి||

1. పె-రే. ౨౫. వంతులు.

అగడుఁ గోవిలకూఁత అంగన నొసలివ్రాఁత
    పగనిగని పన్నీరు నిప్పులయేరు
సొగసుచాలనిచోటు చుఱుకుటలుగుల పోటు
    నగవుఁజిలుకల పడుగు నమ్మించు పిడుగు ॥పచ్చి॥

తనివోని రతికాఁక తప్పుసేయని యాఁక
    వనితకీపతిమాట వలపుమూట
వినయంపు రతికింపు వేంకటేశ్వరు సొంపు
    తనువుమెత్తనిపరపు తనువెల్లమరపు. ॥పచ్చి॥ 346

## ఆహిరి

ఉవిదతనులత యేఁటికులికి పడెనే
    కవ మదనబాణాగ్నిఁ గాఁగదుగదా ॥పల్లవి॥

వనితలావణ్యంపు వదనశశికలములు
    చనుగిరులపై నేల జారిపడెనే
    పెనకఁ దుర (రు ?) మను రాహు వేవేలు రూపులై
    తనర ముఖచందురుఁడు తలకఁడుగదా ॥ఉవిద॥

మొలకలై గుములై ముదితమై మరునంప
    ములుకులంతటనేల ముణుఁగఁబడెనే
    పొలయు మరునస్త్రములు పుంఖానుపుంఖములు
    పొలఁతిమీఁదనె రాశివోయఁడు గదా ॥ఉవిద॥

కొమరైన పెనుదండు కుసుమాయుధుఁడు గదలి
    తెమలి రాకిపుడెట్లుఁ దిరుగఁబడెనే
    విమలాంగికౌఁగిటను వేంకటేశ్వరునిఁ గని
    భ్రమసి ప్రతిదండనుచు పదరఁడుగదా. ॥ఉవిద॥ 347

ముఖారి

చెప్పిన హృదయము దలఁకెడు చెలి దానిపుడెట్లున్నదో
అప్పుడు పరితాపంబున నలసిన చందములు ॥పల్లవి॥

వేడుకతో సంగీతము విని కన్నుల మెచ్చుచు [1]
నాడుచుఁ బ్రాణేశ్వరుఁగొనియాడెడి చందములు
కాడిన మర్మపుమాటల కంపంబునఁ దలయూఁపుచు
చూడక చూచిన చూపుల చొక్కెడిచందములు ॥చెప్పిన॥

చనుఁగవ సన్నపు చెమటలు జారెడి పయ్యెదనార్చుచు
నొనరిన నిట్టూర్పులచే సూటాడెడి చందములు
తనువునఁ బలుమరుఁ బొడమెడి దట్టపు పులకాంకురములు
అసువున మెత్తక (?) కరమున నంటిన చందములు ॥చెప్పిన॥

తిరువేంకటగిరివల్లభు దేవశిఖామణికౌఁగిట
తరుణి మనోభవుబారినిఁ దప్పిన చందములు
యిరవుగ నాతని చేఁతల నింపగుఁ బరవశములచే
దొరలిన మరపుల నెరుకలఁ దూలెడి చందములు. ॥చెప్పిన॥ 348

90-వ రేకు. ముఖారి

కొండల గుబ్బల [2] నాతో గోరాదిగొనేవు [3]
కొండల నావులఁగాచిన [4] కోడెకాఁడఁ గాన ॥పల్లవి॥

వంకలకురులదాన వద్దు నే నీకు మూఁడు
వంకలవెంటఁ [5] దిరిగేవాఁడఁ గాన [6]
సంకుమెడదాన నీతో సరివచ్చేనా [7]
సంకుచేతి నన్ను నీవు జట్టిగొంటి చాలదా ॥కొండ॥

---

1. ఈ పాదపు రెండవభాగమున రెండు మాత్రలు చాలవని తోఁచుచున్నది. 2. పె-రే. ౨౭. గుచ్చిల. 3. ని-రే. ౭౬. గొంటివి. 4. గాచే. 5. వంకల మేనుఁ దీఁగెవాఁడ. 6. నేఁగాన. 7. చ్చేనా నా.

యేనుఁగు నడపుదాన నేల నే నీకు[1] తొల్లి
యేనుఁగుఁ గాచినవాఁడ యేనుఁగాన[2]
మీనుకవగంటిదాన మెచ్చేవా నన్ను మేటి[3]
మీననై జలధిలో మెరసినవాఁడను[4] ॥కొండ॥

చీఁకటితురుముదాన చేరకు నన్ను[5]
చీఁకటి నల్లనిమేని చెలువుఁడను[6]
వేఁకపుఁ బిరుఁదుమీఁద వేయకు చెయి[7]
వేఁకమైన భూమిమోఁచే వేంకటవిభుఁడను[8]. ॥కొండ॥ 349

ఆహిరి

ఎడయాట మాటల[9] నేచినవలపు
పొడమిన యాసల పొద్దొకవలపు ॥పల్లవి॥

వేఁకమైన కోరికె వినుకలి వలపు
కాఁకలఁ బొరలుటెల్లఁ గనుచూపువలపు
మూఁకలైన తలఁపులు ముదిరినవలపు
ఆఁకలిదీరని పొందులడియాసవలపు ॥ఎడ॥

నడురేయి గమనము నాఁటినవలపు
విడువనితాపము వేఁడివేఁడివలపు
తడఁబాటు తానౌట తలఁపనివలపు
నిడివేఁడి యూర్పులు నెట్టుకొన్నవలపు ॥ఎడ॥

తిరువేంకటేశుపై తిరమైనవలపు
సరసరీతులచేత సరిలేనివలపు

---

1. నేలర నీకు. 2. యేఁగాన. 3. మీనుఁగవకంటి నన్ను మెచ్చేవా నీవు నే. 4. మీననై నీటిలోన మేటి జాణఁగాన. 5. నన్నుఁ నేఁ. 6. డనే. 7. పిరుఁదుపై వేయకు చెయి నే. 8. డనే. 9. పె-రే. ౨౭. మాఁటల.

గురుతైన రచనలు కూడినవలపు
తరుణికి నతనికిఁ దగులైనవలపు. ॥ఎడ॥ 350

నాదరామక్రియ

నెలఁతకుఁ గొండలతిమ్మని నేనిదె తోడ్కొనివచ్చెద
ఎలనాగయు మీరింపరు నేమరకుఁడి చెలిని ॥పల్లవి॥

వలపులరేనికి చెంగలువల[1] కొండము చొర మొక్కుఁడి
అలులకు పూఁదేనియ సోయగములు మెయికొనుఁడి
ఫలరసములు మీఁదెత్తుఁడి పసరి చిలుకలకును గోవిలలకు[2]
పొలఁతికి కెందమ్మిరేకులు పోయుఁడు బడిమిగను ॥నెలఁత॥

కట్టుఁడి సన్నపువలిపెము కర్పూరముఁ బన్నీరును
చట్టముగాఁ బైనలఁదుఁడి తరుణీమణికి
ఒట్టుఁడి జాజుల పరపున నొరపెరిఁగిన చెలికత్తెలఁ
బెట్టుఁడి మరుబలములచే బెగ్గిలి పడకుండ ॥నెలఁత॥

చిగురునఁ గెంపులు మొలచెను చిత్రము చూడఁగదమ్మా
మొగుడలపైనల చంద్రుని మూఁకలు మరిగినవి
మొగమున బిత్తరిచేఁతలు ముసు లేనివి చెలికత్తెలు
మగువయు (కు?) తిరువేంకటపతి మమతల పరిణతలు. ॥నె॥ 351

కేదారగౌళ

సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెదరోలాల[3] ॥పల్లవి॥

వనితల[4] మనసులు కుందెన చేసిటు[5]
వలపులు తగ నించో[6] లాల

1. పె-రే. ౨౭. చెంగలువలు. 2. ఇందు మాత్రాధిక్యము గాన వచ్చుచున్నది.
3. తా-వెం. ౧౦౧. రోలల. 4. వనితమన. 5. చేనేటి. 6. నిచ్చో.

కనుసన్నలనెడు రోఁకండ్లను
కన్నెలు దంచెదరోలాల ॥సువ్వి॥

బంగారు చెరఁగుల పుట్టుపుట్టముల
కొంగులు దూలఁగనోలాల
అంగనలందరు నతివేడుకతో
సంగడి దంచెదరోలాల ॥సువ్వి॥

కురులు దూలఁగ మంచి గుబ్బచన్నులపై
సరులు దూలాడఁగ నోలాల
అరవిరి బాగుల నతివలు ముద్దులు
గురియుచు [1] దంచెదరోలాల ॥సువ్వి॥

ఘల్లు ఘల్లుమని (ను ?) కంకణరవములు (ల ?)
పల్లవ పాణుల కో (నో ?) లాల
అల్లన నడుములు అసియాడుచు సతు
లొల్లనె దంచెదరోలాల ॥సువ్వి॥

కప్పుర గందులు కమ్మని పువ్వుల
చప్పరములలో నోలాల
తెప్పలుగా రతిఁ దేలుచుఁ గోనే
టప్పనిఁ బాడెదరోలాల. ॥సువ్వి॥ 352

శ్రీరాగం

కూరిమిచేఁతలు కొండలుఁ గోట్లయి
గారవించి యింతిఁగాచినది ॥పల్లవి॥

వన్నెల మాటల వాకిటితంగేటి
జున్నుకు వడగాలి సోఁకినది

1. మురియుచు.

విన్ననిచూపుల వెన్నెల బయిటను
సన్నపు ముత్యాలు చల్లినవి ॥కూరి॥

ముద్దుల నవ్వుల ముంగిటిబంగారు
అద్దములోఁ జిగురంటినది
తిద్దిన మెఱుంగు[1] దీఁగెకుఁ బన్నీట
నద్దుట గడు వేడుకైనది ॥కూరి॥

చక్కని కొండల చరులే (రిలో ?) వెన్నెల
వక్కలు పైపైనె వాలినవి
యెక్కువై శ్రీ వేంకటేశుని కౌఁగిటి
నొక్కుల కిట్టే నోఁచినది. ॥కూరి॥ 353

శ్రీరాగం

ఎట్టు ధరియించెనో యీ యింతి హృదయంబు
పట్టనెట్లోపునో ప్రాణవాయువులు ॥పల్లవి॥

పడియుఁ జెమటలనుఁ దుడువఁగరాని పన్నీట
తడియుఁబయ్యదయుఁ దత్తరమందు మనసు
సుడియుఁదమకములచే సొలయు నలపుల మేన
విడియుఁ బులకలు చూడ వెరగైన మోము ॥ఎట్టు॥

మరియుఁదలఁపులను జలమునఁ బొదలు మదనాగ్ని
నురియుదేహంబు గడు నుదుటుఁగోరికలు
విరియు మానంబు నరవిరి సొలపుమాఁటలునుఁ
గురియు మోహజలంబు కొదలుఁజూపులును ॥ఎట్టు॥

వెదచల్లునూర్పులును వెలితైన నవ్వులును
సదమదంబైన పలుచని మేనిపూఁత

1. పె-రే. ౨౭. మెఱుఁగు.

అదన శ్రీ తిరువేంకటాద్రీశు కౌఁగిటను
గదిసి యింపులఁ బొదలఁ గలిగె నీ చెలికి. ॥ఎట్టు॥ 354

91-వ రేకు. ఆహిరి

ఇంతి చేసిన భాగ్యమిట్లుండె దైవకృత
మింతయును గడవంగ నెవ్వరికి రాదు ॥పల్లవి॥

విరహవేదనచేత వేఁగెడి విలాసినుల
సొరిది నింతకు మున్ను చూడమో వినమో
అరుదైన దుస్తరంబై ధరించఁగరాని
దురవస్థలెవ్వరికి దొరకవనికాక ॥ఇంతి॥

తల దోఁకలేని చిత్తమున వలపులఁ బొరలు
పొలఁతులింతకుమున్ను పుట్టరో చనరో
అలవోక తెలుపులును [1] అబ్బురపు మరపులును
కొలఁదిమీరుట మిగుల గోరమనికాక ॥ఇంతి॥

దేవతాకృపగలిగి దివ్యవైభవములను
భూవలయమున సతులు పుట్టరో మనరో
శ్రీ వేంకటేశుఁడీచెలియకిచ్చిన చనవు
లేవెలఁదులకు నాతఁడియ్యఁడనికాక. ॥ఇంతి॥ 355

భైరవి

ఎవ్వతెరా నినుఁజూచె నేమని పుత్తెంచె
పువ్వుబంతి నిను వేసి పొందుచూపి మొక్కినది ॥పల్లవి॥

వీడియు వీడని కొప్పు వేఁగున వీఁగుచు మాట
లాడియు నాడక చెలినల్లన దూరినది
వాడియు వాడని తమ్మివంటిమోము గలది తాఁ
జూడక చూచిన వాలుఁజూపుల బిత్తరిది ॥ఎవ్వతె॥

---

1. పె-రే. ౨౭. తెలుపులును.

జారియు జారని సుబ్బచన్నుల పయ్యెదది లో
నారియు నారని కోపమైన మోహముది
పేరియుఁ బేరనికాఁకఁ బెచ్చువెరిగినది తాఁ
జేరియుఁ జేరక నీ చేయవ దాఁగినది. ॥ఎవ్వతె॥

మాట[1] లాడుచును మోవి మఱఁగు సేసినదొక
పూఁటలోనె నీ కాఁగిటి పొంచులనుబ్బినది
యేఁటికిరా తిరువేంకటేశుఁడ బొంకఁగ నీ
నాటకపు[2] బ్రియముతో నన్నుఁ గలసితివి. ॥ఎవ్వతె॥ 356

## ధన్నాసి

ఏమి బాఁతి నేఁడిదె నీకు మముఁ
గామించు సిరులింతె కదవయ్యా ॥పల్లవి॥

వెనక ముందర వెలయఁగ ముందర
వెనకలింతే విభవాలు
వనితల పిఱుఁదులు వాఁడికుచములు కొప్పు
కనుఁగొన భ్రమలింతె కదవయ్యా ॥ఏమి॥

వెలుఁగు చీఁకటి విరసాలు విభవాలు
కలిమిలేములే కదవయ్యా
పలువన్నెమాటలు పసనితేటలు నివి
కలవెంత కలలింతె కదవయ్యా ॥ఏమి॥

పగటుగుబ్బలు పాయపునడపులు
తగులుమాఁటలు తమకయ్యా
తగు వెంకటగిరిదైవమ నీ పొందు
తగులు దొరకుటమృతము సోఁకుటయ్యా. ॥ఏమి॥ 357

1. పె-రే. ౨౮. మాఁట. 2. నాఁటకపు.

ముఖారి

మాఁటలు[1] నేరుతువుగా[2] మాయమ్మా
యేఁటికి నాతని[3] నీవే యేలవమ్మా ॥పల్లవి॥

[4]చేయరాని విన్నపాలు నేసినేసి విభునింత
మాయలఁ బెట్టితివి[5]గా మాయమ్మా
రాయడించి[6] యిఁకను నారాజ్యమెల్ల నీవే
నేయవమ్మా నేనేమి[7] నేసేనమ్మా ॥మాఁట॥

ఎందును నీకతఁడు నోరెత్తకుండ మంత్రాలు
మందులు నేరుతువుగా[8] మాయమ్మా
చెందరాని సుఖమెల్లఁ జెలఁగి యాతఁడు నీవే
చెందవమ్మా నాకేల చిన్నదానికమ్మా ॥మాఁట॥

వన్నెల వెంకటపతి వలఁబెట్టి[9] యతనిచే
మన్ననఁ బొందితిగా మాయమ్మా
నన్నుఁజూడుమిఁకను నీ ననిచిన[10] యతఁని నే
సన్నలఁ జిక్కించుకొంటిఁ జాలదా నాకమ్మా. ॥మాఁట॥ 358

అమరసింధు

తలఁచిన దేహము నిలువదు తానును దలఁచునో తలఁచడో
వలనుగఁ జెలిమాటలు విని వచ్చినో రాఁడో ॥పల్లవి॥

శిరసున నంటిన పునుఁగిటు[11] చెక్కుల జారెడిననుచును
ఉరవడిఁ దివియుచుఁ గొనగోరూఁదిన చందములు

---

1. వి-రే. ౧౦౯, ౧౧౨. మాఁటలాడ. 2. నేరుతుగా. 3. ౧౦౯. నిందరి నీవే. 4. ౧౦౯. లో ఇది రెండవచరణము. 5. ౧౦౯, ౧౧౨, ౧౧౯. బెట్టితిగా. 6. ౧౦౯, ౧౧౨. రాయిడించి. 7. ౧౦౯. నాకేమి. 8. వి-రే. మూఁడిటను - నేరుతుగా. 9. ౧౦౯. వలపించి. 10. నను పైన. 11. వి-రే. ౫౨. పుణుగిదె.

మురిపెపు మొలనూళ్ళపై (ళులపై?) మొగపుల సొబగులు చూచుచు
నరుదుగ గరమున నక్కడ[1] నంటెడి యాసలును ॥తలఁచి॥

చెనకుల వీడెపురసమిదె సెలవులఁ జెదరెడిననుచును
సుసుపగు గోళ్ళ (ళుల?) వాతెర నొక్కినచందములు
పెనగొను ముత్యపుసరముల పెక్కువ దీర్చెదననుచును
చనవునఁ జనుఁగవపైఁ జే[2] చాఁచిన చందములు ॥తలఁచి॥

వుద్దపు నడపులలోపల నొయ్యన పాదము జారిన
నొద్దికతో నునుఁగౌఁగిట నొరసిన చందములు
నిద్దపుఁ దిరువేంకటగిరినిలయుఁడు నసుఁ దనకౌఁగిట
నద్దిన[3] కస్తురిచెమటల నలమిన చందములు. ॥తలఁచి॥ 359

భూపాళం

సువ్వి సువ్వి సువ్వాలమ్మ
నవ్వుచు దేవకి నందనుఁ గనియె ॥పల్లవి॥

శశి వొడచె అలసంబులు గడచె
దిశల దేవతల దిగుళ్ళు విడిచె ॥సువ్వి॥

కావిరి విరిసె కంసుఁడు గినిసె
వావిరిఁ బువ్వులవానలు గురిసె ॥సువ్వి॥

గతిసేసె అటు గాడిద గూసె
కుతిలకుడిచి జనకుఁడు నోరుమూసె ॥సువ్వి॥

గగురు పొడిచె లోకము విధి విడిచె
మొగులు గురియఁగ యమున[4] పై నడచె ॥సువ్వి॥

కలి జారె వెంకటపతి మీరె
అలమేల్మంగనాచారలుకలు దీరె. ॥సువ్వి॥ 360

---

1. నక్కరఁ గరమున. 2. వున నక్కడఁ జేతులు. 3. నద్దిక. 4. ఇది వె-రే. ౨౮ ; సా-రే. యఁగనెమున.

92-వ రేకు. శ్రీరాగం [1]

వాఁడు నాకు నిక్కముగా వలచినను
నేఁడు వచ్చి బంటువలె నిలుచుండుమనవే ॥పల్లవి॥

సిగ్గు గొంత పనులపై చింతగొంత తనకు
యెగ్గు గొంత నామీఁదనేఁటివలపే
అగ్గలమై తానేతే అన్నిలోకములును
తగ్గనీక నాకునిచ్చే దక్కఁగ నిమ్మనవే ॥వాఁడు॥

బొంకు గొంత సత్యముల పొందు గొంత తనకు
యింకా మానఁడు నాపై నేఁటివలపే
సంకెలేక వెంటవెంట నటవెల్ల విడిచి
కొంకక నాయందలము గొలిచి రమ్మనవే ॥వాఁడు॥

రచ్చగొంత రావుగొంత రాజసము దనకు
యెచ్చుగొంత కుందుగొంత నేఁటి[2] వలపే
వెచ్చనై కౌఁగిటఁగూడె వేంకటేశ్వరుఁడు
మచ్చిక నిట్టెయాకు మడిచి[3] యిమ్మనవే. ॥వాఁడు॥ 361

రాగాలపేళ్ళు - సావేరి - జంపె

మెచ్చెనొకరాగంబు మీఁద మీఁద కడు
నిచ్చెనొకరాగంబు యింతులకునెల్ల ॥పల్లవి॥

చేసెనొకరాగంబు చెలియెదుటఁ గన్నులనె
మూసెనొకరాగంబు ముదిత మతినె
పూసెనొకరాగంబు పొలఁతిపులకలమేన
వ్రాసెనొకరాగంబు వనిత నినుఁబాసి ॥మెచ్చె॥

1. వి-రే. లా౩. అటతాళం. 2. వి-రే. లా౩. గొంత యేఁటి. 3. మణిచి.

పట్టెనొకరాగంబు ప్రాణములపై నలిగి
తిట్టెనొకరాగంబు తిరిగి తిరిగి
పుట్టెనొకరాగంబు పొలఁతిడెందమునకును
మెట్టెనొకరాగంబు మెరయుచునె కదలి ॥మెచ్చె॥

కురిసెనొకరాగంబు కొప్పు పువ్వులనె సతి
మురిసెనొకరాగంబు ముంచి మేన
తిరువేంకటేశ్వరుఁడ తెలుసుకో నినుఁబొంది
పొరసెనొకరాగంబు పొలఁతికుచములనే. ॥మెచ్చె॥ 362

## రామక్రియ

చాలుఁ జాలు నీతోడి సరసాలు యిట్టె
పాలిండ్లకొంగుజారి బయటఁ బడితిమి ॥పల్లవి॥

సిగ్గువడితిమిర నీ చేసిన చేఁతలకు
నగ్గమైతిమిర మరునమ్ములకును
దగ్గరి నీకాఁకలఁ దగులఁబట్టి నేఁడు
బగ్గన నిందరిలోనఁ బలచనైతిమి ॥చాలు॥

నొగిలితిమిర నేము నోఁచిన నోములకు
పొగిలితిమిర నీ పొందులకును
తెగి నీవు నన్ను రతిఁదేలించి తేలించి నాకు[1]
పగటు బిగువులెల్లఁ బచ్చిగాఁ జేసితివి ॥చాలు॥

దప్పిఁ బడితిమిర నీ తాలిములనే కడు
నొప్పిఁ బడితిమిర నీ నొక్కుఁజేఁతల
ఇప్పుడిట్టె తిరువేంకటేశుఁడ నీవు నా
కొప్పు సవరము దీసి కొల్లగొంటి మానము. ॥చాలు॥ 363

---

1. వి-రే. ౯-౨. తెగి నీవు నడివీధిఁదేలించఁగా నాకు.

కాంభోది

వలపేడఁ గలిగెనే వామలోచనకు దీని
వలపించినటువంటివాఁడింకనెవ్వఁడో ॥పల్లవి॥

సిరుల గల మోమెల్ల చిరునవ్వుగనుదోయి
విరివైన వురమెల్ల వేఁకమైన గుబ్బలు
తరుణికి వెనకెల్లఁ దురుము పిఱుఁదులును మంచి
నిరతఁపు నడపెల్ల నిండుమురిపెములు ॥వల॥

జలజాక్షినిలువెల్ల చక్కఁదనముల పోగు
కలికితనమెల్లఁ గన్నులపండువు
కలకంటివయసెల్లగడుఁ గోమలము దీని
పలుకుఁదేనియలెల్ల పంచదారకుప్పలు ॥వల॥

చెలువైన మోవెల్ల చిలుకవోట్లు దీని
కలదేహమింతయునుఁ గస్తూరివాసనలు
అలరించెఁ దిరువేంకటాధీశ్వరుఁడు దీని
తలఁపెల్ల విభునిలో దాఁగున్న కరువు ॥వల॥ 364

కాంభోది

ఎవ్వతిర ప్రియము నీకింత నేసినది చూచి
దవ్వుల నిన్నొకమాఁట తగులనాడినది ॥పల్లవి॥

సిబ్బెంపు గుబ్బలమీఁది జిలుగుఁబయ్యెదది
గబ్బిచూపు నిన్నుఁజూచి కన్నుల నవ్వినది
బబ్బిలికాయలతోడి పసిఁడిమెట్టెలది
జొబ్బిలిన చెమటలచేఁ జొక్కి నిలిచినది ॥ఎవ్వ॥

తొంగలిరెప్పలతోడి తోరపుఁ గన్నులది
చెంగటిచెలియచేతఁ జెయివేసి నవ్వినది

చెంగలువబంతిచేతఁ జెక్కునొక్కినది
వుంగరాలవేళ్ళ సికొయ్యనె మొక్కినది ॥ఎవ్వ॥

పీడక పీడని కొప్పువిరులు జారినది
వాడక వాడనిమోవివన్నెలు దోఁచినది
యీడులేని తిరువేంకటేశ నినుఁబొంది యీ
కోడెవయసునసింతి కోరికెలందినది. ॥ఎవ్వ॥ 365

ఆహిరి

జిగురుపంటివాఁడె శినకాటి చింత
శిగురమ్మఁబోసీఁడె శిన[1] కాటి ॥పల్లవి॥

సేఁతి[2] కత్తికవాఁడు సెడ[3] కుండ దాఁచిన
పాఁతపెద్దవిల్లు బయివున
నాఁతికొరకు వచ్చి నడిమికి విజిశిన[4]
శేఁతలాఁడుగదె శినకాటి ॥జిగురు॥

రట్టడిశేఁతల రాకాశినాయని
పట్టపుశెలి[5] యలిఁ బడవేశి
కొట్టఁగొనముక్కు గోశివేశినట్టి
శిట్టగీఁడుగదె శినకాటి ॥జిగురు॥

నలువున వెంకటనగమునఁ గోనేటి
నెలవున సొంపుతో నెలకొని
కలిమి పడుసుతోడి కాఁపురమున్నట్టి
శిలుగులాఁడుగదె శినకాటి. ॥జిగురు॥ 366

93-వ రేకు. పాడి

జాజు[1] జాజేకాక దిరిశపుఁబువ్వొనా
నిజాదెంతయిన నీవు మానేవా ॥పల్లవి॥

---

1. ని-రే. ౦౫౫. చిన. 2. చేఁతి. 3. చెడ. 4. చిన. 5. పుఁజెలి. 6. ని-రే. ౧౧౯. జాజి.

సంపెంగపూవులలోన సారెకుఁ జూచిన తన
కంపే కాక తనకాఁక మానీనా
యింపులు గొందరికె యీ రసాలు గొందరికి
జంపుల నీ గుణముల జాడ మానేవా ॥జాజు॥

పొగడ పూవులలోన పొందుగఁ జూచిన తావి[1]
తగుఁగాక తా మదము మానీనా
నిగిడిన నీచేఁత నీ బోంట్లకే కాక
మగిడి నీగుణములు మంచివయ్యీనా ॥జాజు॥

కామించి కలువలు కన్నులనద్దుకొనిన
కామునమ్ములు నేఁడు గాక మానీనా
దీమసపు వెంకటేశ తెమలని[2] కూటముల
ఆమని మాకోరికల ఆస మానీనా. ॥జాజు॥ 367

ముఖారి

వంచిన పన్నీటఁబో వాడె నీమోము
మంచునఁ దామెరపొంపు మాయుఁగదవే. ॥పల్లవి॥

సంపెంగ నూనియనే మజ్జనము సేయఁగఁ బో
చెంపజారి తురుమెల్లఁ జెదరి[3] నేఁడు
గుంపులైన తుమ్మిదలు కొమ్మ నీయలకలివి
రంపపుఁగంపునకు వెరచుఁగదవే ॥వంచిన॥

జవ్వాది యెప్పుడు నీనొసల మెత్తఁగానె పో
యెవ్వరు విలిచిన నోరెత్తవు నేఁడు
కొవ్విన చిలుకపలుకులు దీనిగాలికి
దవ్వుదవ్వులనె కడు దాఁగుఁగదవే ॥వంచిన॥

1. తావే. 2. తెమ్మలని. 3. వి-శే. జా. చెదర.

ఒక్కపై వేంకటపతిమగఁడౌ త్రినరేఖలఁ బో
చక్కని సీమసుఁగొంగు జారీ నేఁడు
జక్కవపులుఁగులివి చందురుఁడుదయమైన
వుక్కమీరి బెదరుచున్నయుఁ గదవే. ॥వంచిన॥ 368

శంకరాభరణం

సల్లుసూపుల సలమాటి[1] యాఁక
సెల్లఁబో నన్ను సెనకేఁడుగా ॥పల్లవి॥

సంకు సక్రముల సక్కనయ్యకుఁ దన
వుంకువవో నావాశ్శెల్లా
సంకసున్న తన సదురాలి మొరఁగైన
సింకసూపు నాపై సిమ్మేఁడుగా ॥సల్లు॥

మాపురేపుసూపు మాయలయ్యకుఁ దన
దాఁపురమువో నాతలఁపెల్లా
పీఁపురమణికంత[2] వెలవకయునఁ దన
పూఁపనవ్వు నాపైఁ బుయ్యేఁడుగా ॥సల్లు॥

వుసురుఁబడుకమీఁదనొరఁగిన్న సక్కని
రసికుఁడు వేంకటరాయఁడు
పసపుశీర నాకుఁ బరవుగాఁ బరచించి
యెసగ[3] నిట్టె సనవియ్యేఁడుగా. ॥సల్లు॥ 369

కేదారగౌళ

తనివిదీరమికిఁ గుబ్బెనలె యూప
అనుమతులకుఁ దాఁకవాడుటే యూప ॥పల్లవి॥

1. ని-రే. ౨౦. సలమరి. 2. ని-రే. రాజ. కత్త. 3. ౨౦. యెసగి.

సరినెలయింపులకు సళుపుఁజూపులె యాస
  గిరుపుఁగన్నులకు జంకెనలె యాస
  సరసంబునకు నలసపుఁ గసరులే యాస
  మరుపెరరేఁపులకు మంతనమె యాస ॥తనివి॥

కడుఁ గోరికలకుఁ లోఁ గాఁతాళములె యాస
  చిడిముడికాఁకలకుఁ జింతలే యాస
  బడలికకౌఁగిటికి బట్టబయలే యాస
  పడరానియెడఁ గడపటిచేఁతె యాస ॥తనివి॥

రతిసమయమునకు రాకొట్టులే యాస
  అతిమోహమునకుఁ గయ్యములె యాస
  యితమైన తిరువేంకటేశు కౌఁగిటఁగూడి
  మతిలోనికెపుడుఁ దమకములె యాస. ॥తనివి॥ 370

శుద్ధదేశి

మొలనూలి గొల్లెత మురియుచును
  వలవంతఁ దిరిగిని వాడవాడలను ॥పల్లవి॥

సంపెఁగలతురుముతో చల్లలమ్మీనిదివో
  వంపుమోము గొల్లెత వాడలను
  యింపులకోరికె[1]తో నిందిరాపతి యెదుట
  జంపుల నటనలతో సాళగింపుచును ॥మొల॥

నొసలికస్తూరితోఁ గన్నుల నవ్వీనిదివో
  వసివాడు గొల్లెత వాడలను
  కసరుచు హరిమీఁదికాఁకల కోపముతో
  యెసరుఁజెమట గోర[2]యెమ్మెలఁ జిమ్ముచును ॥మొల॥

1. పె-రే. ౨౮. కోరిక. 2. ని-రే. ౧౧౨. గొనయెమ్మె.

చెలువంపుటుంగరాల చెయి వీచీనిదివో
వలపుల గొల్లెత వాడలను
కలికియై తిరువేంకటవిభుకాఁగిట
అలసిన నటనల నల్లంతనేఁగుచును. ॥మొల॥ 371

శంకరాభరణం

మొట్టో నేననఁగానే మొక్కేవుగాని
వెట్టినేను వెట్టినేను వెట్టినేను సుమ్మీ ॥పల్లవి॥

సడ్డలాడఁగానే కడు జారినపయ్యెద చూచి
యెడ్డ నన్ను జాణఁజేసేవేఁటికో కాని
వడ్డివారే వలపుల వన్నెవెట్టనేర నే
గొడ్డేరే గొడ్డేరే గొడ్డేరే సుమ్మీ ॥మొట్టో॥

ఒల్లననఁగానే నన్నునుద్దండపుఁ దుటారాల
చల్లలమ్మఁగానే పగ చాటేవు గాని
కల్లలాడనేర నీతో కపటాలు నేర నే
గొల్లదాన గొల్లదాన గొల్లదానఁ జుమ్మీ ॥మొట్టో॥

వేంకటేశుఁడ నేనంటా వేసాలఁ బొయ్యేనంటా
అంకులచేతులుచూచి యంటితి గాని [1]
కంకిగా గుబ్బలమీఁద గాజునఁ దీసేవు నే
వుంకువాల్ల నుంకువాల్ల నుంకువాల్లఁ జుమ్మీ. ॥మొట్టో॥ 372

94-వ రేకు. కేదారగౌళ

దశవిధాచరణం తన్నభవతి
దశవిధావస్థార్థం తే తత్ర ॥పల్లవి॥

1. ౭-రే. ౧౧౭. యంటితిఁగాని

స్థాపయిష్యామి వేదానితి వ్యాజేన
దీపితోయం మత్స్యదేహః పురా
వ్యాపారోయమేవం చచ తరుణ్యా
రూపజలధౌ కేళిరుచయే తత్ర ॥దశ॥

ధారయిష్యామి మందరమితి వ్యాజేన
చారుకచ్ఛపవిధాచరణం పురా
నీరసేయం తవ మనీషా ప్రియవధూ
ధారకుచమందరౌ[1] భర్తుం తత్ర ॥దశ॥

భువముద్ధరిష్యామి పునరితి వ్యాజేవ
ధవళకిటివైభవం ధత్సే[2] పురా
వ్యవహృతిరియం నచ మహామహీకుచతటే
తవ దంతక్షతం దాతుం తత్ర ॥దశ॥

దనుజం హరిష్యామి తమితి వ్యాజేప
ఘన నారసింహవిక్రమణం పురా
దనుజహార తవ మహత్త్వం తన్నచ మఖా
ర్జసమిందిరాయా (యాం ?) ప్రసర్తుం[3] తత్ర ॥దశ॥

అపహరిష్యామి బలిమహమితి వ్యాజేన
కపటవామనరూపకలనం పురా
నిపుణ ఏవం నఖలు వియతిస్సతీషు తే
కపటాచరణం ఘటయితుం తత్ర ॥దశ॥

సంహరిష్యామి నృపజనమితి వ్యాజేన
బహ్వారుణతోయే ప్రాప్తిః పురా

1. వి-రే. ఉ-రా. మండలౌ. 2. ధత్తే. 3. మహత్వం తంనచ నఖలు - జననం ప్రియాంచ ప్రసర్తుం.

సింహావిక్రమణతే స్థితిరియం నచ సతీ
విహ్వాలత్వం తదా వేత్తుం తత్ర[1] ॥దశ॥

రావణం జేష్యామి రణ ఇతి వ్యాజేన
భావరత్వే తే భోగః పురా
ఏవం నభవతి మహీసుతా విరహం
సావధానేన ప్రహర్తుం[2] తత్ర ॥దశ॥

కంసం హనిష్యామి ఛలమితి వ్యాజేన
సంసారోయమాచరితః పురా
హింసాదూరత నచ హితమిదం వ్రజవధూ
సంసరణలీలాం ప్రసక్తుం[3] తత్ర ॥దశ॥

పాతయిష్యే[4] ప్రలంబమితి వ్యాజేన
జాతరోషస్య తే జననం పురా
ధాతరక్షక తే ప్రభుత్వం తన్నఖలు[5]
భూతలే రేవతీం భోక్తుం తత్ర ॥దశ॥

బుద్ధో భవిష్యామి పురహృతివ్యాజేన
బద్ధరోష ఇతి తే[6] ప్రాప్తిః పురా
తద్ధితం నహిఖలు[7] తదా[8] వధూహస్త[9]
సిద్ధప్రసారేణ సేవితుం తత్ర ॥దశ॥

మారయిష్యామి కలిమతమితి వ్యాజేన
క్రూర కల్క్యవతారకోపః పురా
ధీర వేంకటనగాధీశ ఏవం నఖలు
భీరుమూర్వీం సంశ్రమయితుమత్ర ॥దశ॥ 373

---

1. సా-రే ;; పె-రే. తాళ. సంహ్వా, బంహ్వా, సింహ్వా, వింహ్వా అనియే ప్రాస పాఠము ; ని-రే. సంహా, బంహా, సింహా, వింహా. 2. ని-రే. విరహే సావధానం ప్రసర్తుం. 3. ప్రసర్తుం. 4. యిష్యామి. 5. సా-రే. తం నఖలు. 6. ని-రే. రోషస్యతే. 7. నఖలు. 8. సా-రే. తధా. 9. హస్తాప్ర.

ముఖారి [1]

ఎంత సేయఁగనేరదింతి గోపించినను
కంతుని గెలిపించెను ఘనుఁడైన విభుని ॥పల్లవి॥

సతినింత తాపాన చందురుఁడేఁపఁగఁ బో
ప్రతిచందురుండాయ పడఁతిమోము
అతివఁ గోవిలకూఁతలలయించఁగాఁ బో
తతిఁ గోవిలలకూఁత తానాయఁ బలుకు ॥ఎంత॥

మలయానిలుఁడు దన్ను మలసి యేఁచఁగఁ బో
చెలివూర్పు చిరుగాలిఁ జిత్రించెను
తలపోఁతయింత చిత్తము సేయఁగాఁ బో
కలికిచిత్తము పతికడకంటెనిపుడు ॥ఎంత॥

తిరుగఁ జంద్రుఁడు తన్ను తిలకించగాఁ బో
ధరియించెఁ గుచముల తానతని
తిరువేంకటగిరిదేవునికౌఁగిటి
సిరులఁబో యిన్నిటాఁ జెలువాయె నిపుడు. ॥ఎంత॥ 374

ఆహిరి

నిన్నుఁ గూడిన విభుని నిలువెల్ల సొంపాయ
నిన్నియును నొనగూడె నింతలోపలనె ॥పల్లవి॥

సొలపు నీ కడగంటిచూపు హృదయము గాఁడి
లలినితఁడు శ్రీవత్సలాంఛనుండాయ
వెలఁది నినుఁ బెడఁబాసి విరహంపుమెయికాఁక
వలన నీతఁడు నీలవర్ణుఁడైనాఁడు ॥నిన్ను॥

1. ని-రే. ౭౭. ఆహిరి.

అదన నీ చనుగుబ్బలను చక్రముల చేతఁ
బదిలపరపుచు చక్రపాణియైనాఁడు
సుదతి నీదేహమున సొబగు కుంకుమపూఁత
వెదిగి పీతాంబరంబీతనికి నాయ ॥నిన్ను॥

ఆలింగనాపేక్షననయంబు నిసుఁగూడ
లోలుఁడటుగాన నాలుగుచేతులాయ
శ్రీలలితమూర్తియగు శ్రీ వేంకటేశ్వరుఁడు
పాలించె నిను నీకుఁ బరితోషమాయ. ॥నిన్ను॥ 375

ముఖారి

కందువ[1] నేఁడెందరైనాఁ గలరు నీకు
యిందరిలో నాప్రియమిఁదేరీనా ॥పల్లవి॥

సన్నలు సేసేటి[2] వారు సరసమాడేటివారు
కన్నుల మొక్కేటివారు గలరు నీకు
విన్నపై యిందరికిని వెరవనే కాక నా
విన్నపమెంతైన నీకు వినఁదీరీనా ॥కందు॥

తేఁకువఁ జేరేటివారు తేనెల మాఁటలవారు
కాఁకలు సేసేటివారు గలరు నీకు
యేఁకటనిందరికడ నెడతాఁకనేకాక
సోఁకనాడే నావంక చూడఁగూడీనా ॥కందు॥

ముద్దులు గునియువారు ముచ్చటలాడెడివారు
గద్దించి తిట్టెడివారు గలరు నీకు
తిద్దిన సేవిద్యలివి తిరువేంకటేశ నా
వొద్దఁ గూడి యిట్టి నీకు వుండఁగూడీనా. ॥కందు॥ 376

1. వి-రే. ౧౨. కందువవైనే. 2. సేసెడి.

95-వ రేకు. మాళవిగౌళ[1]

సీతక పడుసు దోసిటి పాల మగఁడు
బాతి[2] పడిన నగపడునటె వీఁడు ||పల్లవి||

మూ(?)డు గాళ్ళపెద్ద ముసలి నవ్వుచుఁగొన్న
పాఁడిమేకల పాల పాశము
వేఁడి బుట్టినతల్లి వేఁకటియై కన్న
వాఁడు వీఁడు శిన్న[3] వాఁడటె వీఁడు ||సీత||

కొండలంత నసు[4] గుబ్బల రారాశి
మిండెత గవిశిపై మింగ రాఁగా
గుండె పగులనొక్క కోలనె సరగన[5]
సెండివేసినట్టి సిసు[6] వటె వీఁడు ||సీత||

వుడుకు నుదుటివాఁడు వుదుటున దా(ఁ)సిన
బెడిదపు మోతల[7] పెనువిల్లు
తొడికి విరిశివేశి దోమటి నునుఁబాల
కడుపుల తొలి[8] పెండ్లికొడుకటె వీఁడు ||సీత||

మారుదల్లి నేతిమాటలఁ బడలేక
వూరు విడిశి యడవులకేఁగి
సేరవచ్చిన యింతి నెవులు ముక్కుఁగోశి
పేరువారిన పెద్దబిరుదటె వీఁడు ||సీత||

పొగదాఁగు తపసుల పుల్లవెలుగు మంట
లగడు శేయఁగ ముగురసురల
సగము సాయ సంపి సడిఁబెట్టి విడిశిన
బగిడికాఁడు సిన్నపడుసటె వీఁడు ||సీత||

1. ని-రే. లా. వరాళి. 2. బాఁతి. 3. పిన్న. 4. చన్ను. 5. సరుగన. 6. శెండివేశినట్టి శిశు. 7. ఉడుకు నుదుటికంటి ఉదురు మిడుకువాసు - బెడిదపు, రవములు. 8. లతగు.

ముసముస మెరసేటి మొగముమీఁదిపై
పసలఁ దగిలి వెంటఁ బారి పారి
గసికె వింటికోల గరిగాఁడనేసిన
మసిమాయల సలమరి గదె వీఁడు ॥సీత॥

రవ్వల నేఁతల రాకాసిదాయని
కొవ్విన మదము తె[1]క్కోఁలుగొని
యివ్వలఁ దిరువేంకటేశుఁడై యున్నాఁడు[2]
గువ్వైక నిను జట్టిగొనెఁగదె[3] పీఁడు. ॥సీత॥ 377

శ్రీరాగం

ఇప్పుడెట్లున్నదో యిందువదన
అప్పటికిఁ గొంత గుణమాయ నావేళ ॥పల్లవి॥

తెలుప శశికాంతవేదికమీఁద మలఁగుపై
నొలిగి పరితాపాగ్నినుడుకఁగాను
నెఱి దొలఁకు మోమువెన్నెలకు శశికాంతముప్పు
టలఁగు గరఁగిన శైత్యమాయెనావేళ ॥ఇప్పు॥

చెలియ పొన్నల విడ (పీడ ?) చిగురుఁబానుపుమీఁద
పలుమారు నినుదూరి పాడఁగాను
చెలఁగి పొన్నల విరియు చిలుకుఁదేనెల సోనఁ
దెలవొంది కొంత వడదీరెనావేళ ॥ఇప్పు॥

తొయ్యలి విలాసమున తూఁగు మంచముమీఁద
పయ్యెదరజార నినుఁ బాడఁగాను
తియ్యమునఁ గూడితివి తిరువేంకటేశ్వరుఁడ
నెయ్యంపు వేడుకలు నినిచెనావేళ. ॥ఇప్పు॥ 378

1. రవ్వైన శేతులు రండు వడులు గల - కొవ్విన అసుర డెక్కోలు. 2. దై యిదె వీఁడె. 3. పువ్వుల వూజులఁ దొదలీ, "మాఁదుదల్లి' — "ముసమిస' అను రెండుచరణములు ని-రే. లో లేవు.

ఆహిరి

ఎంత మన్నించితో యీ యింతిని దె నీవు
అంతకంతకుఁ బ్రేమనలరీనిపుడు ॥పల్లవి॥

పడఁతి నాట్యశ్రాంతిఁ బవళించి తొల్లి నీ
తొడలపై నీవు తల దువ్వఁగాను
కడలేని యటువంటి కళలు దలఁచే కదా
విడువని వియోగమున వేఁగీనిపుడు ॥ఎంత॥

ఒనరఁ గుచభారమున నొరఁగి యీ మలఁగుపై
నెనసి నీవాకు మడిచియ్యఁగాను
వనిత నేఁడటువంటి వలపుదలఁచే కదా
ఘనమైన తాపమునఁ గాఁగీనిపుడు ॥ఎంత॥

సిపుఎ నీమోముపైఁ జెక్కులొయ్యన చేర్చి
యరమోడ్చి కనురెప్పలలమి యలమి
తిరువేంకటాచలాధిపుఁడ నినుఁ గూడియే
పరవశానంద సంపదఁ దేలెనిపుడు. ॥ఎంత॥ [1] 379



1. ఈ రేకులో ఇఁక ను వ్రాయవలసిన రెండు కీర్తనలకు చోటు విడువఁబడినది. ౯౬, ౯౭, ౯౮, ౯౯, ౧౦౦. సంఖ్యల రేకులు నష్టములైనవి.

# సూచిక 1



## సంకీర్తన రాగముల అకారాది సూచిక

| రాగములు | | సంకీర్తన సంఖ్యలు |
|---|---|---|
| అమరసింధు | ... | 359. |
| ఆహిరి | . | 3, 4, 8, 10, 32, 49, 58, 68, 69, 74, 76, 77, 84, 85, 92, 118, 123, 124, 125, 130, 136, 142, 147, 154, 158, 163, 180, 181, 187, 196, 202, 236, 248, 250, 257, 259, 262, 266, 277, 285, 301, 304, 316, 325, 330, 333, 344, 346, 347, 350, 355, 366, 375, 379. |
| కన్నడగౌళ | .. | 88, 116, 117, 157, 222, 305, 338. |
| కాంభోధి | ... | 5, 16, 46, 65, 99, 112, 114, 121, 141, 145, 164, 171, 172, 183, 198, 210, 231, 234, 253, 337, 364, 365, 373 |
| కేదారగౌళ | .... | 282, 352, 370. |
| కొండ మలహరి | . | 174, 323. |
| తెలుఁగుఁగాంబోధి | .... | 86, 321. |
| దేవగాంధారి | ... | 279. |
| దేశాక్షి | .. | 160, 264, 293, 335. |
| దేశి | . | 25, 35, 204. |
| దేసాళం | | 73, 98, 178. |
| ధన్నాసి | | 166, 197, 226, 357. |
| నాట | .... | 140, 243. |
| నాదరామక్రియ | ... | 22, 80, 82, 113, 292, 351. |
| నారణి | | 109, 345. |
| నారణిదేశాక్షి | | 189. |
| పళవంజరం | .... | 120. |
| పాడి | .. | 19, 66, 72, 81, 100, 104, 106, 107, 129, 132, 159, 162, 169, 170, 228, 229, 302, 307, 310, 312, 367. |

| రాగములు | | సంకీర్తన సంఖ్యలు |
|---|---|---|
| బౌళి | . | 71, 185, 203, 233, 286, 298, * 328. |
| భూపాళం | .. | 230, 256, 276, 281, 324, 360. |
| భైరవి | .. | 2, 15, 23, 44, 51, 94, 97, 127, 217, 221, 240, 244, 309, 314, 356. |
| మంగళకౌశిక | .. | 38, 102, 219. |
| మలహరి | . | 139, 342. |
| మాళవశ్రీ | .. | 53. |
| మాళవి | ... | 137, 188, 225. |
| మాళవిగౌళ | | 334, 377. |
| ముఖారి | | 7, 9, 17, 21, 28, 42, 52, 57, 63, 64, 75, 89, 93, 95, 96, 111, 119, 135, 155, 156, 186, 201, 205, 206, 207, 208, 212, 213, 215, 220, 238, 239, 258, 268, 274, 283, 284, 290, 296, 297, 299, 308, 320, 331, 348, 349, 358, 368, 374, 376. |
| ముఖారిపంతు | .... | 175. |
| మేచబౌళి | ... | 267. |
| రామక్రియ | ... | 14, 30, 61, 149, 214, 303, 306, 317, 327, 339, 363. |
| రీతిగౌళ | . | 165. |
| లలిత | ... | 48, 105, 294. |
| వరాళి | ... | 34, 40, 91, 115, 122, 150, 190, 193, 270, 271, 287, 322. |
| వసంతం | .. | 18. |
| వసంతవరాళి | . | 341. |
| శంకరాభరణం | . | 20, 24, 27, 70, 78, 108, 153, 173, 192, 194, 216, 241, 245, 246, 255, 265, 269, 315, 369, 372. |
| శుద్ధదేశి | ... | 59, 252, 371. |
| శుద్ధరామక్రియ | .. | 143. |
| శుద్ధవసంతం | .... | 39, 62, 67, 179. |

* రేకులో 'భవుళి' అనియున్నను ఇది బౌళిగానే పరిగణింపఁబడినది.

| రాగములు | సంకీర్తన సంఖ్యలు |
| --- | --- |
| శ్రీరాగం .. | 1, 6, 12, 26, 29, 41, 50, 79, 83, 87, 101, 103, 110, 126, 134, 148, 152, 177, 182, 184, 190, 195, 200, 211, 223, 224, 235, 242, 247, 249, 251, 261, 263, 272, 275, 278, 280, 288, 291, 300, 311, 318, 329, 332, 343, 353, 354, 361, 378. |
| సామంతం .. | 11, 13, 31, 33, 37, 43, 47, 54, 56, 128, 131, 133, 138, 144, 146, 161, 167, 168, 176, 199, 218, 227, 232, 254, 260, 289, 295, 313, 319, 326, 336, 340. |
| సావేరి .. | 362. |
| సాళంగం | 90, 209. |
| సాళంగనాట .. | 45, 237. |
| సౌరాష్ట్రం .. | 55. |
| సౌరాష్ట్రగుజ్జరి .. | 151. |
| హిందోళవసంతం .. | 273. |
| హిజ్జిజి .. | 36, 60. |

## సూ చి క 2



# సంకీర్తనల అకారాది సూచిక

* వెనుక పుటలలో పుటసంఖ్య యని యుండుట పొరపాటు.

| సంకీర్తన | | రాగము | | సంకీ. సంఖ్య |
|---|---|---|---|---|
| పెట్టని కోటిందరి | ... | బౌళి | .... | 185 |
| పెద్ద పిన్నవరుస | ... | సామంతం | .... | 295 |
| పేగుల జంద్యాలు | .... | కాంభోది | .... | 253 |
| పై పై దూరక | .... | ముఖారి | .... | 186 |
| పొందెఱుఁగుదునం | .... | కాంబోది | .... | 65 |
| పొదలిన వీడెపు | .... | సామంతం | .... | 31 |
| పొదలు నీ సొబగెల్ల | .. | ముఖారి | .... | 75 |
| పొద్దిఁక నెన్నఁడు | .... | సామంతం | .... | 138 |
| పొద్దు వొద్దుకును | .... | కాంబోధి | .... | 16 |
| పొద్దువోకలవి | ... | ముఖారి | .... | 274 |
| పోడిగా నేఁడతని | ... | శంకరాభరణం | .... | 108 |
| పోనీ పోనీలే | .. | శంకరాభరణం | .... | 27 |
| ప్రతిలేని పూజ | .... | శ్రీరాగం | .... | 300 |
| ప్రలపనవచనైః | .... | శుద్ధవసంతం | ... | 39 |
| బండి దొక్కెఁబాము | .... | లలిత | .... | 48 |
| బండివిటిచి | .... | ధన్నాశి | .... | 226 |
| బందులీఁదించేవే | .... | ఆహిరి | .... | 196 |
| బహుకర్మభోగంపు | .... | బౌళి | .... | 298 |
| బిగ్గఁ గాఁగలించు | .... | శ్రీరాగం | .... | 263 |
| బొంకకురే చలు | .... | సామంతం | .... | 340 |
| భామ నోఁచిన నోము | .... | భైరవి | .... | 127 |
| భారపుటూర్పుల | .... | కాంబోది | .... | 337 |
| భావమెరఁగని | .... | ముఖారి | .... | 268 |
| భోగీంద్రశయనుని | .... | కొండమలహరి | .... | 174 |
| మగువ పూర్పుల | .... | శ్రీరాగం | .... | 12 |
| మచ్చికల మొగసిరి | ... | ఆహిరి | .... | 76 |
| మతికంటె వెలి | .... | ముఖారి | .... | 42 |
| మదము దొలకెడి | .... | సామంతం | .... | 54 |



తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి. 250. 22—10—56.